# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## మాయా సంసారం

Rangarao 24/6/85

రచన: వసుంధర

## అమ్మాయి పెళ్ళి

రచన: చంద్రశేఖర అజాద్

## దాగని నేరం

రచన: టెంపోరావ్

అగ్నికిరీటం - చివరి భాగం
విషకన్య - ప్రారంభం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ 139
జూలై, 1985
వెల. రు. 6-00
ఏడాది చందా: 72 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# మాయా సంసారం

## వసుంధర

అప్పుడే స్నానం చేసి వచ్చింది జ్యోత్స్న. కాసేపు అద్దం ముందు నిలబడి తన అందాన్ని చూసుకుని మురిసిపోయింది.

పిల్లలిద్దరూ బడికి వెళ్ళిపోయారు. భర్త ఆఫీసుకు వెళ్ళిపోయాడు. ఇప్పుడు జ్యోత్స్న తనూ బయటకు వెళ్ళేదానిలా బట్టలు వేసుకుంది. అయితే ఇప్పుడామె బయటకు వెళ్ళబోవడం లేదు. ఎక్కడున్నా పువ్వులా వుండాలన్నది ఆమె తత్వం. ఎంత పనిలో ఉన్నా ఆమె ముఖంలో చెరగని చిరునవ్వుంటుంది.

జ్యోత్స్న డ్రాయింగు రూంలోకి వెళ్ళి సోఫాలో కూర్చుని ఓ తెలుగు నవల తీసుకొని చదవసాగింది. చాలా మంది ఆడవాళ్ళకులా పడుకొని చదవడం ఆమె కలవాటు లేదు. తెలుగు నవలలంటే ఆమెకు ప్రాణం. తీరిక ఉన్నప్పుడల్లా ఆమె నవలలు చదువుతూంటుంది.

నవలలకోసం తీరిక చేసుకుంటుందని భర్త ఆమెను

# 4

తరచు వేళాకోళం చేసినా అది సరదాకు మాత్రమే! ఏ పనినీ ఆమె అలక్ష్యం చేయదనీ, వాయిదా వేయదనీ ఆమె భర్త జగదీష్‌కు తెలుసు. ఆ విషయం అతడి కళ్ళు చూసి తెలుసుకోవచ్చు.

జ్యోత్స్నకిద్దరు కొడుకులు. పెద్దవాడు రణధీర్‌కు పదేళ్ళు. రెండోవాడు రవిశంకర్‌కు ఏడేళ్ళు. పిల్లల వయసునుబట్టి ఆమెకు ముప్పై ఏళ్ళైనా ఉండాలనుకోవాలి తప్పితే చూడ్డానికామె మరీ పద్దెనిమిదేళ్ళ యువతిలా — ఆ పిల్లల అక్కలా ఉంటుంది. జగదీష్ మాత్రం ఆ పిల్లలకు తండ్రిలాగే ఉంటాడు.

ఆ యింట్లో అందరూ ఒకరికోసమొకరు జీవిస్తూంటారు. అందువల్ల ఆ చుట్టుపక్కల ఆ కుటుంబం గురించి ప్రత్యేకంగా చెప్పుకుంటారు. అలా చెప్పుకొనే వారిలో కొందరిది కాలక్షేపం. కొందరిది ఆశ్చర్యం. కొందరిది అసూయ.

ఇలాంటివారు కాక మరోరకం వారు కూడా ఉన్నారు. వారందరూ యువకులు. జ్యోత్స్నకు జగదీష్ తగడని వారనుకుంటారు. తామే కాక జ్యోత్స్న కూడా అలా భావిస్తోందని వారనుకుంటారు. ఆమె ఎవరినైనా చిరునవ్వుతో పలకరిస్తే అదే తమకు ఆహ్వానమనుకుంటారు. ఆ ఆహ్వానాన్నందుకునే అవకాశం రావడంలేదని వాపోతూంటారు. ధైర్యం చేయడానికి జ్యోత్స్న మరింత డైరెక్టుగా ఆహ్వానిస్తే బాగుండుననుకుంటారు. ఇవన్నీ బైటకు చెప్పకపోయినా ఆమె అందం గురించి యువక బృందం చర్చలు జరుపుతూనే ఉంటుంది. వారందరూ ఏకగ్రీవంగా తీర్మానించిన విశేషం — సుకుమార్ అదృష్టవంతుడని!

సుకుమార్ ఇంట్లోనే జగదీష్ అద్దెకుంటున్నాడు.

తన అదృష్టం సుకుమార్‌కి తెలుసు.

ఇంట్లో తండ్రి అతడు ఉంటున్నారు. అతడి తల్లి రెండేళ్ళ క్రితం చనిపోయింది. ఉదయం, సాయంత్రం వంటమనిషి వచ్చి వంట చేసి వెడుతుంది. ఆమె వయసు యాభైకి దరిదాపుల్లో ఉంటుంది. సుకుమార్ తండ్రి పదింటికి ఆఫీసుకు వెడతాడు. ఆయనకింకా రెండేళ్ళ సర్వీసుంది.

జగదీష్ తొమ్మిదిన్నరకే ఆఫీసుకు వెడతాడు. అతడు తిరిగివచ్చేది సాయంత్రం ఆరింటికి. అతడికి స్కూటరుంది.

జ్యోత్స్న పిల్లలిద్దరూ ఎనిమిదింటికే స్కూలుకు వెడతారు. వాళ్ళు సాయంత్రం నాలుగింటికి తిరిగివస్తారు. వాళ్ళకు స్కూల్ బస్ ఉంది.

ఉదయం తొమ్మిదిన్నరనుంచి సాయంత్రం నాలుగు వరకూ జ్యోత్స్న ఇంట్లో ఒంటరిగా ఉంటుంది. ఆమె బయటకు రావడం ఆ సమయంలో అరుదు.

ఉదయం పదింటినుంచి సుకుమార్ ఇంట్లో ఒంటరిగా ఉంటాడు. సాధారణంగా అతడా సమయంలో బయటకు పోయేవాడు. ఆర్నెల్ల క్రితం జగదీష్ కుటుంబం ఆ ఇంట్లో అద్దెకొచ్చినప్పట్నించీ అతడి కార్యక్రమాలు మారి పోయాయి.

జ్యోత్స్న ఇప్పుడతడి ఆలోచనలను పూర్తిగా ఆక్రమించుకుంది. ఇటీవల మన ఆలోచనల్లో, సంస్కారంలో వస్తున్న మార్పు ఇది. ఇది తప్పో ఒప్పో చెప్పలేము కానీ ఆలోచించాల్సిన విషయమే!

నచ్చిన, మనసైన యువతిపై ఆశలు పెంచుకోడం యే సంప్రదాయంలోనూ తప్పుకాదు. ఎటొచ్చీ అటువైన

ఒక స్త్రీకి ఒకే పురుషుడన్న సిద్ధాంతాన్ని మన సంప్రదాయం చెబుతుంది. వైవాహిక బంధంనుంచి విడివడేవరకూ, వైవాహిక బంధంలో ముడిపడేవరకూ—స్త్రీ పురుషులు విచ్చలవిడిగా సంచరించడాన్ని పాశ్చాత్య సంప్రదాయం హర్షిస్తుంది.

ప్రస్తుతం యువతరానికే సంప్రదాయాన్ని స్వీకరించాలో తెలియడంలేదు. వారు బ్రహ్మచారులుగా పాశ్చాత్య సంప్రదాయాన్నభిమానిస్తూ, వివాహం కాగానే భారతీయ సంప్రదాయాన్నారాధిస్తున్నారు. సంప్రదాయాలను నిర్ణయించేది పురుష ప్రపంచమే కావడంతో ఈ విషయంలో స్త్రీల అభిప్రాయానికి విలువే ఉండదు.

ప్రతి యువకుడూ తాను స్త్రీ మనసు హర్షం చేసుకున్నాననే భావిస్తాడు. నిలువుటద్దంవంటి ఆమె స్వచ్ఛతలో తన కోరికల ప్రతిబింబాలు చూస్తాడు. అందుకు ప్రస్తుతం సాహిత్యం కూడా యెంతగానో సహకరిస్తోంది. అరుదైన వ్యభిచార భావాలను స్త్రీకి సహజమైనవిగా వర్ణించబడడంతో—ఎందరో యువకులు మనసును తప్పుదారిలో నడిపిస్తున్నారు. ఇప్పుడు సుకుమార్ విషయంలోనూ అదే జరిగింది.

ఒకరోజతడొక్కడూ ఇంట్లో వుండగా డ్రాయింగ్ రూం తలుపు తట్టింది జ్యోత్స్న. అతడు తలుపు తీయగానే ఆమె అతడిని తెలుగు నవలలు కావాలని అడిగింది. ఆ రెండిళ్ళకూ లోపలనుంచి ఉన్న మార్గమది.

అప్పటికి జగదీష్ కుటుంబం ఆ యింట్లో అద్దెకొచ్చి సరిగ్గా వారంరోజులైంది. వచ్చిన వారం రోజుల్లోనే రెండు రాత్రులు సుకుమార్‌నీ తండ్రినీ భోజనానికి

పిలిచాడు జగదీష్.

"ఎందుకయ్యా మీ ఆవిడకు శ్రమ.... నాకు వంట మనిషుంది గా—" అన్నాడు సుకుమార్ తండ్రి.

"ఇందులో శ్రమంటూ ఉంటే అది నాదే...." అన్నాడు జగదీష్.

"అంటే నువ్వే వంట చేస్తావా?" అన్నాడు సుకుమార్ తండ్రి.

"అబ్బే—అది కాదండి. పిలవమన్న పట్టుదల మా ఆవిడదే! అంటే తనకేమీ శ్రమ లేదన్న మాటేగదా— వంటకు సంబంధించినంతవరకూ. వంట చేయడానికి సిద్ధపడ్డ మనిషి తనే మిమ్మల్ని పిలవొచ్చుగా. అలా పిలవడం లేదంటే శ్రమంతా పిలవడంలోనే ఉందన్న మాట....ఆ పని నేను చేస్తున్నాగా...."అన్నాడు జగదీష్.

మర్యాదకు జగదీష్ అన్న ఈ మాటలు సుకుమార్ పై ఇంకోకలా పని చేశాయి జగదీష్ తమను భోజనానికి పిలవాలని లేదు. అతడి భార్య జ్యోత్స్న పట్టుబట్టగా ఈ ఆహ్వానం వచ్చింది. ఈ ఆహ్వానం తప్పనిసరిగా తన గురించే అయుంటుంది.

సుకుమార్ ఆరడుగుల పొడవుంటాడు. పచ్చని ఛాయ. చాలామంది అతణ్ని హీరో అని పిలుస్తారు. తన పెర్స నాలిటీకి ఆడపిల్లలు పడిచస్తారన్న అభిప్రాయమతడిలో ఉంది. అందులోని నిజానిజాలు తెలుసుకునేందుకతడెప్పుడూ ఆడపిల్లలతో మాట్లాడి ఉండలేదు. అందమైన ఆడపిల్ల కతడెప్పుడూ కాస్త దూరంలోనే ఉండి ఆమె తన వెంట బడుతుందేమోనని ఆశిస్తూ ఎదురు చూస్తూండడంవల్ల ఇంతవరకూ అతడికి గర్ల్ ఫ్రెండ్సులేరు. అయినా ఆడపిల్లలు తనంటే పడిచస్తారనీ—తన ప్రయత్న

లోపంవల్ల అది జరగడంలేదనీ సుకుమార్ సరిపెట్టుకుంటాడు.

సుకుమార్ తనను జగదీష్‌తో పోల్చుకొని — తనను అతడికంటే బాగా ఉన్నత స్థానంలో ఉంచుకొని— "ఐ అండర్‌స్టాండ్ యూ జ్యోత్స్నా—" అనుకున్నాడు.

మొదటి రోజున భోజనం చేసినపుడు మొహమాటంతో అతడు సరిగా భోంచేయలేదు. వంటలు బాగోలేవా అని జ్యోత్స్న నొచ్చుకుంటే బదులివ్వడానిక్కూడా మొహమాటపడ్డాడు సుకుమార్. అప్పుడతడి తండ్రి—"వాడికి చాలా కూరలు సహించవు. వంటలకేం బ్రహ్మాండంగా ఉన్నాయి—" అన్నాడు.

"అయ్యో—అనవసరంగా భోజనానికి పిలిచి కడుపు మాడ్చానన్నమాట — అసలేం తింటాడేమిటి మీ అబ్బాయి—" అనడిగింది జ్యోత్స్న.

"అరటికాయ వేపుడూ, వంకాయకూరా.....—అంతే ఇంకే కూరలూ తినడు. అందరూ ప్రాణంపెట్టే కొబ్బరి పచ్చడి ఇంట్లో అయితే నాలిక్కూడా రాసుకోడు. వాడికి పెసరపచ్చడి ఇష్టం. సాంబారు వాడికి నచ్చదు. చారైనా ఫరవాలేదు. ఉల్లిపాయల పులుసైతే ఇంక జుర్రేస్తాడు. వీడి రుచులవల్ల నాకు చాలా ఇబ్బందిగా వుంటోంది. అస్తమానూ రెండేసిరకాల వంటకాలెక్కడ చేసుకోగలం. అందుకని తరచుగా నేనే నా రుచులు చంపుకోవలసొస్తోంది.." అన్నాడు సుకుమార్ తండ్రి.

ఆ తర్వాత రెండ్రోజులకే మళ్ళీ వాళ్ళను భోజనానికి పిలిచింది జ్యోత్స్న. ఈసారన్నీ సుకుమార్ కిష్టమైనవే చేసేసరికి అతడిలో ఆశలు చిగురించాయి. ఆ

తర్వాతనుంచి సుకుమార్ కిష్టమైన అయిటమ్స్ చేసినపుడు వాళ్ళింట్లో ఇస్తూండేదామె. అవన్నీ సుకుమార్ తండ్రి ఉండగానే జరిగాయి.

ఆ రోజు పుస్తకాలకు జ్యోత్స్న రావడం అదే మొదటిసారి__సుకుమార్ ని ఏకాంతంగా కలుసుకోవడం. సుకుమార్ ఆమెకు పుస్తకాలిచ్చాడు. ఆమె వెళ్ళిపోయింది.

అప్పుడు సుకుమార్ మనసు పరిపరివిధాల పోయింది.

ఆమె ఎందుకొచ్చింది? నిజంగా పుస్తకాలకేనా?

తండ్రి ఈ సమయంలో ఇంట్లో ఉండడని ఆమెకు తెలుసు. తనుంటాడనీ తెలుసు. ఇద్దరూ రహస్యంగా కలుసుకునే అవకాశమున్నదని చెప్పడంకోసం ఆమె వచ్చిందా?

ఆలోచించినకొద్దీ జ్యోత్స్న తన గురించి పరితపిస్తున్నదన్న భావన సుకుమార్లో కలిగింది. అయినా అతడు ధైర్యం చేయలేకపోయాడు. ఈలోగా మరి రెండుసార్లు జ్యోత్స్న అతడి నడిగి పుస్తకాలు తీసుకుంది.

ఇక లాభంలేదనుకొని ఒకరోజున అతదే తలుపుతట్టి ఆమెను పిలిచాడు. ఆమె తలుపుతీసి కారణమడిగింది.

ఏం చెప్పాలో తెలియలేదు సుకుమార్ కి.

"మీ యింట్లో మంచి తెలుగు నవలలేమైనా ఉంటే ఇస్తారని...." అంటూ గొణిగాడు.

"రండి...." అంటూ ఆమె అతడి నాహ్వానించి తనింట్లోని పుస్తకాలు చూపించింది.

అలా ప్రారంభమైంది వారి పరిచయం. అటుపైన యెన్నడూ పగటి సమయంలో జ్యోత్స్నకు తనే తలుపు తట్టాల్సిన అవసరం రాలేదు. ఆమె స్నానంచేసి వచ్చి

సోఫాలో కూర్చోగానే సుకుమార్ తలుపు తడతాడు.
ఆమె తలుపు తీస్తుంది.

ఇద్దరూ కాసేపు కబుర్లు చెప్పుకుంటారు. ఆమె అతడితో స్నేహపూర్వకంగా మాట్లాడుతుంది. అతడికది సంతోషం. కానీ తమ పరిచయం అంతకుమించి వెళ్ళాలన్నది అతడి కోరిక. అందుకతడేమీ చొరవచేయలేక పోతున్నాడు.

అలా రోజులు గడుస్తున్నాయి.

ఒకరోజున సాహిత్యం, మరొకరోజున సంగీతం, ఒక రోజున సినిమాలు, మరొకరోజున రాజకీయాలు, ఒక రోజున సంప్రదాయాలు, మరో రోజున విజ్ఞానశాస్త్రం- ఇలా వాళ్ళెన్నో విషయాలమీద మాట్లాడుకున్నారు. సంభాషణ ఎప్పుడూ ప్రేమ గురించి సాగలేదు. ఆమె ఆ ప్రసక్తి తీసుకువస్తే బాగుండునని అతడికుంది. తనే తీసుకువస్తే బాగుండునని ఆమె అనుకుంటున్నదన్న అనుమానమూ అతడికుంది.

అతడి మనసులో కల్మషముంది. అది బయటపడనంత వరకూ అతడు మంచివాడే అవుతాడు. ఆమె మనసులో యేముందో అతడికి తెలియదు.

ఆ రోజు కూడా జ్యోత్స్న సోఫాలో కూర్చుని నవల చదువుతూ మధ్య మధ్య తలుపుకేసి చూస్తోంది. తలుపు మ్రోగడం కాస్త ఆలస్యమైంది. చప్పుడైనదే తడవుగా ఆమె వెళ్ళి తలుపుతీసింది.

"రండి రండి—నవలకంటే మీతోనే మంచి కాలక్షేపంగా ఉంది నాకు—" అంది జ్యోత్స్న అతడి నాహ్వానిస్తూ.

ఆ ఆహ్వానానికతడు పొంగిపోతూ — "థాంక్స్!" అన్నాడు.

"ఈ రోజు మీకు ఫోటో ఆల్బం చూపిస్తాను. అందులో మీరు చూడవలసిన ముఖ్యులెందరో ఉన్నారు" అందామె.

"వెరీ గ్లాడ్ ...." అన్నాడు సుకుమార్.

జ్యోత్స్న సోఫాలో అతడి పక్కనే కూర్చుంది. ఆల్బం టీపాయ్ అడుగు అరలోంచితీసి ఇద్దరికీ మధ్య పెట్టి ఒక్కొక్క ఫోటోయే చూపించింది.

అందులో వాళ్ళ పెళ్ళి ఫోటోలుంటాయని సుకుమార్ అనుకున్నాడు. అలాంటి దొక్కటీలేదు. అన్నీ విడి ఫోటోలే! రెండు పేజీలనిండా అతడి ఫోటోలు. రెండు పేజీలనిండా ఆమె ఫోటోలు ...

"ఆయనకు కలిసి ఫోటోలు తీసుకోవడం నచ్చదు. కలుసుండడం జీవితానికి. ఫోటోల్లో ఎవరి వ్యక్తిత్వం వారిది విడివిడిగా ప్రతిఫలించాలి...." అందామె అతడికి మొదటి నాలుగు పేజీలూ చూపించి. ఆ తర్వాత పిల్లల ఫోటోలు. అవీ విడివిడిగానే ఉన్నాయి.

"మీ ఫామిలీ ఫోటో ఒక్కటి కూడా లేదు...." అన్నాడు సుకుమార్.

"ఇంట్లో ఎప్పుడూ ఒకర్ని విడిచి ఒకరుండం. మమ్మల్నొక్కచోట బంధించగల ఫ్రేం ఇల్లుండగా ఫోటో ఫ్రేం—ఎందుకూ అంటారాయన...."

"మరి మీరేమంటారు?"

"నేనేమీ అనను. నాకు వ్యక్తిత్వం లేదు...." అంది జ్యోత్స్న.

"మీ మాటలు నేను నమ్మను. మీది చాలా గొప్ప వ్యక్తిత్వం—" అన్నాడు సుకుమార్ చటుక్కున.

"నా వ్యక్తిత్వం గురించి మావారికంటే మీకెక్కువ

తెలియను. వారి వ్యక్తిత్వమే నా వ్యక్తిత్వం—" అంది జ్యోత్స్న.

"అంటే మీకంటూ వేరే స్నేహితులు లేరా?" అన్నాడు సుకుమార్.

జ్యోత్స్న అల్బంలో ఒక పేజీ తిప్పింది. అక్కడ ఇద్దరు యువకుల బొమ్మలున్నాయి. ఇద్దరూ చాలా అందంగా వున్నారు.

"వీళ్ళు చాలా బాగున్నారు కదూ!" అంది జ్యోత్స్న.

సుకుమార్ తలూపాడు.

"కానీ పాపం—వీళ్ళలో ఒకడికి కాలులేదు. రెండో వాడికి చేయిలేదు—...." అంది జ్యోత్స్న జాలిగా.

"ఇంతకీ వీళ్ళెవరు?" అన్నాడు సుకుమార్.

"ఒకప్పుడు నా స్నేహితులు...."

"ఇప్పుడు కారా?"

"కారు...."

"ఎందుకని?"

"కాలేజీ రోజుల్లో మా యింటిపక్కనే ఉండేవారిద్దరూ. నేనంటే యెంతో ఇష్టపడేవారు. వాళ్ళిస్తే ఫోటోలు కూడా పుచ్చుకున్నాను. పెళ్ళయ్యాక నా భర్త ఈ ఫోటోల గురించి అడిగారు. నా స్నేహితులని చెప్పాను. పెళ్ళయిన ఆడదానికి హితులే తప్ప స్నేహితులుండకూడదన్నారాయన. నేను సరేనన్నాను. వీళ్ళతో స్నేహం తెంపుకోమన్నారు. అలాగేనన్నాను. అసలా ఫోటో లెలాగొచ్చాయని అడిగారు. చెప్పాను. ఆ తర్వాతనే ఒకడికి కాలూ, ఒకడికి చెయ్యీ విరిగింది. అప్పుడు వాళ్ళే నన్ను మరిచిపోయ్యారు. ఆ తర్వాత నేనింకెవరితోనూ స్నేహం చెయ్యలేదు—" అంది

జ్యోత్స్న.

సుకుమార్ తడబడ్డాడు. తటపటాయిస్తూనే- "అంతా అన్యాయం. వాళ్ళు చేసిన తప్పేమిటి?" అన్నాడు.

"ఏమిటో కానీ—తప్పు చేశారనే నేననుకున్నాను."

"ఎందుకని?"

"వాళ్ళల్లో ఏ తప్పూ లేకపోతే వాళ్ళకే కాళ్ళూ చేతులూ విరగవు. మావారికేమీ కాలేదు. నాతో ఎవరు స్నేహం చేసినా శ్రీవారి కాలో, చెయ్యో విరగదీస్తే తప్ప-వారిని నేను గౌరవించలేను ..." అంది జ్యోత్స్న.

సుకుమార్ కి ఆమె మాటలు సరిగా అర్థంకాలేదు. ఆమె తన భర్తను గురించి తన్ను హెచ్చరిస్తోందా? తన ద్వారా భర్తపై కసితీర్చుకోవాలనుకుంటోందా?

ఆమె మనసులో యేదో ఉంది. అల్పం చూపడంలో ఆమె తనకు యేదో సందేశం పరోక్షంగా అందించదల్చుకుంది.

స్నేహితుల మన్నందుకు జగదీష్ ఇద్దరు యువకుల కాళ్ళూ చేతులూ విరగ్గొట్టాడు. ఈ విషయం పనిగట్టుకుని జ్యోత్స్న తనకెందుకు చెప్పినట్లు? ఆమె తన్ను హెచ్చరిస్తోందని అనుకుందామా అంటే భర్త కాలూ, చెయ్యీ విరగదీసే మగధీరుడికోసం తానెదురు చూస్తున్నట్లూ ఆమె సూచించింది.

ఇప్పుడు తనేం చేయాలి?

సుకుమార్ కి అర్థమయింది.

జ్యోత్స్న తన్ను పరీక్షిస్తోంది. ఆమె చెప్పింది విని తను భయపడితే—తనామెకు లోకువై పోతాడు. తనామె నెంతగా ప్రేమిస్తున్నాడో చెప్పాలి. ఆమె సహకరిస్తే భర్తకు గుణపాఠమూ చెప్పగలనని మాటివ్వాలి.

సుకుమార్ తననొకసారి జగదీష్‌తో పోల్చుకున్నాడు. అందచందాల్లో జగదీష్ తనకు సాటిరాడు. ఇంక బలం విషయం చూస్తే—తను జగదీష్ అంత దృఢంగా ఉండక పోయినా—అతడికంటే బాగా పొడుగు. అవసరమైతే తనతణ్ని తన్నగలడు.

సుకుమార్ జరిగినదేమిటో ఊహిస్తున్నాడు. పెళ్ళి కాగానే ఆమె వ్యక్తిత్వాన్ని చంపేశాడు జగదీష్. జ్యోత్స్న భరించలేక తన పాత స్నేహితులకు చెప్పుకుంది. వాళ్ళామెకు సాయపడాలని వచ్చి భంగపడి వెళ్ళారు. అప్పట్నించీ ఆమె కొత్త స్నేహితులకోసం యెదురుచూస్తోంది. భర్తకు బుద్ధిచెప్పాలన్నదామె ఆశయం.

"జ్యోత్స్నా! నువ్వే నా ప్రాణం. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీకోసం యేమైనా చేస్తాను. నువ్వు నా కౌగిలిలో ఒరిగిపోతూ-నన్నాజ్ఞాపించు. నేను నీ మాటలు శిరసావహిస్తాను. నీ వ్యక్తిత్వానికి రక్షణ కల్పిస్తాను...." అనాలనుకున్నాడు కానీ అతడి గొంతు పెగలలేదు. కష్టపడి గొంతు సవరించుకొని రెండో ప్రయత్నం చేయబోతూ—"నేను...." అన్నాడు. అంతే కాలింగ్ బెల్ మ్రోగింది.

"ఈ సమయంలో ఎవరు చెప్మా?" అంది జ్యోత్స్న.

"మీవారేమో—" అంటూ లేచి నిలబడ్డాడు సుకుమార్.

"ఫరవాలేదు—కూర్చోండి—" అంది జ్యోత్స్న.

"వచ్చిందే ఆడవాళ్ళో అయుంటారు. నాకు పనుంది లెండి. వస్తాను...." అంటూ సుకుమార్ చరచరా తన వాటాలోకి వెళ్ళి తలుపులు వేసుకున్నాడు.

ఆ సమయంలో ఆమెకు లేని భయం తనక్కలిగినందుకు సుకుమార్ ఎంతగానో ఆశ్చర్యపడ్డాడు.

## 2

జ్యోత్స్న వెళ్ళి తలుపు తీసింది.

ఒక అపరిచితుడు గుమ్మం బయట నిలబడి ఉన్నాడు.

"జగదీష్‌గారిల్లి దే కదూ!" అన్నాడతను.

"ఇల్లి దే — వారింట్లో లేరు...." అంది జ్యోత్స్న.

"ఫరవాలేదు — మీతో నే మాట్లాడతాను—...."

అంటూ చొరవగా లోపలకొచ్చి తలుపు వేశాడతడు.

"ఎవరు మీరు?" అంది జ్యోత్స్న కంగారుగా.

"పనిమీద వచ్చాను—" అన్నాడతడు.

"మీ రెవరు?"

"ఎవరంటే ఏమిటి—నా పేరు చెప్పాలా?" అన్నాడతడు.

జ్యోత్స్న విస్తుపోతూ అంతడి వంక చూసింది.

"నువ్వు బాగున్నావు ..." అన్నాడతడు.

జ్యోత్స్నకు మాటరాలేదు.

"నువ్వు చాలా బాగున్నావు.." అన్నాడతడు మళ్ళీ.

"బాగుంటే?" అంది జ్యోత్స్న కాసేపటికి గొంతు పెగుల్చుకుని.

"నువ్వెప్పటికీ బాగుండాలన్నది నా కోరిక...."

"అంటే?"

"అంటే అర్థం కాలేదూ — నువ్వు చెడిపోకూడదన్న మాట...."

"అర్థం కాలేదు...." అంది జ్యోత్స్న.

"అడది చెడిపోవడమంటే అర్థం విడమర్చి చెప్పాలా?"

జ్యోత్స్న ధైర్యం తెచ్చుకొని—"నేను బాగున్నాను

కదా—ఇప్పుడు చెడిపోవడం గొడవెందుకూ?" అంది.

"గొడవెందుకూ అనుకుంటే చెడిపోవు...." అన్నాడతడు.

"నువ్వు చెప్పదల్చుకున్నదేంటో సూటిగా చెప్పు...." అంది జ్యోత్స్న.

"అలా కూర్చో—తాపీగా ఇద్దరం కూర్చుని మాట్లాడుకుందాం...." అన్నాడతడు.

ఇద్దరూ ఎదురెదురుగా సోఫాల్లో కూర్చున్నారు.

"నాకు కొన్ని కాగితాలు కావాలి. అవి నీ భర్త తెచ్చివ్వాలి. అతడిచ్చాడూ—సరేసరి. లేదా నువ్వు చెడిపోతావు." అన్నాడతడు.

"ఏమిటా కాగితాలు?" అంది జ్యోత్స్న.

"అవి నీ భర్తకు వివరంగా చెప్పుకుంటాను...."

జ్యోత్స్న ధైర్యం చేసి—"అలాంటప్పుడు నన్ను చెడగొట్టడం గురించీ ఆయనకే చెప్పవలసిందీ...." అంది.

"నిన్ను చెడగొడతానన్న బెదిరింపు నీకోసమనుకున్నావేంటీ—అది నీ భర్తకోసమే!" అన్నాడతను.

"మరి ఆయన సాయంత్రం ఆరింటిదాకా రారు. నువ్వు అప్పుడే రావాల్సింది " అంది జ్యోత్స్న.

"అదీ నిజమే! కానీ ఈలోగా నిన్నూ కాసేపు బెదిరించవచ్చు కదా అని—" అన్నాడతను.

"నేనంత సులభంగా దేనికీ బెదరను—" అంది జ్యోత్స్న బింకంగా.

"కానీ నువ్వు నీ భర్తకు చెప్పి మా కాగితాలు రప్పించాలి. అవి చాలా అవసరం .."

"ఆయన్నే నువ్వే అడుగు...."

"అడుగుతాను కానీ నీ సిఫారసు కూడా ఉంటే

మంచిదని...."

"నేను సిఫారసు చెయ్యకపోతే...."

"అప్పుడు రేపుకూడా నీ పిల్లలింటికి రారు...."

"అంటే?" అంది జ్యోత్స్న తెల్లబోయి.

"ఈ రోజుకు వాళ్ళింటికి రారు...."

"ఎందుకని?"

"ప్రస్తుతం వాళ్ళు మా సంరక్షణలో ఉన్నారు. మా కాగితాలు మాకందితే వాళ్ళకే ప్రమాదంలేదు. అందక పోతే—నీకోసం నీ పిల్లలు వికలాంగులౌతారు. నీ భర్త కోసం నీ మానం చెడుతుంది...." అన్నాడతడు.

"ఎవరు నువ్వు?"

"నా పేరు పాండురంగ విఠల్...." అన్నాడతడు.

"ఏమిటా కాగితాలు?"

"మళ్ళీ మొదటికొచ్చావు. నువ్వు నీ భర్త గురించీ, నీ గురించీ, నీ పిల్లల గురించీ ఆలోచించుకో. కాగితాల గురించి నీ భర్త ఆలోచిస్తాడు...."

"వచ్చిన పనింతేగా.... వెళ్ళు...." అందామె.

"ఇప్పుడు వెడతాను. సాయంత్రానికి వస్తాను...." అంటూ అతడు బయటకు వెళ్ళాడు. తలుపులతడు బైట నుంచి గడపెట్టాడు.

జ్యోత్స్న గబగబా పక్కింటి తలుపు తట్టింది. ఒక్క క్షణంలో సుకుమార్ తలుపు తెరిచాడు. ఆమెను చూడ గానే అతడేదో చెప్పాలనుకున్నాడు.

"మిష్టర్ సుకుమార్! అర్జంటుగా నాకు నీ సాయం కావాలి. ఇప్పుడే మా యింట్లోంచి ఓ మనిషి బయటకు వెళ్ళాడు. వెడుతూ వెడుతూ ఇంటి తలుపు బైటనుంచి

గడ వేశాడు. అతను ముక్కుపొడెం రంగు పాంటుమీద పొట్టిచేతుల ఎర్రగళ్ళ చొక్కా ఇన్‌షర్ట్ చేశాడు. నీకంటే రెండంగుళాలు తక్కువే వుంటాడు పొడుగు. నువ్వతడి ఆచూకీ తీసి వివరాలు నాకు చెప్పగలిగితే— నువ్వేం కోరితే అదిస్తాను నీకు. ప్లీజ్—వెంటనే బయల్దేరవూ?" అందామె చనువుగా.

ఆమె అలా చనువుగా మాట్లాడేసరికి సుకుమార్ ఛాతీ ఉబ్బింది. ఆమె తనను నువ్వంటూంటే మధురంగా అనిపించింది.

"ఇంతకీ అతడెవరు?" అన్నాడతడు.

"నా పెర్సనాలిటీకి ప్రమాదకరమైన వ్యక్తి. నీ పెర్సనాలిటీకి కాదు...." అంది జ్యోత్స్న.

సుకుమార్ వెంటనే అక్కణ్ణించి కదిలాడు. తనేం చేయబోతున్నాడో అతడికి తెలియదు. తనేం కోరబోతున్నాడో అతడికి తెలుసు.

# 3

పాండురంగ విఠల్ పేరుతో జ్యోత్స్న ఇంటినుంచి బయటపడిన వ్యక్తి సందు చివరవరకూ వెళ్ళేసరికి— సందులోనే అతడి వెనుకనుంచి ఇద్దరు వ్యక్తులతడిని పరుగున సమీపించి— "ఆ యింట్లోంచే ఓ కుర్రాడు బయటకు వచ్చాడు. అతడు నిన్ననుసరిస్తున్నాడని అనుమానంగా వుంది...." అన్నారు.

అతడు వారితో మాట్లాడుతున్నట్లుగా వెనక్కు చూశాడు.

హడావుడిగా ముందుకు వస్తున్న సుకుమార్ అతడికి కనిపించాడు. సుకుమార్ ఇంకా చాలాదూరంలో వున్నాడు—సన్నటి ఆ పొడవాటి సందులో!

"సరే—మీరు వెళ్ళండి—" అన్నాడు విఠల్. వాళ్ళు వెళ్ళిపోయారు. విఠల్ చటుక్కున వెనక్కు తిరిగాడు.

అతడిప్పుడు సుకుమార్‌కి ఎదురుగా వస్తున్నాడు.

ఇద్దరూ ఒకరికొకరు ఎదురయ్యారు.

సుకుమార్ విఠల్‌ని గుర్తుపట్టాడు. ఆమె వర్ణన అతడికి అతికినట్లు సరిపోయింది.

విఠల్ అతడిని దాటుకొని ముందుకు వెళ్ళాడు. సుకుమార్‌కేంచేయాలో తోచలేదు. తనుకూడా చటుక్కున వెనక్కు తిరిగాడు.

పాండురంగ విఠల్ చిన్నగా జగదీష్ ఇంటికి వెళ్ళి బయట పెట్టిన గడియ తీసి రోడ్డుమీదకు వచ్చాడు. సుకుమార్ అతడివంకే ఆశ్చర్యంగా చూస్తూ—"ఎవరు నువ్వు?" అన్నాడు.

"నా పేరు పాండురంగ విఠల్. నేను జ్యోత్స్నకు స్నేహితుణ్ని. ఆమెను కలుసుకొందుకు వచ్చి వెళ్ళిపోయేటప్పుడు పొరపాటున తలుపు బయటనుంచి గడియ పెట్టాను. అది గుర్తుకు వచ్చి ముందుకు వెళ్ళినవాడిని వెనక్కు వచ్చాను—" అన్నాడతను.

"నువ్వు అబద్ధం చెబుతున్నావు?" అన్నాడు సుకుమార్.

"ఇంతకీ నువ్వెవరు?" అన్నాడు విఠల్.

"నీ ఆచూకీ తీయమని నన్ను జ్యోత్స్న పంపింది—" అన్నాడు సుకుమార్.

"అలాగా-అయితే నాతో రా!" అంటూ ముందడుగు వేశాడు విఠల్.

సుకుమార్ కొంతదూరం అతడి ననుసరించి—"ఆగు—"

అన్నాడు.

"ఏం?" అన్నాడు విఠల్.

"జ్యోత్స్న నీ గురించి నాకింతోలా చెప్పింది. నీ విషయమేదో ఇక్కడే తేల్చుకుంటాను. నిన్ననుసరించి దూరం వెళ్ళడం నాకు ప్రమాదం—...." అన్నాడు సుకుమార్.

విఠల్ నవ్వాడు—"అసలు జ్యోత్స్నకూ నీకూ పరిచయమేమిటి? — నేను బయటనుంచి తలుపు గడియ పెడితే ఆమె నిన్నెలా కలుసుకుంది?"

సుకుమార్ ఏమీ చెప్పకూడదనుకొన్నాడు. కానీ విఠల్ తెలివిగా చాలా సమాచారం రాబట్టాడతడి దగ్గర్నుంచి.

"అంటే నువ్వు దాని రంకు మొగుడివన్నమాట!"

"ఛీ—అలాగనకు. ఆమె అలాంటిది కాదు...."

"మరెలాంటిది?"

"ఆమె నాకు మంచి స్నేహితురాలు...."

"జ్యోత్స్న యెలాంటిదో నాకు తెలుసు. నువ్వు చెప్పక్కర్లేదు. దాని అక్రమ సంబంధాలకు సంబంధించిన ఫోటోలు నా దగ్గరున్నాయి. నేనిప్పుడు దాన్ని బ్లాక్ మెయిల్ చేయడానికే వెళ్ళాను...."

"అయితే నువ్వు బ్లాక్ మెయిలర్ వన్నమాట. నిన్ను పోలీసులకు పట్టివ్వడం నా విధి...." అన్నాడు సుకుమార్.

"అందువల్ల జ్యోత్స్న బ్రతుకు పదిమందిలోనూ పడుతుంది...." అన్నాడు విఠల్ నిర్భయంగా.

"పడినా ఫరవాలేదు. అదంతా పోలీసులు చూసుకుంటారు. నిన్నిప్పుడే పోలీసుల కప్పగిస్తాను" అన్నాడు సుకుమార్.

విఠల్ క్షణమాలోచించి—"పోనీ ఓ పని చేద్దాం. నువ్వు నా జోలికి రాకుండా నాకు సహకరిస్తానంటే జ్యోత్స్నను నిజంగా నీదాన్ని చేస్తాను. అది నేనిలా చెబితే అలా వింటుంది. నేనడిగినంత డబ్బివ్వలేదు కాబట్టి నేను చెప్పిన పనికి ఒప్పుకోంటుంది...." అన్నాడు.

సుకుమార్ కళ్ళలో ఆశ మెరిసింది. అతడు క్రమంగా విఠల్ చెప్పింది వినసాగాడు.

## 4

"పిల్లలింకా ఇంటికి రాలేదు...." అంది జ్యోత్స్న.

"స్కూల్లో యేమైనా ఫంక్షనుందా—" అన్నాడు జగదీష్ సోఫాలో వాలిపోతూ. అతడి ముఖంలో యేవిధమైన ఆత్రుతా లేదు.

"మధ్యాహ్నం మనింటికి పాండురంగ విఠల్ వచ్చాడు" అందామె.

"వాడెవరు?" అన్నాడు జగదీష్ కుతూహలంగా.

జ్యోత్స్న అతడికి క్లుప్తంగా జరిగింది చెప్పింది. సుకుమార్ గురించి ఆమె అతడికి చెప్పలేదు.

జగదీష్ కంగారుగా—"అయితే పిల్లలేమయ్యారు?" అన్నాడు.

జ్యోత్స్న కళ్ళు తుడుచుకుంది.

"ఇప్పుడే వెడతాను...." అన్నాడు జగదీష్.

"ఎక్కడికి?"

ఎక్కడికో జగదీష్‌కీ తెలియలేదు. అతడు భార్యవంక ప్రశ్నార్థకంగా చూస్తూండిపోయాడు.

"విఠల్ మళ్ళీ వస్తానన్నాడు. అతడొచ్చేదాకా ఎదురుచూడ్డం మినహా గా మనం చేయగలిగిందేమీ లేదు-" అంది జ్యోత్స్న నిట్టూరుస్తూ

"కానీ ఏదో చేయాలనుంది నాకు...." అన్నాడతడు ఆవేశంగా.

"మీరావేశపడకండి. నిదానంగా ఆలోచించండి. వాళ్ళకేవో కాగితాలు కావాలి. అవిచ్చేదాకా వాళ్ళు మనని వేపుకు తింటారు. అవేమిటో ఇచ్చేయండి...." అందామె.

జగదీష్ ఆలోచనలోపడుతూ—"నేను ముఖ్యమా—నా దేశం ముఖ్యమా అన్నది ఆలోచించుకోమంటున్నావా?" అన్నాడు.

"ఇందులో ఆలోచించడానికేముంది? మనమంతా కలిసేనే మన దేశం. మనముంటేనే దేశం...." అంది జ్యోత్స్న.

"నేను అందరిలాంటివాణ్ని కాదు జ్యోత్స్నా! నా కోసం చూసుకోకపోతే నేనొక్కడినే పోతాను. నా కోసం చూసుకుంటే నా దేశమే పోతుంది—...."

"అంటే?"

"దేశభద్రతకు సంబంధించిన రహస్యాలు నా దగ్గరున్నాయి. అవి నేను బయటపెడితే దేశద్రోహమవుతుంది...." అన్నాడు జగదీష్.

"అయితే ఏమంటారు?"

"ఆ కాగితాలు నేను బయటపెట్టలేను...."

"మరి వాళ్ళు మనని నాశనంచేస్తే....?"

"అందుకేదో ఉపాయం చూడాలి...."

"ఏ ఉపాయమూ ఉండదు. మీరే నన్నూ, మన పిల్లల్ని రక్షించాలి...."

జగదీష్ పిడికిళ్ళు బిగిశాయి—"మన జోలికి వచ్చిన వాళ్ళ అంతుచూస్తాను. నువ్వేమీ భయపడకు...."

అప్పుడు పక్కింటి తలుపు చప్పుడయింది.

జ్యోత్స్న తనే వెళ్ళి తలుపుతీసి ఉలిక్కిపడింది.

ఎదురుగా పాండురంగ విఠల్!

"ఇలా వచ్చావేం?" అందామె ఆశ్చర్యంగా.

"సుకుమార్ నా స్నేహితుడు లే!" అంటూ ముందుకు వచ్చి—"హలో! మిస్టర్ జగదీష్. అయాం మిస్టర్ పాండురంగ విఠల్!" అన్నాడతడు.

"ఎవర్నువ్వు?" అన్నాడు జగదీష్.

"నీ పిల్లలు మా దగ్గరున్నారు. మేం తలచుకుంటే ఎవర్నయినా యేమైనా చేయగలం...." అన్నాడు విఠల్

"గ్లాడ్ టూ మీట్యూ...." అన్నాడు జగదీష్ చేతులు సాచి.

"నమస్కారం!" అన్నాడు విఠల్ చేయి చాపకుండా.

జగదీష్ అతడివంక ఆశ్చర్యంగా చూశాడు. తనతో చేయి కలిపినవాడు పది పట్టీలు కొట్టాల్సిందే! ఆ విషయమితడికి ముందే తెలుసా?

"అలా చూడకు....మనం కూర్చుని మాట్లాడుకుందాం. పక్కింట్లో మా మనుషులు నలుగురున్నారు. నలుగురూ మెరికల్లాంటివాళ్ళు. ఏ క్షణంలోనైనా వాళ్ళిక్కడికి రాగలరు. ఈ యింట్లో ఇప్పుడు నీకు రక్షణ లేదు. నేను మాత్రమే నీకు రక్షణ కల్పించగలను. బాగా ఆలోచించుకుని నా మాటలకు బదులివ్వు...." అన్నాడు విఠల్.

జగదీష్ అతడివంకే ఆశ్చర్యంగా చూస్తూ కూర్చున్నాడు. విఠల్ అతడి కెదురుగా కూర్చుని—"పాకిస్తాన్‌కు ఎఫ్-16 బాంబర్ విమానాలు సరఫరా చేసింది

అమెరికా. వాటిని దెబ్బతీయడానికి దేశంలో జడ్_17 బాంబర్ విమానాలున్నాయి. ఈవిషయం అతి గోప్యంగా ఉన్నప్పటికీ పాకిస్తాన్ తెలుసుకుంది. ఆ విమానాల పూర్తి నమూనా నీ దగ్గరుంది. ఈ వ్యవహారం మొత్తం నీ ద్వారా నడుస్తోందని మాకు తెలిసింది. అందుకే ఆ నమూనా కాగితాల కోసం నేను నీ దగ్గరకు వచ్చాను" అన్నాడు.

"నువ్వు పాకిస్తాన్ ఏజంటువా....?" అన్నాడు జగదీష్.

"నా పేరు పాండురంగ విఠల్...."

"పేరులో ఏముందిలే...." అన్నాడు జగదీష్.

"ఆ మాత్రం తెలిసినవాడివి_దేశం పేరు గురించీ అలాగే అనుకుంటే నాకు సాయపడతావు..." అన్నాడు విఠల్.

"మరి నువ్వు నీ దేశాని కెందుకు సాయపడుతున్నావు?"

విఠల్ నవ్వి_"నేను భారతీయుణ్ని. డబ్బుకోసం రహస్యాలమ్ముతున్నాను. నాకు దేశం పేరుతో నిమిత్తం లేదు. ఏ దేశమైనా నాకొక్కటే...." అన్నాడు.

"ఈ రహస్యం కోసం నీకెంత ముడుతుంది?"

"అవన్నీ నీ కనవసరం...." అన్నాడు విఠల్_"నువ్వు నా కర్జంటుగా ఆ నమూనా కాగితాలివ్వాలి...."

జగదీష్ నవ్వి_"నీకు మతిపోయిందా? అమెరికా చేసిన ఎఫ్-16 బాంబర్ విమానాల గురించే మా దేశానికి సరిగ్గా తెలియదు. అవి పాకిస్తాన్‌కు చేరినందుకు మా దేశం బెంగ పెట్టుకుంది. అలాంటిది వాటిని దెబ్బతీయ

గల విమానాలు తయారు చేసేటంత టెక్నాలజీ భారత దేశంలో ఉందనుకోవడం నీ భ్రమ...." అన్నాడు.

"నువ్వు విషయం తప్పు దారి పట్టిస్తున్నావు...." అన్నాడు విఠల్— "నాకు జెట్—17 బాంబర్ విమానాల గురించి తెలిసింది చెప్పనా?"

జగదీష్ తలాడించాడు.

అమెరికా దేశం యే ఆయుధాలు తయారుచేసినా వాటిని మరో దేశానికి అమ్మేముందు వాటిని దెబ్బతీయగల ఆయుధాల్ని కూడా సిద్ధం చేసుకొంటుంది. అమెరికాయే కాదు—ఆయుధాలమ్మే ఏ దేశమైనా అంతే! లేకుంటే తామమ్మిన ఆయుధాలు తమపైనే ప్రయోగించబడవచ్చు.

పాకిస్తాన్ కు ఎఫ్—16 బాంబర్ విమానాలమ్మడానికి ఒప్పందం కుదిరేటప్పటికే—వాటిని దెబ్బతీయగల జెట్—17 టెక్నాలజీ అమెరికాలో సిద్ధంగా ఉంది. అమెరికాలోని భారత గూఢచారి సంస్థ ఆ టెక్నాలజీకి సంబంధించిన నమూనా సంపాదించి భారత దేశానికి చేరవేసింది.

"అమెరికా నుంచి టెక్నాలజీ చేరవేయడం అంత సులభం కాదు...." అన్నాడు జగదీష్.

"ఆ విషయం నాకూ తెలుసు. కానీ అక్కడే అమెరికన్ దౌత్యనీతి తెలుస్తుంది. అటు పాకిస్తాన్ కు ఎఫ్—16 బాంబర్ విమానాలమ్మి—ఇటు జెట్—17 టెక్నాలజీ లీక్ అవడంలో చూసీచూడనట్లూరుకోవడం ద్వారా అమెరికా రెండు దేశాలతోనూ సత్సంబంధాల నేర్పర్చుకోగలుగుతుంది—" అన్నాడు విఠల్.

"నువ్వు చెప్పేది చాలా తమాషాగా వుంది. బాంబ

రిల్లిచ్చినందుకు పాకిస్తాన్ సంతోషిస్తుంది కానీ ఇండియాకు గుర్రుగా వుండదా?" అన్నాడు జగదీష్.

"ఉండదు. ఎందుకంటే?" అని ఆగాడు విఠల్.

పాకిస్తాన్‌కు ఆయుధాలిమ్మినందుకు ఇండియా పెద్ద గొడవ చేస్తుంది. సంబంధాలు తెంచుకోనేందుకు సిద్ధపడుతుంది. ఆ సమయంలో టెక్నాలజీ ఇండియాకు లీకవుతుంది. ఆ విషయం అమెరికాకు తెలిసినా తెలిసీ తెలియనట్లు నటిస్తుంది. ఇండియా తమ దేశాన్నిమాత్రం అల్లరి పెట్టినా ఆ విషయం పరిశోధించి భారత గూఢచారుల చర్యలను బయట పెట్టగలమని పరోక్షంగా బెదిరిస్తుంది. తమ గూఢచారుల కార్యకలాపాలు బయటపడడానికే దేశమూ సుముఖంగా వుండదు. తమకెలాగూ ఇపుడు ఎఫ్—16 ల భయంలేదు. అందుకని భారతదేశమూ ఊరుకుంటుంది.

"ఇదీ రాజకీయం...." అన్నాడు విఠల్.

"నువ్వు చెబుతూంటే నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. నాకిదంతా తెలియదు...." అన్నాడు జగదీష్ అమాయకంగా.

"నీ అమాయకత్వం నా దగ్గర చూపకు....నీకన్నీ తెలుసు..."

"నిజంగా నాకేమీ తెలియదు...."

"ఏమీ తెలియని అమాయకుడు—పదిలక్షల రూపాయలు ఎరగా చూపిస్తూంటే లొంగకుండా ఉండలేడు" అన్నాడు విఠల్.

"పది లక్షలేమిటి?" అంది జ్యోత్స్న ఆశ్చర్యంగా.

"నీ ఆశ్చర్యంలో నిజాయితీ కనబడుతోంది. నీ భర్త నీకీ విషయం చెప్పలేదన్నమాట...." అన్నాడు విఠల్.

జగదీష్‌ను రహస్యం గురించి పాండురంగ విఠల్ మనుషులెప్పుడో కలుసుకున్నారు. వాళ్ళు నమూనా కాగితాలకోసం అతడికి పది లక్షలదాకా ఇస్తామన్నారు. అతడు చలించలేదు.

ప్రతి మనిషికీ యేదో కీలకముంటుంది. పాండురంగ విఠల్ మనుషులతడి కీలకం పరిశోధించారు. అతడి కీలకం అతడి కుటుంబంలో వుంది. పిల్లలకోసం, భార్యకోసం అతడు ప్రాణాలైనా యిస్తాడు. పదిలక్షలు సాధించలేని ఘనకార్యం ఈ విధంగా సాధించాలనుకున్నాడు పాండురంగ విఠల్.

"ఈ విషయం తెలుసుకుందుకు నాకు నెల రోజులు పట్టింది—" అన్నాడు విఠల్.

"నీకు తెలిసినదంతా నిజమే ననుకుంటున్నావా?" అన్నాడు జగదీష్.

"ఈ ప్రశ్న అడిగేముందు నువ్వు నీ పిల్లల గురించి ఆలోచించుకో..." అన్నాడు విఠల్.

జగదీష్ సోఫాలో వెనక్కు జారగిలబడ్డాడు. కాసేపాగి—"నా పిల్లల్నేం చేసినా నేను భరించలేను. అయితే నావంటి సామాన్యుడైన ఉద్యోగిని మీరెవరో కానీ యిలా బాధించడం అన్యాయం...." అన్నాడు.

"అయితే నీ గురించి నాకింకా ఏం తెలుసో చెప్పాలి" అన్నాడు విఠల్.

కొత్తగా గూఢచారి సంస్థ ఏదైనా సమాచారం సేకరించినపుడూ సమాచారాన్ని కూలంకషంగా చర్చించడంకోసం కొత్త ఆఫీసు వెలుస్తుంది. ఆ విధంగా ఈ ఊళ్ళో ఆర్నెల్ల క్రితం వెలసింది ప్రజాసంక్షేమసంస్థ. చుట్టుపక్కలుండే సామాన్య పౌరులకు ప్రభుత్వమందించే

సదుపాయాలేవిధంగా అందుతున్నదీ తెలుసుకోవడం ఆ సంస్థ పరమోద్దేశ్యమని పదిమందీ భావిస్తారు.

జడ్—17 టెక్నాలజీ గురించి కూలంకషంగా అవగాహన చేసుకునేందుకా సంస్థ వెలసిందని విఠల్‌కు తెలుసు. అందులో పనిచేస్తున్న వారందరూ ఆరితేరిన సాంకేతిక నిపుణులనీ అతడికి తెలుసు. ఆ సంస్థకు చీఫ్ జగదీష్. జడ్—17 నమూనా కాగితాలు సర్వకాల సర్వావసలయందూ అతడి సంరక్షణలో వుంటాయనీ అతడికి తెలుసు.

"పోనీ నువ్వు చెప్పిందే నిజమనుకుందాం. ఆ జడ్-17 నమూనా కాగితాలు తీసుకొని ఏం చేస్తావు?" అన్నాడు జగదీష్.

"యఫ్-16 లో మార్పులు చేస్తాం...."

"చేస్తాం అంటున్నావు....ఆ పనీ నీ ద్వారానే అవుతుందా?"

"అది నీ కనవసరం...."

"అయాం సారీ—ఈ విషయంలో నీ కేమీ సాయం చేయలేను...." అన్నాడు జగదీష్.

"పాపం—నీ పిల్లలు...."అన్నాడు విఠల్ జ్యోత్స్న వంక తిరిగి.

జ్యోత్స్న కంగారుగా — "ఏమండీ — ఇప్పుడేం చేయాలి?" అంది.

"మిస్టర్ విఠల్...." అన్నాడు జగదీష్ తీవ్రంగా— "నేను చాలా మొండివాణ్ని—"

"నేను కూడా—" అన్నాడు విఠల్. అతడి గొంతు కటువుగా ధ్వనించింది.

"మీ మొండితనం ఇప్పుడు చూపకండీ—" అంది

జ్యోత్స్న కంగారుగా.

"జ్యోత్స్నా—నీ కేమీ తెలియదు. నువ్వు కాసేపు మాట్లాడకుండా కూర్చో...." అన్నాడు జగదీష్—"మిస్టర్ విఠల్! నువ్వు గుండెలుతీసిన బంటువని నా కిప్పుడర్థమైంది. నిన్ను నేనంత సులువుగా నమ్మను. నా పిల్లలు నీ దగ్గరున్నారు. నువ్వడిగినవి నీ కిస్తే వాళ్ళు క్షేమంగా తిరిగొస్తారన్న నమ్మక మేమిటి!"

"నమ్మాలి—తప్పదు...."

"నేను నమ్మను...."

"నమ్మకపోతే నీ పిల్లలు నీకు దక్కరు...."

"వాళ్ళు నాకు దక్కకపోతే నీకు నమూనాలూ దక్కవు...."

విఠల్ ఆశ్చర్యంగా జగదీష్‌వంక చూశాడు. అతడిలో దృఢనిశ్చయం కనబడుతోంది—"నువ్వు నిజంగా నే మొండివాడివి...." అన్నాడు.

"నీలాంటి వాళ్ళగురించి నాకు బాగా తెలుసు. దేశానికే నమ్మకద్రోహం చేస్తున్నావు. నన్ను మోసం చేయవని నమ్మక మేమిటి?" అని—"నా పిల్లల వంటిమీద ఈగ వాలిందో—నువ్వు నా నుంచి యేమీ పొందలేవు" అన్నాడు జగదీష్.

విఠల్ సాలోచనగా—"నువ్వు నన్నెలా నమ్ముతావు?" అన్నాడు.

"నా పిల్లల్ని నా కప్పగించు..." అన్నాడు జగదీష్.

"ఆల్ రైట్—అలాగే చేస్తాను...." అన్నాడు విఠల్—"అయితే అందుకు నువ్వూ విచారించక తప్పదు...."

"ఎందుకని?"

"మనమిద్దరం కలిసి బైటకు వెడతాం. నేను నీ పిల్లల్ని నీ కప్పగించే యేర్పాటు చేస్తాను. వాళ్ళను నీకు నచ్చిన చోట ఉండవచ్చు. కానీ ఆ తర్వాత నను వెంటనే నాకు జడ్-17 నమూనా లివ్వాలి నువ్వు...." అన్నాడు విఠల్.

"అలాగే—తప్పకుండా యిస్తాను...." అన్నాడు జగదీష్.

"నువ్వు నన్ను నమ్మనట్లే నేనూ నిన్నంత సులభంగా నమ్మను. నేను నీతో నీ ఆఫీసుకు వచ్చి నమూనాల ఫోటోలు తీసుకుంటాను...."

"నేను సరైన నమూనాలు చూపిస్తానన్న నమ్మక మేమిటి?"

"చెప్పనా?" అన్నాడు విఠల్—"నీ ఆఫీసులో స్పెషల్ రూం ఒకటుంది. అందులో రెండు లాకర్లున్నాయి. లాకర్ నంబర్ వన్‌లో మొత్తం ఇరవై ఆరు ఫైల్సున్నాయి. అందులో ఫైల్ నంబర్ పదిహేడులో జడ్-17 నమూనాలున్నాయి. అవి నకిలీవి. అసలు నమూనాలు లాకర్ నంబర్ టూలో ఇరవై రెండో నంబరు ఫైల్లో ఉన్నాయి...."

జగదీష్ ఆశ్చర్యంగా—"అన్నీ తెలుసు నీకు...." అన్నాడు.

విఠల్ గర్వంగా నవ్వి—"ఆ విషయం యిప్పటికి గ్రహించావు—" అన్నాడు.

"అన్నీ తెలుసుకో గలిచావు. ఆ నమూనాలు మాత్రం యెందుకు సంపాదించ లేవు?" అన్నాడు జగదీష్.

"ఎందుకు సంపాదించలేను? అందుకేగా యిప్పుడొచ్చిందీ!"

"అదికాదు, ఇన్ని తెలుసుకోడానికి సహకరించిన మీ మనుషులా నమూనాలు కూడా సంపాదించలేకపోయారా?"

"అందరివల్లా అన్ని పనులూ కావు...." ముక్తసరిగా అన్నాడు విఠల్—"నిన్నభినందించక తప్పదు. నీ ఆఫీసు నుంచి ఆ నమూనాలు నువ్వు తప్ప ఇంకెవ్వరూ బయట పెట్టలేరు...."

"సరే—పద....బయటకు వెడదాం...." అన్నాడు జగదీష్.

"ఒక్క నిమిషం...." అన్నాడు విఠల్. అతడు తన జేబులోంచి మినీ ట్రాన్స్మిటర్ తీసి—"సరితా బజార్లో ఆనంద్ హోటల్ ఎదురుగా సందులోకి వస్తాను. రణధీరనీ, రవిశంకర్‌నీ అక్కడకు పంపించండి. అర్జంటు...." అన్నాడు. తర్వాత ట్రాన్స్మిటర్‌ను జేబులోకి తోసేసి—"మిస్టర్ జగదీష్....నువ్వలా బుద్ధిగా కూర్చో....నిన్నిక్కడ రహస్యంగా మనుషులు కనిపెడుతున్నారు. అందుకని పిచ్చి పిచ్చి పిచ్చి వేషాలు వెయ్యకు...." అన్నాడు.

"మనం బయటకు వెడుతున్నాం కదా—...." అన్నాడు జగదీష్.

"వెడుతున్నాం. కానీ నా యేర్పాట్లు నేను చేసుకోవాలి గదా. అందుకని కాసేపు బుద్ధిగా కూర్చో...." అన్నాడు విఠల్. తర్వాత జ్యోత్స్న వైపు తిరిగి—"నువ్వు నాతో రా—" అన్నాడు.

జ్యోత్స్న భర్త వైపు అసహాయంగా చూసింది.

"వెళ్ళు. నేనుండగా నీకేమి భయంలేదు" అన్నాడు జగదీష్ గంభీరంగా.

జ్యోత్స్న విఠల్ ననుసరించింది. ఇద్దరూ బెడ్రూం లోకి వెళ్ళడంచూసి జగదీష్ పళ్ళు పటపట లాడించాడు. కానీ సోఫాలోంచి లేవలేదు.

పాండురంగవిఠల్ బెడ్రూంలోంచి బయటకు రావడానికి సుమారు అయిదు నిముషాలు పట్టింది. బయటకు వచ్చి అతడు తలుపులు దగ్గరగా వేసి గడియపెట్టి తాళం వేశాడు. తర్వాత జగదీష్‌ని సమీపించాడు. అతడిచేతిలో ఒక ప్లాస్టిక్ బ్యాగుంది.

"నీ భార్య చాలా మంచిది. ప్రతిఘటించలేదు...." అన్నాడు విఠల్.

"ఏం చేశావామెను....?" అన్నాడు జగదీష్ ఆవేశంగా.

"నా జాగ్రత్తలో నేనున్నాను తప్పితే నేనామెకన్యాయమేమీ చేయలేదు—" అంటూ అతడు ప్లాస్టిక్ బ్యాగును జగదీష్ కందించి — "చూడు — ...." అన్నాడు.

జగదీష్ బ్యాగులోని వస్తువులు బయటకు తీశాడు. అవన్నీ మొత్తం జ్యోత్స్న ధరించిన బట్టలు....

"యూ...." అన్నాడతడు ఆవేశంగా.

"నువ్వు ఆవేశపడవలసినంత ఘోరమింకా జరగలేదు. కానీ జరిగే అవకాశముంది. ఒక్క నిముషం నిదానంగా కూర్చో...." అంటూ విఠల్ సన్నగా ఈలవేశాడు. వెంటనే పక్కవాటాలోంచి ఓ మనిషి వచ్చాడు.

అతడు ఉక్కుపిడుగులా గున్నాడు.

"ముసలాడేం చేస్తున్నాడు?" అన్నాడు విఠల్.

"చాలా బుద్ధిగా ఉన్నాడు సార్....ఎలా చెబితే అలా మసలుతున్నాడు. పోయి మంచంమీద పడుకుని పేపరు చదువుకుంటున్నాడు. మన మీ యింట్లో అడుగు పెట్టినట్లు పొరపాటున కూడా యెవరికీ చెప్పనన్నాడు...."

"వెరీగుడ్....వర్రాణ్ణి తీసుకురా...." అన్నాడు విఠల్. కొద్దిక్షణాల్లో ఆ ఉక్కుపిడుగు సుకుమార్ని వెంట బెట్టుకుని వచ్చాడు.

"మిస్టర్ సుకుమార్! అన్నమాట నిలబెట్టు కుంటున్నాను. నీ సాయానికి ప్రతిఫలం ఈ తాళం చెవి...." అంటూ తాళంచెవి సుకుమార్ కి అందించాడు విఠల్. సుకుమార్ తాళంచెవి అందుకుని ప్రశ్నార్థకంగా ఆతడికేసి చూశాడు.

"మిస్టర్ జగదీష్! ఆ ప్లాస్టిక్ బ్యాగు సుకుమార్ కి యియ్యి...." అన్నాడు విఠల్.

జగదీష్ ఆవేశాన్ని పళ్ళబిగువున అణచుకొని సుకుమార్ కా బ్యాగందించాడు.

"ఇందులో జ్యోత్స్న ధరించిన బట్టలున్నాయి. జ్యోత్స్న గదిలో ఉంది. గదికి తాళం పెట్టాను. తాళం చెవి నీ చేతిలో ఉంది. సరిగ్గా గంటన్నర వ్యవధి ఇస్తున్నాను. ఈలోగా ఆ గదిలోకి వెళ్ళడానికి ప్రయత్నించకు. ఇక్కడే సోఫాలో కూర్చో. గంటన్నర కాగానే గదిలోకి వెళ్ళు. ఆ తర్వాత నీ యిష్టం...." అన్నాడు విఠల్.

"మిస్టర్ సుకుమార్!" అన్నాడు జగదీష్ ఆవే

తంగా—"జ్యోత్స్న నా భార్య. ఈ పాండురంగవిఠల్ దేశద్రోహి. ఇతడికి సహకరించడం దేశద్రోహం. నువ్వు నా భార్యకే అన్యాయం చేసినా అది దేశద్రోహమే అనిపించుకుంటుంది. నేను దేశద్రోహాన్ని క్షమించను...."

విఠల్ నవ్వి—"భార్య మానాన్ని రక్షించుకోలేని వాడు దేశాన్ని రక్షించుకోగలడా?" అన్నాడు.

జగదీష్ మాట్లాడలేదు. అతడు తీక్షణంగా సుకుమార్ వంకా సుకుమార్ చేతిలోని తాళంచెవివంకా చూస్తున్నాడు. తాళంచెవి పట్టుకున్న సుకుమార్ చేయి వణుకుతోంది. రెండో చేతిలో జ్యోత్స్న బట్టలున్న ప్లాస్టిక్ బ్యాగుంది. ఆ చేయి మరింత వణుకుతోందేమో సంచీ చేతిలోంచీ జారి పడింది.

"బీ బ్రేవ్—సుకుమార్....ఇప్పుడు టైము ఏడుంపావయింది. ఎనిమిదీ నలభైఅయిదు వరకూ నువ్విక్కడే కూర్చో. ఈలోగా తొందరపడ్డావా...."

విఠల్ మాట పూర్తి చేసేలోగానే—"నేనున్నాను కదా బాస్...." అన్నాడు ఉక్కుపిడుగు. సుకుమార్ అప్రయత్నంగా అతడివంక చూశాడు.

ఉక్కుపిడుగు ఎత్తుగా, బలంగా, నల్లగా ఉన్నాడు. వాడి కండలు నున్నగా మెరుస్తున్నాయి. కళ్ళు ఎర్రగా ఉన్నాయి.

తనది ఆరడుగుల విగ్రహం కావచ్చు. కానీ వాడి ముందు తానెందుకూ పనికిరాడు.

సుకుమార్ నిట్టూర్చి వాచీ చూసుకున్నాడు. వాచీ ఏడుంపావు దగ్గరే ఆగిపోయినట్లనిపించిం దతడికి.

జగదీష్‌ను వెంటబెట్టుకుని విఠల్ వెళ్ళిపోయాడు.

# 5

జగదీష్ పిల్లలిద్దర్నీ కలుసుకోగానే వాళ్ళను ఆప్యాయంగా కౌగలించుకొన్నాడు. వాళ్ళిద్దరూ అతణ్ణి చూసి యేడ్చేశారు.

"బీ క్విక్ — అప్పుడే టైము ఏడూముప్పైఅయిదు...." అన్నాడు విఠల్.

జగదీష్ త్వరపడ్డాడు. పిల్లలిద్దర్నీ తీసుకుని ఓ యింటికి వెళ్ళాడు. ఆ యింట్లో వారికి వాళ్ళ నప్పగించాడు.

"టైము ఏడూనలభైఅయిదు...." అన్నాడు విఠల్ హెచ్చరికగా.

"ఇప్పుడేం చేయాలి?"

"నీ ఆఫీసుకు వెళ్ళాలి...."

"వెళ్ళకపోతే?"

"ఎనిమిదీనలభై అయిదు దాటేక యేమవుతుందో నీకు తెలుసు...."

"దాటాలి కదా...."

"మిస్టర్ జగదీష్....అతి తెలివికి పోకు...."

"అతి తెలివి కాదు. ఆ ఫైలిప్పుడు లాకర్లో లేదు...."

"ఏమయింది?"

"ఇక్కడికి యాభై కిలోమీటర్ల దూరంలో ఒక సురక్షిత స్థానానికి తరలించబడింది...."

"ఎందుకని?"

"పాకిస్తాన్ గూఢచారులు దానికోసం అన్వేషణ ప్రారంభించినట్లు మాకు వార్త అందింది...."

"అయితే యేమంటావ్?"

"ఇప్పటికీ నీకు నేను సాయపడగలను. కానీ నువ్వి

చ్చిన గడువు చాలదు...." అన్నాడు జగదీష్.

"సుకుమార్ వంటి పుత్రాడిని—అంత కంటే ఆపడం న్యాయం కాదు...."

"నువ్వు న్యాయం గురించి మాట్లాడుతున్నావా?"

విఠల్ నవ్వి—"న్యాయం గురించి మాట్లాడ్డానికి వేరే అర్హతలేమీ లేవు. అవకాశం, అదృష్టం కలిసి రావాలంతే!" అన్నాడు.

"నా భార్యకు రక్షణ కల్పించలేకపోతే నేను నీకు సాయపడను..."

విఠల్ ఓ క్షణం ఆలోచించి—"సరే—ఇట్సాల్ రైట్....మనం యాభై కిలోమీటర్లు వెళ్ళొద్దు. నీ ఆఫీసుకే వెడదాం. అక్కడ నీ లాకర్లో ఫైల్సు చూసి అందులో నాక్కావలసిన వివరాలు లేకుంటే—నీకు మరి కాస్త టైమిస్తాను...." అన్నాడు.

"అక్కడ నిజంగా ఆ ఫైలు లేదు...." అన్నాడు జగదీష్.

"నన్నక్కడకు తీసుకునివెళ్ళే బాధ్యత నీది. ఫైలు చూసుకునే బాధ్యత నాది" అన్నాడు విఠల్.

జగదీష్ ఆలోచనలో పడ్డాడు.

"బీ క్విక్....టైము ఎనిమిది కావస్తోంది...."

జగదీష్ తిరిగి స్కూటర్ స్టార్టు చేసి—"పద!" అన్నాడు.

విఠల్ స్కూటరెక్కాడు.

స్కూటర్ శరవేగంతో దూసుకునిపోయి అయిదు నిముషాల్లో జగదీష్ ఆఫీసు చేరుకుంది. అక్కడ దర్వాన్ అతణ్ణి చూసి సెల్యూట్ చేశాడు.

ఆఫీస్ బిల్డింగ్ మెయిన్ డోర్ తాళం పెట్టి ఉంది.

దానికేదో నంబర్ కోడ్ ఉంది. జగదీష్ చక చకా యేవో నంబర్లు తిప్పాడు. అప్పుడు వాచ్‌మన్ తనవద్ద నున్న తాళంచెవి ఉపయోగించి మెయిన్ డోర్ తెరిచాడు.

"చాలా జాగ్రత్త తీసుకుంటున్నారే...." అన్నాడు విఠల్.

"నేను లేనిదే ఇందులో చీమ కూడా జొరబడలేదు" అన్నాడు జగదీష్. విఠల్ నవ్వి ఊరుకున్నాడు.

ఇద్దరూ లోపలకు వెళ్ళారు. జగదీష్ ఆఫీసు గది చేరుకునేలోగా మరో మూడు ముఖద్వారాలు తెరవాల్సి వచ్చింది. అన్నింటికీ నంబర్ కోడ్ ఉంది. చివరకు జగదీష్ ఆఫీసు గదిలోకి వెళ్ళారిద్దరూ.

ఎయిర్ కండిషన్‌డ్ గది. ఎగ్జిక్యూటివ్ టేబులు, చెయిర్ ఉన్నాయి. గది నానుకునే స్పెషల్ రూం వుంది.

స్పెషల్ రూం తలుపులు తెరుస్తూ — "నేను దేశద్రోహం చేస్తున్నాను...." అన్నాడు జగదీష్.

విఠల్ అతడి భుజం తట్టి—"ఈ భూమి, ఈ గాలి, ఈ నీరు అందరిదీ! దేశం పేరుతో ఎల్లలేర్పడితే అది రాజకీయ ప్రయోజనాలకు. మనకు దేశంతో నిమిత్తం లేదు. సుఖజీవనానికవసరపడ్డ ధన సంపాదనే మన లక్ష్యం కావాలి. ప్రతి వ్యక్తీ ఒక దేశం. ఇదే గుర్తుంచుకుంటే నీలోంచి సంకుచిత భావాలు తొలగిపోతాయి.." అన్నాడు.

జగదీష్ విఠల్ చెప్పిన ప్రకారం లాకర్ నంబర్ టూ తెరిచాడు. అందులో ఇరవై రెండో నంబరు ఫైలుతీశాడు. విఠల్ ఆ ఫైలు తీశాడు. అతడి కళ్ళు ఆనందంతో

మెరిశాయి. తన జేబులోని మినీ కెమేరాతో చకచకా ఆ ఫైల్లోని కాగితాలన్నింటినీ ఫోటోలుతీశాడు.

"థాంక్స్!" అన్నాడు విఠల్.

జగదీష్ టైము చూసుకొని — "ఎనిమిదింపావయింది. మనమిక పోదాం...." అన్నాడు.

ఇద్దరూ చకచకా బయటకు వచ్చారు.

అక్కడ స్కూటరులేదు.

వాచ్‌మన్ అతడికి సెల్యూట్ కొట్టి — "విజయా ఆటో మొబైల్స్‌లో పనిచేసే సత్యం అనే వ్రాడు మీ స్కూటరు తీసుకొని వెళ్ళాడు. మీరు చెప్పారుటగా...." అన్నాడు.

సత్యం వాచ్‌మన్‌కి బాగా పరిచయం. అతడికిది అలవాటే! ముందుగా జగదీష్ చెబుతాడు. అతడు వచ్చి స్కూటర్ తీసుకొని వెళ్ళి చెక్ చేస్తాడు. అయితే తనీ రోజు సత్యానికి చెప్పలేదు. అతడేదో అనబోగా విఠల్ జగదీష్‌ని వెనుకనుంచి మెల్లిగా గిల్లి తనేమో-"సరే- మేము సత్యం దగ్గర్నుంచి స్కూటర్ తీసుకుంటాంలే...." అన్నాడు.

అక్కణ్నించి నాలుగడుగులు వేసేక — "నీ తరఫున సత్యానికి మా వాళ్ళే ఈ కబురందజేశారు...." అన్నాడు.

"ఎందుకని?" అన్నాడు జగదీష్ వాచీవంక చూసుకుంటూ.

"కంగారుపడకు — పక్క సందులో నా మోటార్ సైకిలుంది. నేను నిన్ను డ్రాప్ చేస్తాను...." అన్నాడు విఠల్.

జగదీష్ ఎక్కువగా మాట్లాడదల్చుకోలేదు. ముందు

అర్జంటుగా ఇల్లు చేరుకొని జ్యోత్స్నను రక్షించుకోవాలని అతడాత్రపడుతున్నాడు.

పక్క సందులో నిజంగానే ఓ మోటార్ సైకిలుంది. విఠల్ దాన్ని స్టార్టు చేశాడు. జగదీష్ వెనకాల యెక్కి కూర్చున్నాడు.

కొంతసేపటికి మోటార్ సైకిలు వేరే దారిలో వెడుతోందని గ్రహించాడు జగదీష్—"ఏయ్—ఏమిటిది? మా యింటికి దారిటుకాదు...." అన్నాడు.

మోటార్ సైకిలు ముందుకు దూసుకుపోతోంది.

"ఏయ్ ఆపు .... నిన్నే!" అన్నాడు జగదీష్ ఆత్రుతగా.

విఠల్ మరో అయిదు నిమిషాలదాకా ఆపలేదు. అప్పుడతడు ఇంజన్ ఆపి స్టాండు వేశాడు.

"అనవసల టైము పరుగెడుతోంది. ఆపమంటే ఆపవేం?"

"ఇప్పుడూ ఆపకపోదును, పెట్రోలు రిజర్వులో వుంది. బండితానంతటదే ఆగిపోయింది...."

"అయితే...."

"సరిగ్గా అయిదు నిమిషాలుంది ఎనిమిదీనల భై అయిదుకి. ఇప్పుడు నాతో పోట్లాటే వేసుకుంటావో .... ఇంటికే పరుగెడతావో .... ఆలోచించుకో .... ఇది నీ ప్రేమకు పరీక్ష ...." అన్నాడు విఠల్ క్రూరంగా నవ్వుతూ.

"యూ ....నిన్ను ....నిన్ను ...."

"ఆవేశపడి టైము వృధా చేసుకోకు...."

"ఇంక నాకు టైము లేదు...." అన్నాడు జగదీష్.

"నీ భార్యకు తెలివుంటే ప్రతిఘటించవచ్చు. ఏదైనా ఉపాయంతో అతడిని కాసేపు ఆపవచ్చు. లేదా

సుకుమార్ పై నీవు చెప్పిన దేశభక్తి ప్రబోధం పనిచేసి వుండవచ్చు. ఎనిమిదీనల్లై అయిదుకల్లా నా మనుషులు ఇంటిని వదిలి వెళ్ళిపోతారు. అటుపైన అంతా సుకుమార్ మంచితనంమీదా, నీ భార్య తెలివిమీదా ఆధారపడి వుంది. ఇక్కణ్నించి ఇంటికి పోయావా—నీకు గొప్ప అవకాశం-ఇంకా వుండవచ్చు. బాగా ఆలోచించుకో.."

జగదీష్ క్షణమాత్రం ఆలోచించాడు. ఆ తర్వాత అక్కణ్నించి ఒక్క పరుగుతీశాడు.

"పూర్ ఫెలో! లేకపోతే నా ఆమాకీ తీయడానికి నా ప్రాణంతీసి వుండేవాడు. సుకుమార్ చేతికి అందిన అందాన్ని వదులుతాడా? ఎవడికర్మకెవరు కర్తలు...." అనుకుంటూ క్రూరంగా నవ్వుకున్నాడు విఠల్.

కొద్ది క్షణాల్లో అతడిపక్కన ఓ కారు ఆగింది. కార్లోంచి ఓ వ్యక్తి తల బయటపెట్టి చూసి—"హలో-విఠల్! కాయా, పండా?" అనడిగాడు.

"పండే!"

"వెల్ డన్!" అంటూ ఆ వ్యక్తి డోర్ తెరిచాడు. విఠల్ కారెక్కాడు.

# 6

కాలం స్థంభించినట్లు సుకుమార్ భావించినప్పటికీ మొత్తంమీద టైము ఎనిమిదీనల్లైఅయిదయింది. ఉక్కు పిడుగుకాక మరో ముగ్గురు మనుషులతడి వద్దకు వచ్చారు. "జగదీష్ రాలేదు. మనసుకు గాబరాగా వుందని మీ నాన్న నిద్రమాత్రవేసుకొని పడుకున్నాడు. మేము వెళ్ళి పోతున్నాం. మా పని అయిపోయింది...." అన్నాడు వారిలో ఒకడు.

సుకుమార్ వారిని సాగనంపి తలుపులు వేసుకున్నాడు.

అతడి శరీరంలో సన్నని వణుకు. మనసులో యేదో మధుర భావన. కానీ అంతలోనే భయం.

జ్యోత్స్నకు తనంటే నిజంగా ఇష్టమో కాదో తెలియదు. ఇష్టంకాకపోతే తనామెను బలవంతం చేయ గలడా?

ఇంట్లో తండ్రి ఒక్కడే వున్నాడు. నిద్రమాత్ర వేసుకొని పడుకుంటే ఆయనకు భూకంపాలు వచ్చినా, వెయ్యి ఏనుగులు ఘీంకరించినా మెలకువ రాదు. గదిలో అసహాయ స్థితిలో జ్యోత్స్న. ఆ గదికి తాళం....తనవద్ద తాళంచెవి వుంది.

ఏం చేయగలదామె? ఆ స్థితిలో తననసలు ప్రతి ఘటించగలదా?

సుకుమార్‌లో ఆవేశం పుడుతోంది. ఆ వేశాన్ని భయం కమ్మేస్తోంది. మధ్యలో జగదీష్ వస్తాడేమోనని అతడు భయపడుతున్నాడు.

ఆ విధంగా టైము పడయ్యేవరకూ అతడు జాప్యం చేశాడు.

జగదీష్ ఇంకా రాలేదు.

సుకుమార్‌లో క్రమంగా ధైర్యం వచ్చింది. అతడు లేచివెళ్ళి గదితలుపులు—తాళంతీసి తెరిచాడు.

ఆ వెనువెంటనే — "జగదీష్!" అంటో కోమల స్వరం.

ఆ గొంతు జ్యోత్స్నది.

సుకుమార్ మాట్లాడకుండా లోపల అడుగు పెట్టాడు. ఆతడు తలవంచుకొనే వున్నాడు. తలెత్త డానికి ధైర్యం చేయడానికి మరి కాసేపు పట్టింది. తలెత్తగానే జ్యోత్స్నను చూశాడు. అతడి నరనరా

ల్లోనూ విద్యుత్ ప్రవహించింది.

మంచంమీద కూర్చుని వుంది జ్యోత్స్న. రెండు తల దిండ్లను తన శరీరానికి దగ్గరగా అదుముకుందామె. మంచం మీద దుప్పటికూడా లేదు.

జ్యోత్స్న సుకుమార్ వంక నే చూసి—"నువ్వా?" అంది.

సుకుమార్ ఆమెవైపే చూస్తున్నాడు. అతడిలో ఆవేశం కట్టలు తెంచుకుంటోంది కానీ ధైర్యమింకా చాలడంలేదు.

"అంటే జగదీష్ రాలేదన్నమాట" అంది జ్యోత్స్న.

"నేను రావడం నీకు నచ్చలేదా?" అన్నాడు సుకుమార్ చటుక్కున. విఠల్ ఆమె కులట అని చెప్పిన విషయం అతడికి హఠాత్తుగా గుర్తొచ్చింది.

"అంటే నువ్వు విఠల్ ఇచ్చిన అవకాశం వుపయోగించదల్చావన్నమాట...నిజంగా..." అని ఆగిపోయింది జ్యోత్స్న.

సుకుమార్ మౌనంగా ఆమెను సమీపించి—"నీకు నీ భర్తతో కాక ఇతర పురుషులతో సంబంధమున్నట్లు విఠల్ చెప్పాడు. అందుకే నేను వచ్చాను.." అన్నాడు.

జ్యోత్స్న వెంటనే — "విఠల్ నా గురించి చెప్పిందంతా నిజం. నేను నిన్ను కూడా ప్రతిఘటించను..." అంది.

సుకుమార్ మంచంమీద కూర్చుని — "నేనంటే నీకిష్టమే కదూ—..." అన్నాడు.

"నా యిష్టంలో నీకు నిమిత్తమేమిటి?"

"నిమిత్తంలేదు. ప్రతిఘటించనని మాటివ్వు చాలు.."

"నిన్ను ప్రతిఘటించి ఏమి లాభం? జగదీష్ నన్నింక

ఏలుకోడు..."

"ఇందులో తప్పేముంది? తనే నిన్ను రక్షించుకోలేక పోయాడు..."

"ఏది యేమైనా యిది పురుష ప్రపంచం. జగదీష్‌కి నాకంటే దేశమే ఎక్కువ. అందుకే నా మానాన నన్ను వదలి వెళ్ళాడు. అనుకున్న పైమకు తను రాలేక పోయాడుగా—ఇంక నన్ను చూడ్డానికి కూడా రాడు" జోత్స్న వెక్కి వెక్కి యేడ్వసాగింది.

"ఇది చాలా అన్యాయం........" అన్నాడు సుకుమార్.

జోత్స్న యేడుస్తూనే-"ఇందులో అన్యాయ మేముంది? దేశ ద్రోహమని తెలిసీ నువ్వు నాకోసం వచ్చావు. నీ గురించే జగదీష్ నన్ను వదిలేస్తాడు. ఆ సంగతి నీకు తెలుసు. అయినా నువ్వు నామీద వాంఛను చంపుకోవు. పోనీ అతడు వదిలేస్తే నన్ను వివాహమూ చేసుకోవు—" అంది.

సుకుమార్ ఆవేశంలో వున్నాడు—"నేను నిన్ను పెళ్ళి చేసుకుంటాను— ..." అన్నాడు చటుక్కున.

"అది ఆవేశంలో అంటున్న మాట. అదే నిజమైతే ప్రస్తుతానికి నన్ను వదలిపెట్టి—పెళ్ళి చేసుకునేవరకూ ఆగవచ్చుగా—" అంది జోత్స్న.

సుకుమార్ మాట్లాడలేదు.

"నాకు తెలుసు. ఇది పురుషప్రపంచం. స్త్రీకి అన్యాయం చేయడమే పురుషుడి ధ్యేయం. స్త్రీకి జరిగిన అన్యాయాన్ని క్షమించకపోవడమే పురుషుడి గొప్పతనం...." అంది జ్యోత్స్న. ఆమె మళ్ళీ వెక్కి వెక్కి యేడ్వసాగింది.

ఆమె యేమనూంటే సుకుమార్‌కి యేదోలా ఉంది. తనేదో తప్పు చేసిన అనుభూతి అతడిలో కలిగింది. అతడిలో ఆవేశం చల్లారింది.

"నా నిజాయితీని నిరూపించుకుంటాను...." అంటూ అతడు గది బయటకు వెళ్ళాడు. జ్యోత్స్న అతడు వెళ్ళిన వైపే చూస్తోంది. తిరిగివచ్చిన అతడి చేతిలోని ప్లాస్టిక్ సంచీని చూసి ఆమె తేలికగా నిట్టూర్చింది.

అతడా సంచీని మంచంమీద ఉంచాడు.

"చాలా థాంక్స్! బీరువాకు తాళం పెట్టి ఆ తాళాలు బీరువామీద పెట్టాడా విఠల్. అవి కూడా తీసి మంచం మీద పెట్టి వెళ్ళిపో. నీ మేలు మరచిపోను. నీ ఋణం ఉంచుకోను—" అంది జ్యోత్స్న.

సుకుమార్ అలాగే చేసి వెళ్ళిపోయాడు. జ్యోత్స్న నగ్నశరీరాన్ని కూడా చూడలేకపోయినప్పటికీ అతడికిప్పుడే ఎంతో తృప్తిగా ఉంది. అయితే ఆ రాత్రి నిద్రపోవడానికి తనూ నిద్రమాత్రలు వేసుకున్నాడతడు.

## 7

మర్నాడు బాగా ఆలస్యంగా నిద్ర లేచాడు సుకుమార్. క్రమ క్రమంగా అతడికి నిన్నటి రాత్రి అనుభవమంతా గుర్తొచ్చింది.

జోత్స్న తనకు దక్కవలసింది కానీ తనెంతో ఉదార బుద్ధితో వ్యవహరించాడు. అయినప్పటికీ భర్త ఆమెను వదిలిపెట్టేస్తా డనుకొంటోందామె. ఆ మాత్రానికే భర్త ఆమెను వదిలేస్తాడా? ఆఖరి కామె తనను వివాహం చేసుకోమని కూడా కోరింది.

తనకామె అంటే యిష్టం. ఆమెతో అనుభవాన్ని కోరాడు. ఆమెకు వివాహమైందని కానీ, ఆమెకు భర్త

ఉన్నాడని కానీ అతడు పట్టించుకోలేదు. మనసారా ఆమెను కోరాడు. అటువంటప్పుడు వివాహం చేసుకో డానికేం?

సుకుమార్ కి రణధీర్, రవిశంకర్ గుర్తొచ్చారు. ఇద్దరూ పెద్దవాళ్ళు. జ్యోత్స్న పిల్లలు. జ్యోత్స్న ఆ పిల్ల లకు తల్లిలా కనపడకపోవచ్చు. కానీ వాళ్ళామె పిల్లలు. ఆమె జగదీష్‌తో కాపురం చేసిందనడానికి నిదర్శనం వాళ్ళు.

లాభంలేదు. తనామెను వివాహం చేసుకోలేడు. తను కన్యను తప్ప వివాహం చేసుకోడు.

సుకుమార్ రెండురోజుల పాటు జ్యోత్స్నను కలు సుకోలేదు. ఆమెను కలుసుకుందుకు సిగ్గు, మొహమాటం భయం అన్నీ కలిగాయతడికి. అయితే తండ్రి ద్వారా ఆమె గురించిన వివరాలన్నీ తెలిశాయతడికి. జగదీష్ యింటికి రాలేదు. ఆఫీసులో వాకబు చేస్తే అతడు రాజీ నామా యిచ్చి వెళ్ళిపోయినట్లు తెలిసింది. పిల్లల్ని అతడు కూడా తీసుకుని వెళ్ళిపోయాడట.

ఇవన్నీ రూఢయ్యాక జ్యోత్స్న—ఇంట్లో ఫర్నిచర్, ఇతర వస్తువులు అయిన కాటికి అమ్మేసి—ఇంటద్దె కట్టేసి వెళ్ళిపోయింది. సుకుమార్ ఆమె తనకు బాధ్యతగా మారు తుందన్న భయంతో—ఆమెను తప్పించుకునే తిరిగాడు. ఆమె కూడా ఆ విషయం అర్థం చేసుకున్నదానిలా అత డిని కలుసుకునేందుకు ప్రత్యేకంగా యే ప్రయత్నమూ చేయలేదు.

జ్యోత్స్న వెళ్ళిపోయిన రెండు వారాలకు జగదీష్ పని చేస్తున్న ఆఫీసు నుంచి సుకుమార్ కి పిలుపు వచ్చింది.

ఎందుకోసనుకుని వెళ్ళాడతడు.

"నీకు మా సంస్థలో ఉద్యోగమిస్తాం...." అన్నాడక్కడి అధికారి.

సుకుమార్ ఆశ్చర్యంగా—"అప్లికేషన్ పెట్టాక వేలకు వేలు లంచాలిచ్చినా ఉద్యోగాలు దొరకని యీ రోజుల్లో—యే అప్లికేషనూ లేకుండా మీరు నాకిస్తా మనడం చాలా ఆశ్చర్యంగా ఉంది...." అన్నాడతను.

"ఈ ఉద్యోగానికి నిన్ను జగదీష్ రికమెండ్ చేశాడు."

"ఆశ్చర్యంగా ఉందే?" అన్నాడు సుకుమార్.

"ఇందులో ఆశ్చర్యమేమీ లేదు. ఈ సంస్థలో పని చేసే ప్రతి ఒక్కడూ సచ్ఛీలతకూ, దేశభక్తికీ మారు పేరుగా ఉండాలి. నీ సచ్ఛీలతను జగదీష్ అంచనా వేశాడు. సచ్ఛీలత ఉన్నవాడికి దేశభక్తి ఉండి తీరుతుంది...."

తన సచ్ఛీలతను జగదీష్ యెలా అంచనా వేశాడో సుకుమార్‌కి అర్థం కాలేదు. కానీ వచ్చిన ఉద్యోగాన్నతడు వదులుకోనూ లేదు.

సుకుమార్ ఉద్యోగంలో చేరాడు. ఆర్నెల్లపాటు మామూలు ఫైల్ వర్క్ చేశాడు. తర్వాత ఒకరోజున పై అధికారి అతడిని—"నువ్వు ట్రయినింగ్‌కు వెళ్ళాలి" అని చెప్పాడు.

ట్రయినింగొక పల్లెటూళ్ళో. అదీ అతి సామాన్యమైన పల్లెటూరు.

సుకుమార్ ఒక్కడూ అడ్రసు పట్టుకుని పల్లెటూరు వెళ్ళి తనకొక్క కలసిన యిల్లు చేరుకున్నాడు. ఇంట్లో ఒక

స్త్రీ ఉంది. ఆమె వయసు ముప్పైఅయిదుండవచ్చు. ఆమె అతడిని సాదరంగా ఆహ్వానించింది.

"నేను శ్రీధరరావుగారిని కలుసుకుందుకు వచ్చాను" అన్నాడతను.

"వారు పొలానికి వెళ్ళారు. ఓ గంటలో వస్తారు.." అంటూ ఆమె అతడితో కబుర్లు మొదలుపెట్టింది. మాటల మధ్య ఆమె అతని వివరాలు చాలా ఆరాతీసింది. అసలు సంగతేమిటంటే ఆమెకు పట్నంలో చదువుకుంటున్న పదిహేడేళ్ళ కూతురుంది. ఆమె అక్కడ బంధువులింట్లో ఉంటున్నప్పటికీ ఈమెకెప్పుడూ ఆ పిల్ల పెళ్ళి ధ్యాసే!

సుకుమార్ వివరాలామెకంత సంతృప్తిని కలిగించక పోగా ఆమె భారంగా నిట్టూర్చింది. ఈలోగా శ్రీధర రావు రానే వచ్చాడు.

అతడిని చూసీ చూడగానే యెక్కడో చూశానని పించింది సుకుమార్‌కి. అయితే గుర్తించడానికంతో సేపు పట్టలేదు. అతడు జగదీష్!

"మీరా?" అన్నాడు సుకుమార్ ఆశ్చర్యంగా.

జగదీష్ అతడినింకేమీ మాట్లాడవద్దని వారించి డాబామీదకు తీసుకొని వెళ్ళి—"కాస్త జాగ్రత్తగా మాట్లాడు. ఈమె నా అసలు భార్య...." అన్నాడు.

"అంటే?" అన్నాడు సుకుమార్ ఆశ్చర్యంగా.

"ఇప్పుడు నువ్వు చూస్తున్నది నా అసలు వేషం కూడా!" అన్నాడు జగదీష్.

"నాకేమీ అర్థం కావడం లేదు ...." అన్నాడు సుకుమార్.

అప్పుడు జగదీష్ వివరించాడు.

గూఢచారి సంస్థకు పటిష్టమైన పథకాలు మాత్రమే కాదు — అసలు గూఢచారులెవరో తెలియకపోవడం చాలా ముఖ్యం. దేశంలో పలుచోట్ల జగదీష్‌వంటి గూఢచారులున్నారు. ఒకోపనికి అవసరమైనప్పుడు వారిని ప్రత్యేకంగా నియమించడం జరుగుతూంటుంది. మామూలుగా అయితే శ్రీధరరావు—పల్లెటూళ్ళో వ్యవసాయం పనులు చూసుకుంటూ ఆ చుట్టుపక్కాలకు సంబంధించిన సమాచారం సేకరించి ప్రభుత్వానికందజేస్తూంటాడు.

జడ్—17 టెక్నాలజీ రహస్యం తెలుసుకుందుకు పాకిస్తాన్ గూఢచారులు రంగంలోకి దిగారని తెలియగానే వారిని మొత్తం ముఠాగా పట్టుకోవడంకోసం—జగదీష్ పేరిట శ్రీధరరావు అపాయింట్ చేయబడ్డాడు. ఇది చాలా కీలకమైన వ్యవహారం. విద్రోహులెంతకైనా తెగించినవారు. వాళ్ళు సాధారణంగా గూఢచారుల అధికారిని పట్టుకునేందుకతడి కీలకాలను వెతుకుతారు. జగదీష్‌కి భార్యాబిడ్డలే ప్రాణమన్న భ్రమ వారిలో కలిగేలా జీవించాడతను.

అప్పుడు విద్రోహులు వారినుపయోగించి జగదీష్‌ను తమ చేతుల్లో కీలుబొమ్మను చేసుకోవాలనుకుంటారు. అటువంటప్పుడు నిజం భార్యాబిడ్డలయితే—యెటువంటి అధికారికైనా గుండె నిబ్బరం దెబ్బతింటుంది. అందుకే ఇలాంటిచోట్ల నకిలీ సంసారాలతో వ్యవహరిస్తారు. విద్రోహులు పిల్లల్నెత్తుకుపోయారు. వాళ్ళు తన పిల్లలు కారు కాబట్టి — మనసున్న మనిషిగా మానవత్వంతో

జగదీష్ వారిని కాపాడుతాడు తప్ప కన్న తండ్రిగా మనో నిగ్రహాన్ని కోల్పోడు.

భార్యకు మానభంగం జరిగే విపత్కర మేర్పడింది. ఆమె తన భార్య కాదు కాబట్టి జగదీష్ అందుకు తట్టుకో గలడు. విద్రోహులకీ విషయం తెలియదు. తను వారి జాలంలో ఇరుక్కున్నట్లు నటిస్తూ జగదీష్ వారిపై జాలం పన్నాడు. తనవారి గురించి ఏమాత్రం పట్టింపులేకున్నా వారి గురించే వ్యథ చెందుతున్నట్లు నటించి-విద్రోహుల పై తన మనుషుల పూర్తి నిఘా వుంచి వారందర్నీ మొత్తం బంధించగలిగాడతను. పైకి మాత్రం జీవితంలో దెబ్బతిన్న వాడికిలా వుద్యోగం రిజైన్ చేసి వెళ్ళిపోయాడు.

"ఈ కేసులో నువ్వు మా డిపార్టుమెంటుకు లభించడ మొక అదృష్టం...." అన్నాడు శ్రీధరరావు.

"కానీ నా సచ్ఛీలత మెచ్చుకోతగ్గది కాదు. వివాహితురాలని తెలిసీ జ్యోత్స్నపై వాంఛ పెంచుకున్నాను. ఆ సమయంలో యెందుకు తటపటాయించానో నాకే తెలియదు" అన్నాడు సుకుమార్.

"తప్పు చేయాలనుకోనివారు అరుదు. కానీ తప్పు చేయాలన్నా కాంక్షనణచుకోవడం గొప్ప విశేషం. అవకాశ మొచ్చినా తప్పు చేయనివాడి సంస్కారం గొప్పది!"

"ఈ పల్లెటూళ్లో మీరు నాకు శిక్షణ ఏమిస్తారు?" అన్నాడు సుకుమార్ మాట తప్పిస్తూ. పొగడ్తలెవరి కైనా వినడం బాగానే వుంటుంది కానీ సంస్కార వంతులకు మొహమాటం అడ్డొస్తుంది.

"నాతో మాట్లాడేవు కదా! అదే శిక్షణ నీకు. అయితే ఒక విషయం గుర్తుంచుకో. ఏదో ఒకరోజున నువ్వు

నాకులా నకిలీ సంసారం నడపాల్సొస్తుంది. ఆ రోజున నగ్నంగా వున్న జ్యోత్స్నను—ఏకాంతంలో వుండికూడా వదలగలిగావు. అదేవిధంగా నీ నకిలీ భార్యతో—ఒకే గదిలో పడుకుంటూ-కనీసం కొద్దిమాసాలు నీ సంస్కారం చూపగలగాలి. నేనలా జీవించాను. నువ్వూ అలాగే వుండాలి. ఇలాంటి సంస్కారమే—మనకూ మనదేశానికీ శ్రీరామ రక్ష....” అన్నాడు శ్రీధరరావు.

సుకుమార్ అతడి వంకే ఆశ్చర్యంగా చూస్తూండి పోయాడు.

—:అ యి పో యి ం ది:—

# అమ్మాయి పెళ్లి?

చంద్రశేఖర అజాద్

లొకేషన్ అంతా హడావుడిగా వుంది.

కొన్ని వందలమంది అక్కడ పనిచేస్తున్నారు. రెండు పెద్ద క్రేనులున్నాయి. కెమెరామేన్ తన కార్యక్రమంలో వున్నాడు. నటీనటులు కూర్చుని మాట్లాడుకుంటున్నారు. వారికి ఎండ తగలకుండా రంగురంగుల గొడుగులు పాతేశారు.

దూరంగా ఓ కుర్చీలో కూర్చుని ఆలోచిస్తున్నాడు దర్శకుడు నారాయణ్.

అటూ ఇటూ చూస్తున్న ఓ పాత్రికేయుడు సంతోషంగా ఆ వైపుకు నడిచాడు. ఆ పత్రిక తాలూకు ఫోటోగ్రాఫర్ దర్శకుడి ఆ భంగిమను తన కెమెరాలో బంధించాడు.

"ఎక్స్‌క్యూజ్ మి" అన్నాడు విలేఖరి.

"ఓ, మీరా రండి" అంటూ ఆహ్వానించాడు.

వారు కూర్చునటానికి వేరే కుర్చీలు లేవు.

"అరే ఛైర్స్ లేవే" అని బాయ్‌ని పిలవటానికి అటూ ఇటూ చూస్తుంటే 'ఫర్వాలేదులెండి' అన్నాడతను.

"నో...నో .... మీ పత్రికల వారితో డేంజరండి బాబు. రేపు కనీసం సీటయినా ఆఫర్ చేయలేదని రాస్తారు. నేనూ నిలబడుతున్నా" అంటూ నిలబడ్డాడు.

"భలేవారండి" అన్నాడు విలేఖరి నవ్వుతూ.

"చెప్పండి" అన్నాడు నారాయణ్.

"ఏం లేదు. ఈ రోజు మీతో ఇంటర్వ్యూ తీసుకోవాలనుకుంటున్నాను. మా పద్ధతి మీకు తెలుసు. మా పత్రిక కవర్ పేజి కవరేజికోసం ఈ ఇంటర్వ్యూ డిటైల్డ్‌గానూ, వెరయిటీగానూ వుండాలని మా అభిలాష" అన్నాడతను.

"అవును. మీ పత్రిక ప్రత్యేకత నాకు తెలుసు" అన్నాడు నారాయణ్ ముక్తసరిగా.

"మొదలు పెడదామా."

"అలా నడుస్తూ మాట్లాడుకుందాం. మీకేం అభ్యంతరం లేదుగా. రొటీన్‌గా ఆ ఏర్పాట్లుకూడా చూసినట్లుంటుంది. ఏమంటారు" అన్నాడు నారాయణ్.

"యు సెస్. ఇటీజ్ వెరీ నైస్" అన్నాడు విలేఖరి.

"ఇప్పుడు చిత్రీకరించే దృశ్యం ఏమిటి?"

"ఇది చివరి షెడ్యూల్. క్లైమాక్స్ దృశ్యాలు చిత్రీకరిస్తున్నాం."

"భారీగా వున్నట్లుందే."

"దాదాపు నాలుగు లక్షలదాకా ఖర్చవుతుంది. వేలాది జనంతోపాటు, వందలాది గుర్రాలు పాల్గొంటున్నాయి. రెండు కెమేరాలతో చిత్రీకరిస్తున్నాం. మొత్తంమీద ఈ చిత్రం హాలీవుడ్ చిత్రాల్ని మరిపింప

చేస్తుంది" అన్నాడు నారాయణ్.

"మీ రెక్కువగా క్రైమ్ చిత్రాలకు మాత్రమే దర్శకత్వం వహించటానికి కారణం ఏమిటి?"

"ముద్రండి బాబూ ముద్ర. ఈ ముద్రనుండి బయట పడాలని ఈ నడుమ రెండు సాంఘికాలు తీశాను. జనం ఛీకొట్టారు. అందుకే ఈ రకం చిత్రాలే తియ్యాలను కుంటున్నాను. వీటికి మినిమమ్ గ్యారంటీ వుంది. ఓ వేళ 'ఏ' కేంద్రాల్లో ఫెయిలయినా 'బి' కేంద్రాల్లో బాగా వసూలు చేస్తాయి. ఈ రోజు జనానికి కావలసిన స్పీడ్ వీటిలో వుంది."

"ఈ చిత్రాల్లో పాత్రలు ఈ దేశానివా....హాలివుడ్ చిత్రాల్ని అనుకరించి తియ్యటంలో మన చిత్రాల్లో నేటివిటీ దెబ్బతింటుందంటున్నారు. ఓ ర కం గా ఈ విమర్శకు సరైన సమాధానం చెప్పాల్సిన బాధ్యత మీ ముందుంది."

"నిజమే. ఈ చిత్రాల్లో నేటివిటీ లేదు. ఏ చిత్రాల్లో వుంది చెప్పండి. తెలుగుదనం మన సాంఘికాల్లో వుందా. మన పౌరాణికాల్లో కూడా పాటలకు గిటార్ సెందుకు వినియోగిస్తున్నాం. అదలా వుంచితే విదేశీ ప్రభావం అనేది మన జీవితాల్లోనే వుంది. అడుగడుగునా వుంది. తెల్లారిలేస్తే బ్రష్ నుండి సోప్ దాకా, రేడియో నుండి వీడియో దాకా విదేశాలవే కదా .... మనం అప్పులు చేస్తుంది...."

"మీరు పొలిటికల్ గా వెళ్తున్నారనుకుంటాను."

"కాదు. అయినా ఆ రంగంలోనూ మేమే దున్నేస్తున్నాం కదా. ప్రపంచం విశాలమైనప్పుడు ఈ మార్పులు తప్పవు. ప్రేక్షకుడ్ని మూడు గంటలసేపు వినో

దింప చేయటమే ప్రధానం కాబట్టి, అందుకు నూతన మార్గాల్ని అన్వేషించటమే నా పద్ధతి."

"ఇలాంటి చిత్రాలు చూసి యువతరం చెడిపోతుందని విమర్శ వుంది."

"ఇది నేను ఒప్పుకోను. చెడిపోయేవాడు ఈ సినిమాలు చూడకపోయినా చెడిపోతాడు" కొంచెం గట్టిగానే అన్నాడు.

"అసిత్వమా" అని నవ్వాడు విలేఖరి.

"లేకపోతే యేమిటండి రావణాసురుడు యే సినిమాలు చూసి చెడిపోయారంటారు" అన్నాడు నారాయణ్.

"పాయింటే" అన్నాడు విలేఖరి.

అతనికో మంచి కాప్షన్ దొరికింది. ఇంటర్వ్యూ పసందుగా వుందనుకొన్నాడు.

"ఇప్పుడు మీరు తీస్తున్న సన్నివేశాల్ని వివరిస్తారా"

"తప్పకుండా. ఓ దొంగల ముఠా తెల్లవారేలోపు ఓ వంతెన్ని అపహరిస్తుంది."

"వ్వాట్" అన్నాడు విలేఖరి నోరు తెరిచి.

"మరేం కంగారుపడకండి. చీకటి పడేలోపు తిరిగి వంతెన నిర్మిస్తారు."

అతనింకా ఆశ్చర్యంనుండి కోలుకోలేదు.

"ఏమిటలా అయిపోయారు" అన్నాడు నారాయణ్ నవ్వుతూ.

"అది కాదండి. మీ క్రొత్తదనానికి నా మతి పోయేట్లుంది."

"థాంక్స్ ఫర్ యువర్ కాంప్లిమెంట్. అయితే ఇదేం ఆశ్చర్యపోవాల్సిన సంఘటన కాదు. సరిగ్గా

ఇలాంటిదే అమెరికాలో జరిగింది."

"నిజమా."

"హండ్రెడ్ పర్సెంట్. ఓ పేపర్లో ఈ వార్త చదివాక మాకీ ఐడియా వచ్చింది. మా చిత్రంలో మేం సాయం కాలానికి ఎత్తుకుపోయిన వంతెన స్థానంలో మరొకటి నిర్మించేలా రాసుకున్నాం. ఈ రోజు దొంగతనాల్లో, హత్యల్లో అనేక మార్పులొచ్చాయి. ఏం జరిగిందన్నా ఈ రోజుల్లో ఆశ్చర్యం చెందాల్సిన పనిలేదు."

"మీ కెక్కడ దొరుకుతాయండి ఇలాంటి వార్తలు."

"మీ పత్రికల్లోనే ఏదో మూల వేస్తుంటారు. అవే సేకరిస్తాం. ముఖ్యంగా నా అసిస్టెంట్ సుధాకర్ ఇలాంటివి సేకరిస్తుంటాడు. వాటిమీద మేం కథలల్లు కుంటుంటాం."

"ఈ దృశ్యాలు చూస్తున్నప్పుడు ప్రేక్షకులు నవ్వు కుంటారు కదూ"

"అది చిత్రీకరణమీద ఆధారపడి ఉంటుంది. ఓ విషయాన్ని నవ్వుపుట్టించేలా తీస్తారు కొందరు. నవ్వుకోనివ్వండి. మా చిత్రాలు విజయవంతం కావా లంటే ఏవో కొన్ని మసాలాలుండాలి. ఎవరన్నా ఇలా జరగదని బుకాయిస్తే మా సమాధానం అమెరికాలో జరిగిందనే క్రైమ్‌కున్న అంతర్జాతీయతను మేం ప్రదర్శి స్తున్నాం" అన్నాడు నారాయణ్.

"మీ భావాల్లో వున్న ఆధునికత చిత్రాల్లో కనిపించ దేమిటి? ఈ క్రైమ్‌లోనే మరలా సెంటిమెంట్లు. నానా చెత్తంతా కలగాపులగం చేస్తారు" అన్నాడతను.

"నిజమే. పర్సనల్‌గా అంగీకరిస్తున్నాను. కానీ ఏం చేస్తాం చెప్పండి. నిర్మాత ఏం చెబితే అది చెయ్యాలి.

అందుకు సిద్ధంగా వుంటే నే ఇక్కడ లైఫ్. సెంటిమెంట్ లేకుంటే తెలుగు ప్రేక్షకులు చూడరనే పిడిసూత్రం పాతుకుపోయింది. కాబట్టి అవుండక తప్పదు."

"మీ జీవితాశయం ఏమిటి?"

"నేను హిచ్‌కాక్‌ను ఆదర్శంగా తీసుకొన్నాను. అలాంటి చిత్రాలు నిర్మించాలని నా కోర్కె. బయట నిర్మాతలమీద నా భావాల్ని రుద్దలేను. కాబట్టి స్వయంగా చిత్రనిర్మాణం చేపట్టాలని వుంది. తెలుగు ప్రేక్షకులు ఊహించని, సస్పెన్స్‌తో, భరించలేనంత ఉత్కంఠతో కూడిన సినిమాలు మా సంస్థనుండి రాగలవని మాత్రం చెప్పగలను" అన్నాడు నారాయణ్.

తాను త్వరలో నే భరించలేనంత ఉత్కంఠతను యెదుర్కోబోతున్నానని విషయం అతడూహించలేదు.

"మా పాఠకులకు మీరేం చెప్పదలుచుకొన్నారు?"

"శుభాకాంక్షలు అందచేస్తున్నాను. నా చిత్రాల్లో అద్వెంచర్సుంటాయి. ఆ సాహసాల్ని చూసి యువతరం ఉత్తేజం పొందాలి. నా చిత్రాలు చూసి ఏ ఒక్కరయినా జీవితంలో సాహసానికి పూనుకుంటే నేను గర్వ పడతాను."

"సార్.. షాట్ రెడీ" అంటూ వచ్చాడు సుధాకర్.

"సుధ తెలుసుగా" అన్నాడు పరిచయం చేస్తూ.

"హలో" విష్ చేశాడతను.

"థాంక్స్ ఫర్ యువర్ కో ఆపరేషన్. ఈ ఇంటర్వ్యూ మా పాఠకుల్ని విశేషంగా ఆకర్షిస్తుందని నా నమ్మకం" అన్నాడు విలేఖరి.

"థాంక్స్" అన్నాడు నారాయణ్.

# 2

"డాడీ" అంటూ ఎదురు వెళ్ళింది విద్య.

"ఓ మై స్వీట్ గాల్" అంటూ ఆప్యాయంగా కూతురి తలమీద చేతులు వేసి లోనికి నడిచాడు నారాయణ్.

"షూటింగ్ అయిపోయిందా."

"అయిపోయిందమ్మా."

"ఇంక మద్రాసులోనే వుంటారా?"

"వుంటానమ్మా. నెలరోజులదాకా యెక్కడికీ కదలను."

"మీరలాగే అంటారు వెంటనే వెళ్ళిపోతారు."

"లేదమ్మా.... ఇంక మిక్సింగ్, రికార్డింగ్, అన్నీ ఇక్కడే. వేరే చిత్రమంటూ లేదు. అందుకే ఇక్కడ వుంటాననేది."

"మరి నేను వెళ్ళొస్తా సార్" అన్నాడు సుధాకర్ వెనకనుండి.

అప్పుడు గుర్తొచ్చింది నారాయణ్ కు సుధాకర్ తన వెంట వున్న విషయం.

"వెళతావా? సరే. సాయంకాలం ఓసారి ఫోన్ చెయ్యి. ఈ రోజంతా రెస్టు తీసుకుందాం. రేపటినుండి ఆ కార్యక్రమాలు చూసుకోవచ్చు."

"అలాగే సర్."

సుధాకర్ వెళ్ళిపోయాడు.

"డాడీ.... సుధాకర్ బ్రదర్ కెలా వుంది."

"నవ్ హీ ఈజ్ ఆల్ రైట్ బేబీ.... పెరాలిసిస్ స్ట్రోక్ లైట్ గా రావటి సరిపోయింది. దాంతో వైద్యం చేయించాం కదా.... అన్నయ్య ఏడి."

"కాలేజీకి వెళ్ళాడు."

"అమ్మ."

"పూజలో వుంది."

"ముందు నేను స్నానం చెయ్యాలి" అంటూ డ్రెస్ ఛేంజ్ చేసుకొని బాత్ రూం కెళ్ళిపోయాడు. స్నానం చేశాక ఫ్రెష్‌గా తయారయి వచ్చాడు.

"డాడీ ఈ వారం 'చిత్ర ప్రపంచం'లో మీ ఇంటర్వ్యూ వచ్చింది చూశారా?"

"ఇంకా లేదమ్మా."

"బాగుంది డాడీ."

"అలాగా" అన్నాడు.

విద్య టీపాయ్ మీదున్న పత్రిక అందించింది.

"ఎప్పుడు రావటం" అంటూ లోపలినుండి వచ్చింది నారాయణ్ భార్య.

"అరగంటవుతుంది."

"విద్యా డాడీకి కాఫీ పంపించు" అందామె.

"మర్చిపోయాను" అంటూ లేచింది విద్య.

"ఏమిటి అమ్మాయి పెళ్ళి విషయం ఏం చేశారు?"

"ఈ సినిమా పూర్తి అవనీ. తీరిగ్గా చూద్దాం."

"తీరికా? మీకా? ఊరుకోండి. నాతో మాట్లాడ టానికే మీకు తీరికుండదు. సినిమావాళ్ళని మాత్రం యెవరూ చేసుకోకూడదు. ఓ ముచ్చట వుండదు. ఓ సరదా లేదు. లక్షలుండగానే సరా ఏ రోజన్నా కలిసి భోంచేశామా? షికారెళ్ళామా?"

"ఆగాగు దండకం చదవకు. నాతోపాటు షూటింగ్ స్పాట్‌కు రావోయంటే వినవు. ఓ షూట్ తీసుకుంటే బ్రహ్మాండంగా ఎంజాయ్ చెయ్యొచ్చు."

"ఏంటి నా బొంద ఎంజాయ్ చెయ్యటం, మీరు ఏ రాత్రికో వస్తే అప్పటిదాకా హోటల్లో గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవాలా?"

"సరే ఇంతకూ ఏమిటి నీ గొడవ."

"నా గొడవలానే వుంది. అమ్మాయికి వయసు పెరుగుతుందని మీకు గుర్తుందా? ఇంకెన్నాళ్ళు అమ్మాయి పెళ్ళి చేయకుండా వుంచుతారు. మీ సినిమావారి కెవరికైనా కట్టబెట్టాలని చూస్తున్నారేమో అదేం కుదరదు లక్షణమయిన సంబంధం చూడాలి. ఈ సినిమా పూర్తయితే ఇంకోటుంటుంది. మీరదేం పెట్టుకోకుండా అచ్చంగా ఈ పనిమీదే వుండాలి" అందామె.

పనిమనిషి కాఫీ తీసుకొచ్చింది.

"అమ్మాయేది."

"క్రింద వున్నారండి."

నారాయణ్ కాఫీ సిప్ చేస్తున్నాడు.

"నా కూతురిమీద నాకు ప్రేమలేదంటావా? విద్యను చిన్నప్పటినుండి ఎంత అపురూపంగా పెంచాం. మంచి సంబంధం చూసి బ్రహ్మాండంగా పెళ్ళిచేస్తాను. ఈ డబ్బంతా ఏం చేసుకోవాలి గనక. నా చిట్టితల్లికి మంచి బిల్డింగ్ కట్టిస్తాను. ఈ నడుమ కాలంలో ఇలాంటి పెళ్ళి జరగలేదనిపించేలా చేస్తాను" అన్నాడు నారాయణ్ ఎమోషనల్‌గా కదిలిపోతూ.

ఫోన్ మ్రోగింది.

"హలో నారాయణ్ స్పీకింగ్."

అవతల ఎవరో మాట్లాడుతున్నారు.

"అలాగే .... అలాగే .... వుంటాను" అంటూ ఫోన్ పెట్టేశాడు.

"ఎవరండి మాట్లాడుతుంట."

"ఎవరో ప్రొడ్యూసర్. అది సరే ఈ విషయం గురించి నువ్వేం దిగులుపడకు. నేను అమ్మాయి పెళ్ళి గురించి కొంతమందితో చెప్పి వుంచాను. మంచి సంబంధం రాగానే చేద్దాం. ప్రస్తుతం వేరే షూటింగ్స్ లేవు. పనంతా ఇక్కడే. అదంతా సుధాకర్ చూసుకుంటాడు. ఈలోపు ఈ విషయం సెటిల్ చేద్దాం. సరేనా?" అన్నాడు నారాయణ్.

"చూద్దాం .. ఎంతవరకు చేస్తారో" అందామె.

నారాయణ్ నవ్వుతూ పత్రిక అందుకున్నాడు.

"ఊహించని సంఘటనలతో దర్శకుడు నారాయణ్ సమర్పించనున్న చిత్రం" అని వుంది.

చదవటం మొదలుపెట్టాడు.

## 3

మిక్సింగ్ కార్యక్రమం జరుగుతూంది. టీ బ్రేక్ ఇచ్చారు. అంతా బయటకు వచ్చారు.

నారాయణ్ సుధాకర్‌ను ప్రక్కకు పిలిచాడు.

"ఈ చిత్రం మీదే మనం ఆశలు పెట్టుకున్నాం" అన్నాడు నారాయణ్.

"అవును. ఈ నడుమ వచ్చిన గేప్ ఈ చిత్రంతో తొలిగిపోతుంది."

"ఈ చిత్రం పనయ్యాక మనం చెయ్యాల్సిన కార్యక్రమం ఇంకోటుంది."

"ఏమిటి సార్."

"అమ్మాయి పెళ్ళి."

"చేద్దాం సార్."

"ఇదేమన్నా ఫైటింగ్ సీన్ కాదయ్యా చెయ్య

టానికి. పెళ్ళయ్యా పెళ్ళి. అందులోనూ నా యేకైక విద్యకు యెంతో ఘనంగా పెళ్ళిచెయ్యాలి. అందుకే ముందు మంచి వర్రాడికోసం వెతకాలి. మంచి సంప్రదాయం వున్న కుటుంబంకోసం చూడాలి. అన్నీ కలిస్తే వెంటనే పెళ్ళిచేద్దాం."

సుధ ఆశ్చర్యంగా చూశాడు.

"ఏమిటలా చూస్తున్నావ్. సంప్రదాయాలంటున్నానా? మరవి లేకుంటే ఎలా? మనం సినిమాల్లో రకరకాలుగా చిత్రిస్తుంటాం. అవన్నీ జీవితంలో అప్లై చేసుకుంటే కష్టం."

సుధాకర్ జవాబుగా నవ్వాడు.

"ముందు మనం యెవరికైనా చెబితే నాలుగయిదు సంబంధాలు చూస్తారు. అందులోనూ మా కులంవాడు.. మంచివాడు దొరకాలంటే అర్జెంటుగా దొరకరు" అన్నాడు నారాయణ్.

సుధాకర్‌కు నారాయణ్ కులం యేమిటో తెలియదు. పరిశ్రమలో చాలామంది చాలా రకాలుగా చెప్పుకుంటారు. అయినా మీ కులం ఏమిటంటూ అతనెప్పుడూ అడగలేదు.

సుధాకర్ పది సంవత్సరాలనుండి నారాయణ్ దగ్గర అసిస్టెంటుగా పనిచేస్తున్నాడు. వారిద్దరి కాంబినేషన్‌లో వచ్చిన చిత్రాలు గొప్పగా విజయవంతం కాకపోయినా లాభాలు గడించాయి. అతడికి పెళ్ళైంది. ఇద్దరు పిల్లలు కూడా వున్నారు.

సుధాకర్ తమ్ముడికి పెరాలిసిస్ స్ట్రోక్ వచ్చింది. ఆ సందర్భంలోనే నారాయణ్ ఎంతో డబ్బు ఖర్చుపెట్టి ఆధునిక వైద్యం చేయించాడు. నారాయణ్‌కు సుధాకర్

కుడిభుజంలాంటివాడు. అన్ని పనులూ అతనే చూసు కుంటాడు. ఎప్పటికయినా సుధాకర్ దర్శకత్వంలో తానే ఓ చిత్రం నిర్మించగలనంటూ నారాయణ్ చెబు తుంటాడు.

ఈ నడుమ కాలంలో నారాయణ్ తీసిన కొన్ని సినిమాలు ఫెయిలయ్యాయి. దాంతో క్రొత్తగా అతనితో చిత్రాలు తియ్యటానికి ఎవరూ ముందుకు రావటంలేదు. అందుకు నారాయణ్ చింతించడు. ఈ పరిశ్రమలోని వాతావరణాన్ని పూర్తిగా జీర్ణించుకున్నాడాయన. పది సినిమాలు పోయినా ఓ సినిమా విజయవంతమయితే నిర్మాతలు ఈగల్లా తమచుట్టూ మూగుతారని నారాయణ్ కు స్పష్టంగా తెలుసు. అందుకే ఈ చిత్రం మీద ఆశలు పెట్టుకున్నాడు.

నిర్మాత కూడా ఖర్చుకు వెనకాడే రకంకాదు. అనేక ఇంగ్లీషు సినిమాలు చూసి వాటిల్లో మంచి దృశ్యాలు ఏరి ఓ కథ అల్లారు. కథ ప్రధానం కాదు ఇలాంటి చిత్రాల్లో. కథనం ఎలా వుంటుందనేదే ప్రధానంగా ఉంటుంది. ఈ చిత్రం విజయవంతం కావటంమీదే అతని భవిష్యత్ ఆధారపడి వుంటుంది. మరే నిర్మాత రాకుంటే స్వయంగా చిత్రనిర్మాణం చేపట్టాల్సి వుంది.

సుధాకర్ థియేటర్ లోకి వెళ్ళిపోయాడు. నారాయణ్ బయటకు చూస్తున్నాడు. గార్డెన్ లో రకరకాల మొక్కలు అందంగా వున్నాయి.

# 4

నారాయణ్ భాగ్యతో పిచ్చాపాటి మాట్లాడు తున్నాడు.

ఫోన్ రింగయింది.

ఫోన్ తీసుకున్నాక "నారాయణ్ గారా" అని వినపడింది.

"అవును."

"ఇంటిదగ్గరే వుంటారా."

"వుంటాను."

"ఏం లేదు. మీతో మాట్లాడాలి బయలుదేరి వస్తున్నా."

"రండి" అంటూ ఫోన్ పెట్టేశాడు.

"ఎవరండి" అంది నారాయణ్ భార్య.

"ప్రొఫెస్సర్ రాజేంద్రగారొస్తున్నారు. యేదో మాట్లాడాలట. ఏ విషయమో మరి."

ఆ మాటలో మాట్లాడుతుండగానే రాజేంద్ర వచ్చాడు.

"రండి..రండి" అంటూ ఆహ్వానించేడు నారాయణ్.

నారాయణ్ భార్య లేచి లోపలకు వెళ్ళింది.

"చెప్పండి ఏమిటి విషయం."

"ఏం లేదు. ఆ నడుము సంబంధం ఒకటి చూడమన్నారు కదా."

"అవును. ఎవరన్నా వున్నారా?"

"ఉన్నాడండి. నాకు తెలిసిన వారిలో ఓ అబ్బాయున్నాడు."

"ఏం చేస్తున్నాడతను."

"గుంటూరులో ఆటోమొబైల్స్ వ్యాపారం వుంది. మొత్తం వారు ముగ్గురన్నదమ్ములు. ఇతను రెండోవాడు. కుటుంబం మంచిది. అంతా మంచి పొజిషన్‌లో వున్నారు. ఈ సంబంధం అయితే అమ్మాయికి బాగుంటుందనిపించింది."

"కుర్రాడెలా వుంటాడు."

"హీరోలా వుంటాడు. కాకుంటే కొంచెం ఎత్తు తక్కువ. అలాగని పొట్టి కాదనుకోండి. రెడ్ చావ్. బాగుంటాడు."

"బాగానే వుంది" అన్నాడు నారాయణ్. "కాఫీనా, కూల్ డ్రింకా" అన్నాడు ఏదో గుర్తొచ్చి.

"ఇప్పుడెందుకండి."

"ఫర్వాలేదు. ఏదో ఒకటి తీసుకోండి."

"కాఫీ" అన్నాడాయన.

నారాయణ్ లేచి వెళ్ళి కాఫీ పంపమని చెప్పి వచ్చాడు. వెంటనే ఫోన్ తీశాడు. నంబర్ డయల్ చేశాడు.

"హలో.... నేను నారాయణ్ మాట్లాడుతున్నా.... అవును. నువ్వు వెంటనే బయలుదేరి రా" అంటూ ఫోన్ పెట్టేశాడు.

"మరయితే ఈ సంబంధం ఓ.కె. అంటారా."

"లక్షణంగా. ఆల్ రైట్. మనం ఎలా ప్రొసీడవ్వాలి" అన్నాడు నారాయణ్.

"ఏముంది మీరు సరేనంటే వాళ్ళొచ్చి అమ్మాయిని చూస్తారు. ఏదో ముహూర్తం చూసి ముడేస్తే సరి" అన్నాడు తేలిగ్గా.

"అలాగని కాదు. ముందు వెళ్ళి మనం మాట్లాడాల్సిన అవసరంలేదా అని."

"ఏముంది. మీ తరపున నేను వెళ్ళి మాట్లాడివస్తాను. అమ్మాయి ఫోటో ఒకటి ఇవ్వండి. వాళ్ళకి చూపిస్తాను. వారికి నచ్చితే మిగతా ఫార్మాలిటీస్ దేముంది?" అన్నాడు రాజేంద్ర.

"అలా బాగుంటుందా. సరే మీ ఇష్టం. ఈ విష యంలో పూర్తి బాధ్యత మీదే. మీరు తెలుసునం టున్నారు కాబట్టి అన్నీ మాట్లాడి మీ చేతు-మీదుగా ఈ శుభ కార్యక్రమం జ రి పిం చం డి" అన్నాడు నారాయణ్.

పనిమనిషి వచ్చి కాఫీలు సర్ది వెళ్ళింది. ఇద్దరూ కాఫీ సిప్ చేస్తూ కూర్చున్నారు.

"అవును మీ సినిమా రిలీజెప్పుడు?"

"అదే ఆలోచిస్తున్నాం. ఫస్టు కాపీ రెడీ అయింది. రెండు పెద్ద సినిమాలు ఈ వారంలో వున్నాయి. అందుకే ఆలోచిస్తున్నాం. ఏమయినా ఈ నెలాఖరులోపు అవు తుంది లెండి."

సుధాకర్ వచ్చాడు.

"రా, రా. గురువుగారు ఓ సంబంధం చూశారు. దాని డిటైల్స్ మాట్లాడుతున్నాం. అది సరేనండి. మీరు వెంటనే గుంటూరు వెళితే బాగుంటుందని నా అభి ప్రాయం."

"ఇప్పుడేనా?"

"ఆలస్యం అమృతం విషం అన్నారు."

"అలాగే. నాకూ వేరే పనులు లేవు."

"సుధా అమ్మాయి ఫోటో ఒకటి మంచిది చూడు. నువ్వు కూడా రాజేంద్ర గారితో వెళ్ళు. గుంటూరులో లాడ్జింగ్ లో దిగండి. అన్ని పనులూ ముగించుకున్నాక ఓ డేట్ ఫిక్స్ చేయండి. ఆ రోజు వారు అమ్మాయిని చూట్టానికో సీ మిగతా విషయాలు మాట్లాడుకోవచ్చు" అన్నాడు నారాయణ్.

రాజేంద్రగారితో సుధాకర్‌ని తన కారులో పంపేక రిలాక్స్ అయ్యాడు ఆయన.

అతని కళ్ళముందు పెళ్ళికూతురిగా విద్య కదలాడుతూంది.

## 5

సుధాకర్ ఏర్పాట్లు చేస్తూ హడావుడిగా వున్నాడు.

నారాయణ్‌కూ ఊపిరాడనంత పని.

ఆ రోజే సినిమా విడుదలయింది.

ఎన్నో ఆశలు పెట్టుకున్న చిత్రం.

ఎన్ని సంవత్సరాలుగానో ఎదురుచూస్తున్న అమ్మాయి పెళ్ళి.

తాంబూలాలు పుచ్చుకునే రోజు.

నారాయణ్‌కు బ్లడ్ ప్రెషర్ వుంది.

ఆయన అసిస్టెంటులు కోపం వచ్చి తిట్టినా అందుకే పట్టించుకోరు.

సాయంకాలం నాలుగు గంటలకు గుంటూరు నుండి వస్తారు.

విద్య మనసు ఏవేవో ఊహల్లో తేలిపోతూంది. దొంగతనంగా ఆ ఫోటో చూడాలనుకుంది. ఎందుకో అది ఇంట్లో వుంచలేదు. తాను చూడగానే భార్యకు చూపించి ఆ తర్వాత ఇచ్చేశాడు. సినిమావారి సంబంధం కాదన్నాక ఆమె వెంటనే అంగీకరించింది. నారాయణ్ భార్య అంతగా విసిగిపోయిందాయనతో.

నారాయణ్ ఇంట్లో లేడు. ఆయనకు సుధాకర్‌కు బాధ్యతలు అప్పగించాక నిశ్చింతగా వుండటం అలవాటు.

ఉదయం ఆట అయ్యాక ఆ చిత్రం భవిష్యత్ ఏమిటో తేలిపోతుంది. ఆంధ్రదేశం నుండి వచ్చే ఫోన్

కాల్స్ కోసం కూర్చున్నాడాయన నిర్మాతల్తో కలిసి.

విద్య సాధారణంగా బయటకు రాదు. ఎప్పుడయినా బయటకు వెళితే తల్లితండ్రుల్తో బయటకు వెళ్ళటం, రావటం కారులోనే. అంత అపురూపంగా పెంచారామెను.

విద్యకు హెయిర్ పిన్ కావాల్సి వచ్చింది.

ఇంట్లో వున్నవి మరీ పాతగా వున్నాయి.

ఆ ఇంటికి కొంచెం దూరంలో ఓ ఫ్యాన్సీ షాపు వుంది. ఇంట్లో నౌకర్లంతా తలో పనిమీద వున్నారు. అమ్మ గదిలో ఏవో పరిశీలించటంలో మునిగిపోయి వుంది. ఆమెకు పిలిచి చెప్పేలోపు షాపుకు వెళ్ళి రావచ్చు.

ఇంటినుండి బయటకు నడిచింది.

ఆమె కాంపౌండు దాటి తలుపుతీసింది.

కొంచెం దూరంలో షాపు కనపడుతూంది.

అటు అడుగులు వేసింది.

సర్రున దూసుకొచ్చిందో కారు.

విద్య అదిరిపడి పక్కకు తప్పుకొంది.

అకస్మాత్తుగా కారు ఆగింది.

తలుపు తెరుచుకోవటం, ఓ వ్యక్తి విద్యను లోపలికి లాక్కోవటం క్షణాల్లో జరిగిపోయింది. కారు ముందుకు దూసుకుపోయింది.

ఆ రోడ్డు నిర్మానుష్యంగా వుందా సమయంలో.

. షాపులోకూడా యెవరూ ఈ దృశ్యాన్ని గమనించలేదు.

విద్య బిగ్గరగా అరవాలని నోరు తెరిచింది.

కళ్ళు మూతలు పడుతున్నాయి....

కళ్ళముందు ఏవేవో వలయాలు....

రంగులు రంగులుగా....

ఆమె తల వాల్చేసింది.

ఊహించని సంఘటన!

# 6

నారాయణ్ కారునుండి దిగి లోపలకు నడిచాడు.

తమ అంచనాలు దెబ్బతిన్నట్టుగానే భావించాలి.

చిత్రంమీద 'ఏవరేజ్' అనే టాక్ వచ్చింది.

మొదటి ఆట అయ్యాక 'ఏవరేజ్' అని టాక్ వస్తే ఆ తర్వాత పరిస్థితి దారుణంగా వుండొచ్చు. ముఖ్యంగా ఈ సినామాలకు మొదట్లోనే టాక్ బాగుండాలి. సాంఘిక చిత్రాలుగాని, కళాత్మక చిత్రాలుగాని మెల్లగా టాక్ పుంజుకొని విజయం సాధిస్తుంటాయి. కాగా మొత్తంమీద ఈ చిత్రంకూడా ఫెయిలయినట్లు లెక్క.

ఇటీవలకాలంలో రెండు సాంఘికాలు, ఓ ప్రేమ కథా చిత్రం అంగీకరించి చేతులు కాల్చుకున్నాడు. ఆ నిర్మాతలు దిక్కులేకుండా పోయారు. ఇంక తిరిగి మార్కెట్ సాధించాలంటే స్వయంగా చిత్రాలు నిర్మించుకోవాల్సిందే. మరో మార్గంలేదు.

"సుధాకర్ వచ్చాడా?" అడిగాడు భార్యను.

"ఇంకా యేవేవో చిన్న వస్తువులు కావాలంటే బజారుకు వెళ్ళాడు."

"అన్ని యేర్పాట్లూ పూర్తయ్యాయా?"

"ఆహాఁ....అమ్మాయికి నగలేం పెట్టాలా అని ఆలోచిస్తున్నా."

"మరీ వున్నవన్నీ దిగేయ్యకు. అందంగా వుండాలంటే ఒకటో రెండో చాలు."

"మరీ ఒకటయితే బాగుండదులెండి. అమ్మాయి చీరలు సెలక్టు చేసుకుంటూంది. నడుమ నేనెందుకని మానేశాను."

"పోనీలే."

"సుధ స్వీట్సుకూడా స్పెషల్‌గా ఆర్డరిచ్చాడట."

"అతనంతా చూస్తాడులే. నాకు తలనొప్పిగా వుంది."

"ఏమయింది. అన్నట్టు సినిమా గురించి యేమనుకుంటున్నారు?"

"ఏదో వీకరేజిగా వుందట."

నారాయణ్ భార్యకు అర్థమైపోయింది.

ఆయన ఆ చిత్రంమీద ఎన్ని ఆశలు పెట్టుకున్నాడో ఆమెకు బాగా తెలుసు!

"మీరు కొంచెంసేపు పడుకోండి. అమృతాంజనం రాయమంటారా?" అందామె.

"నువ్వా పనులు చూడు. కొంచెంసేపు విద్యను పంపించు" అన్నాడు.

ఆమె క్రిందకు వెళ్ళిపోయింది.

పదినిమిషాలు గడిచాయి.

ఆలోచిస్తూన్న నారాయణ్ తలెత్తాడు.

అప్పుడు గుర్తువచ్చింది తను విద్యను పంపమన్న విషయం.

లేచి బయటకు నడిచాడు.

"విద్యా" పిలిచాడు.

నారాయణ్ భార్య పరిగెత్తుకుంటూ వచ్చింది.

ఆమె మొఖంలో ఆందోళన నిండివుంది.

"విద్యేది."

"కనపడటం లేదండి."

"అఁ" అన్నాడు ఒక్కసారిగా.

శరీరంలో రక్తం ఉప్పెనలా ప్రవహిస్తున్నట్టుంది. చేతులు వణుకుతున్నాయి. అమాంతం కూలిపోతానేమో అనుకున్నాడు. నారాయణ్ భార్య అతన్ని జాగ్రత్తగా పొదివి పట్టుకొని మంచందాకా నడిపించుకొనిపోయింది. నారాయణ్ గుండె వేగం హెచ్చింది.

"ఇల్లంతా చూశావా?"

"ఇప్పటిదాకా చూశానండి."

"ఎవరింటికన్నా వెళ్ళిందా?"

"అదెప్పుడయినా బయటకు వెళ్ళిందా? వెళ్ళినా చెప్పకుండా వెళుతుందా?"

"అయితే ఏమయింది?"

"అదే అరంకావటంలేదు."

"ఓ వేళ సుధతో కలిసి షాపింగ్‌కు వెళ్ళిందా?"

"సుధతో ఎందుకు వెళుతుందండి."

"అవును. ఎందుకు వెళుతుంది" అన్నాడు నారాయణ్.

"ఓ వేళ అన్నయ్యతో కలిసి వెళ్ళిందేమో."

అప్పుడే కారు వచ్చి ఆగింది. ప్యాకెట్లు తీసుకొని సుధాకర్ వచ్చాడు. గదిలోకి రాగానే డీలాపడిపోయిన నారాయణ్ కనిపించాడు.

"ఏం సార్ అలా వున్నారు?"

"విద్య కనిపించటంలేదు."

"కనిపించటంలేదా" అన్నాడు కంగారుగా.

"డాడీ" అంటూ లోనకు వచ్చాడు మోహన్.

మోహన్ నారాయణ్ కొడుకు.

"విద్య వచ్చిందా మోహన్."

"విద్య ఇంట్లో లేదా?"

ఆ ఆశకూడా అంతరించటంతో నారాయణ్‌కు బి.పి. రైజ్ అయింది.

మొఖం కందగడ్డలా తయారయింది.

నారాయణ్ భార్య వెంటనే టేబుల్ సొరుగులాగి టాబ్లెట్స్ ఇచ్చింది. వాటిని మ్రింగి నీళ్ళు త్రాగాడు.

సుధాకర్ ఆందోళనగా చూస్తున్నాడు.

"ఇప్పుడేమిటి చెయ్యటం" అన్నాడు నారాయణ్.

"మీకెలా వుంది. డాక్టర్‌కి ఫోన్ చెయ్యమంటారా?"

"నో. ఐయామ్ ఆల్‌రైట్. నేను చావను. ఇప్పుడేమిటి చెయ్యాలి?"

"పోలీస్ రిపోర్టిద్దాం."

"అదిసరే. వాళ్ళు బయలుదేరి వస్తారు కదా. గుంటూరుకు ఫోన్ చేసి చెబితేసరి."

"వాళ్ళీపాటికి బయలుదేరి వుంటారు" అన్నాడు సుధాకర్.

"అయితే ఏం చెయ్యటం?"

"ఓ. పని చేద్దాం సార్. మీకు ఆరోగ్యం బాగోక హాస్పిటల్లో జాయినయ్యారని చెబుదాం. ఆ తర్వాత మరో 'డేట్ ఫిక్స్ చేసుకుందాం."

"అలా చేద్దామంటావా?"

"ఓ. క. రాజేంద్రగారికి ఫోన్ చేసి ఇటివ్వు" అన్నాడు వెంటనే.

సుధాకర్ వెంటనే ఆ పనిచేశాడు.

"అవును. నేనే మాట్లాడుతున్నా. అమ్మాయి కనిపించటంలేదు. అదే ఆలోచిస్తున్నా. నేను ఆసుపత్రిలో చేరానని చెప్పండి. వాళ్ళకి అనుమానం రాకూడదు. వెంటనే పోలీస్ రిపోర్టిస్తున్నా. స్వయంగా వెళ్ళి

సి ఎమ్.గార్ని కలుస్తాను. త్వరలోనే మరో తేదీ ఫిక్స్ చేద్దాం. అంతా మీ చేతుల్లో వుంది. జాగ్రత్తగా హాండిల్ చెయ్యాలి. అర్థమయ్యింది కదా. వస్తి వుంటాను. అలాగే" అంటూ ఫోన్ పెట్టేశాడు.

"కమాన్. మనం రిపోర్టివ్వాలి" అంటూ లేచాడు.

"మీరు కంగారు పడకండి" అందామె ఆందోళనగా.

"నాకేం కాదు. సుధా మనం వెంటనే సి. ఎమ్.ని కలుస్తున్నాం."

"అలాగే సర్."

"ఈ లోపు ఈ వార్తను మీరు బయటకు పొక్క నియ్యకండి."

"అలాగే" అన్నారు భార్య, మోహన్.

"పనివాళ్ళకికూడా తెలియకూడదు."

"అలాగే."

చకచక డ్రస్ మార్చుకున్నాడు. వేగంగా బయటకు నడిచాడు. సుధాకర్‌ను నారాయణ్ భార్య కళ్ళతో హెచ్చరించింది.

తలూపుతూ అనుసరించాడు సుధాకర్.

ఆమెకు కూతురు విషయంకన్నా భర్త ఆరోగ్య విషయమే ఆందోళన కలిగించుతూంది.

నారాయణ్ కారు సి. ఎమ్. ఇంటివైపు దూసుకె ళ్తూంది.

# 7

సి.ఎమ్.గారు రాజకీయాల్లోకి రాకముందు ప్రముఖ సినిమా హీరో. ఆయనెక్కువగా వీరోచిత కార్య క్రమాలు నిర్వహించే నాయకుడి పాత్రలనే పోషించే వాడు. క్రైమ్ సినిమాల్లో నటించినా దేశభక్తి గురించి

అనర్గళంగా ఆయన ఉపన్యాసం, ఓ పాటయినా వుండేవి. అందుకే సామాన్య ప్రజానీకంలో ఆయనపట్ల విపరీతమైన అభిమానం వుంది.

ఆ అభిమానమే రాజకీయాల్లో తలలు పండిన వారిని కాకుండా ఆయన్ని రాష్ట్రాధినేతగా చేసింది.

నటుడుగా వున్నప్పుడు ఆయన నారాయణ్ దర్శకత్వంలో ఓ చిత్రంలో నటించాడు.

ఆ పరిచయాన్ని ముఖ్యమంత్రి అయ్యాక కూడా ఆయన మరిచిపోలేదు.

సినిమా రంగానికి చెందిన అనేక ఫంక్షన్స్‌లో కలిసినప్పుడు ముఖ్యమంత్రిగారే స్వయంగా పలకరించి కుశల ప్రశ్నలు అడుగుతుండటం జరుగుతూంది. అయినా సరే నారాయణ్ ఏనాడూ ఆప్యాయతను వినియోగించుకునే ప్రయత్నం చెయ్యలేదు.

నారాయణ్ విజిటింగ్ కార్డు పంపాక వెంటనే ప్రవేశం లభించింది. ముఖ్యమంత్రికి ఇటీవల కాలంలో ఆరోగ్యం బాగుండటంలేదు. అందుకే ఇప్పుడు లభించారు. ఈ సమయంలో అరుదుగానే ఆయన వ్యక్తుల్ని కలుసుకుంటున్నారు.

"ఏమిటి నారాయణ్‌గారూ.... యేదో విశేషంలేందే మీరు రారుకదా" అన్నాడాయన సరదాగా.

అప్పటికి ఆయన నారాయణ్ ముఖంలో విషాద రేఖల్ని గమనించలేదు.

"మా అమ్మాయి కన్పించటంలేదు" అన్నాడు మాటలు పెగుల్చుకొని.

సి.ఎమ్. నిటారుగా అయ్యాడు....

"సరిగ్గా చెప్పండి. ఏమిటి మీరనుకోవటం?"

"ఈ రోజు అమ్మాయికి పెళ్ళిచూపులు. తాంబూలాలు తీసుకోవాలనుకుంటున్నాం. అందరం ఆ పనుల్లో వున్నాం. తీరాచూస్తే అమ్మాయి కనిపించటంలేదు."

"ఏం జరిగుంటుందనుకొంటున్నారు?"

"ఎవరో తీసుకెళ్ళి వుంటారు."

"ఇంటినుండి బలవంతంగా తీసుకెళ్ళారంటారా?"

"ఏమో తెలియదు. ఎవరి గదుల్లో వారు పని చేసుకుంటున్నారు. అమ్మాయి గదిలో వుందనుకున్నాం. అందుకే అమ్మాయి ఎలా మాయం అయిందో అర్థం కావటంలేదు."

సి.ఎమ్. కొంతసేపు ఆలోచించాడు.

"మరోలా భావించకండి. అమ్మాయికి పెళ్ళి ఇష్టం లేదా?"

"అదేం లేదు. వుంటే అమ్మాయికి ఈ విషయం నాకు చెప్పే చనువుంది. ముఖ్యంగా విద్య అమ్మచాటు బిడ్డ. మాతో తప్పించి కనీసం బయటకు వెళ్ళదుకూడా."

"ఓ విషయం నారాయణ్. పిల్లలకెలాంటి భావాలు లేవనుకోవటం సరయింది కాదు. మీతో ఎంత చనువుగా వున్నా వాళ్ళు అనేక భావాల్ని భయం వల్లనో, సిగ్గు వల్లనో దాచుకోవచ్చు. మన కార్యకలాపాల ప్రభావం కూడా పిల్లలమీద అదృశ్యంగా పడుతుంటుంది. మరీ తల్లిచాటు బిడ్డగా పెంచటం మంచిది కాదు. ఇప్పుడు తల్లిచాటు బిడ్డ. రేపు భర్తచాటు బిడ్డ. ఆ తర్వాత బిడ్డలచాటు బిడ్డయితే ఆమె ఇండివిడ్యువాలిటీ ఎక్కడ? ఎప్పుడు బిల్డప్ చేసుకుంటుంది" అన్నాడాయన.

నారాయణ్ తలవంచుకున్నాడు.

"మీరేదో బాధతో వస్తే విసిగిస్తున్నానని భావించ

కండి. సో....మీ నమ్మకం ప్రకారం అమ్మాయిని ఎవరో అపహరించారనుకుందాం. ఎక్కువగా డబ్బుకోసం ఇలాంటి పనులు చేస్తారు. అందుకే జరిగుంటే వాళ్ళు మీకు సమాచారం పంపిస్తారు. ఈలోపు మనం సెర్చ్ కార్యక్రమం మొదలు పెడదాం" అంటూనే బజర్ నొక్కాడు.

సేవకుడు ప్రవేశించాడు.

"సెక్రటరీని పిలువ్."

సెక్రటరీ వచ్చాడు.

"నారాయణ్ గారి అమ్మాయిని ఎవరో తీసుకువెళ్లారు. మాకు ఏక్షన్ కావాలి. వెంటనే ఆ అమ్మాయిని ట్రేస్ చెయ్యండి. మరో విషయం. ఈ సంగతి సీక్రెట్ గా వుంచండి. వెంటనే అధికారుల్ని సంప్రదించండి. క్విక్."

అతను తలూపి వెళ్ళిపోయాడు.

సి.ఎమ్. తిరిగి బజర్ నొక్కాడు.

"ఏపిల్ జ్యూస్" చెప్పాడు సేవకుడితో.

ఏపిల్ జ్యూస్ వచ్చింది.

అంతా సిప్ చేస్తున్నారు.

"మీరేం బాధపడకండి. వెంటనే ఆ విషయంలో ఏక్షన్ తీసుకుంటారు. మీకు యెలాంటి సమాచారం అందినా తెలియచేయండి" అన్నాడు సి.ఎమ్.

"మరి మేం వెళ్ళొస్తాం" అన్నాడు నారాయణ్.

"మంచిది" అంటూ లేచాడాయన.

ఆయన చూపించిన గౌరవ, మర్యాదలకు ఉద్వేగంతో నారాయణ్ కళ్ళు చెమ్మగిల్లాయి. ఆకళ్ళలో కనిపించిన భావాన్ని ఆయన మరోవిధంగా అర్థం చేసుకున్నాడు.

"ఐ విల్ ట్రై మై లెవల్ బెస్టు మిస్టర్ నారాయణ్"
అంటూ మరోసారి ఆప్యాయంగా భుజం తట్టాడు.

# 8

నిమిషాలమీద సి. ఎస్. గారి ప్రభావం కనపడింది. నారాయణ్ వెళ్ళిన పది నిమిషాలకల్లా ఇన్వెస్టిగేషన్ డిపార్ట్‌మెంట్‌కు చెందిన ప్రముఖులు వచ్చారు.

నారాయణ్ ఇంటిలో పనివారందరినీ పిలిచి ప్రశ్నించారు.

చివరగా నారాయణ్ దగ్గరకొచ్చారు.

"ముందు మనం అమ్మాయి అపహరించబడ్డ 'టైం' తెలుసుకోగలిగితే ప్రొసీడ్ కావటానికి అవకాశం వుంటుంది."

"ఏం కావాలో అడగండి" అన్నాడు నారాయణ్.

"మీ అమ్మాయి తప్పిపోయిందని మీకెప్పుడు తెలుసు కున్నారు?"

"నేను పన్నెండున్నర ...ఆ ప్రాంతంలో వచ్చాను. రాగానే నా మిసెస్‌తో మాట్లాడి తలనొప్పిగా వుందని పించి అమ్మాయిని పైకి పంపించమని ఆవిడతో చెప్పాను. ఆ తర్వాత పదినిమిషాలకు అమ్మాయి తప్పిపోయిందని తెలి సింది."

"అంతకుముందు చివరిసారిగా అమ్మాయిని ఎప్పుడు చూసుంటారు."

"ఉదయాన్నే చూశాను. ఎనిమిది గంటలకల్లా నేను వెళ్ళిపోయాను. అదే ఆఖరుగా చూడటం."

"మీరు చివరిసారిగా ఎప్పుడు చూశారు" నారాయణ్ భార్యను ప్రశ్నించారు.

"అంతకుముందు గంట క్రితం చూశాను. అయితే టైం

నాకు గుర్తులేదు. అమ్మాయి తన గదిలో చీరలు సెలక్ట్ చేసుకుంటూంది. నేను నా గదిలో పనిచూసుకుంటు న్నాను."

"మొత్తంమీద ఓ గంట గంటన్నర మీ అమ్మాయిని కలవలేదు. అంతేనా?"

"అంతేనండి."

"కాబట్టి పదకొండు గంటలనుండి యెప్పుడయినా ఆమెను అపహరించటానికి అవకాశాలున్నాయన్నమాట. మీ అమ్మాయి బయటకు వెళ్ళే అవకాశాలున్నాయా?"

"లేదు. ఆ అవసరం ఎలాంటి పరిస్థితిల్లోనూ వుండదు."

"ఏదయినా అవసరంవచ్చి, షాపింగ్ కుగాని...."

"లేదు. ఏం కావాలన్నా పనివాళ్ళున్నారు."

"మీకు ఇంటి ముందు ఘూర్ఖా వున్నాడా."

"లేదు."

"బయట లాన్ లోకి వెళుతుందా?"

"వెళ్ళవచ్చు."

"మా ఉద్దేశ్యం బయట తిరుగుతున్నప్పుడు రోడ్డుమీద ఏమయినా జరిగితే ఆమె వెళ్ళటానికి అవకాశం వుంటుంది కదాని"

ఎవరూ మాట్లాడలేదు.

"మీ కెవరిమీదయినా అనుమానముందా?"

"లేదు" అన్నాడు నారాయణ్.

"మీకు శత్రువులెవరైనా...."

"నాకు తెలిసినంతలో లేరు. తెలియకుండా ఎవరైనా వున్నారేమో."

"కొంచెం బయటకొస్తారా" అన్నారు.

నారాయణ్ బయటికెళ్ళాడు.

"సుధాకర్ మీద మీ అభిప్రాయం ఏమిటి?"

"అతను నా కుడి భుజం. నా ప్రాణం. మీరు అతన్ని శంకించాల్సిన పనిలేదు."

"అది మా డ్యూటీ....మరలా కలుస్తాం. ఏమయినా కబురందితే వెంటనే తెలియచెయ్యండి."

"తప్పకుండా."

"మేం వస్తాం."

వాళ్ళు వెళ్ళిపోయారు.

నారాయణ్ ఇంటికి కొంచెం దూరంలో వున్న షాపు దగ్గరకు వెళ్ళారు. వారికి తమ ఐడెంటీ కార్డు చూపించాక షాపు ఓనర్ వణుకుతూ అన్నాడు "ఏం కావాలి సర్."

"కొంచెం ఇన్ఫర్మేషన్ కావాలి. కొంచెం బయట కొస్తారా."

"అలాగే" అంటూ ప్రక్కనున్నతనికి కొట్టు అప్పగించి కంగారుగా వచ్చాడు. కొన్ని స్మగుల్డు గూడ్స్ ఆ షాపులో వున్నాయి. అందుకే అంత కంగారు.

"ఏమిటి సార్" అన్నాడతను.

"పదకొండు గంటలనుండి ఈ వీధిలో ఏమైనా గలాభా జరిగిందా?"

"ఏం లేదండి."

"ఐ మీన్ ఏక్సిడెంట్లులాంటివి."

"అబ్బే లేదండి."

"ఎవరయినా అమ్మాయి ఒంటరిగాగాని, జంటగా గాని నడిచి వెళ్ళిందా?"

"ఏమోనండి. ఎవరెవరో అమ్మాయిలు వెళుతుంటారు. ఏ అమ్మాయని చెప్పమంటారు?"

"పోనీ పదకొండు గంటల తర్వాత కార్లు వెళ్ళటం

గాని, అందులోనుండి యెవరైనా అరవటంగానీ విన పడిందా?"

"కార్లు చాలా వెళుతుంటాయండి. అరవటం మాత్రం జరగలేదు. అలా అయితే మేం వెంటనే పోలీస్ కంట్రోల్ రూంకు ఫోన్ చేస్తాం" అన్నాడతను.

"గుడ్."

"ఎందుకు సార్ ఇదంతా."

"ఓ కేసు విషయంలో ఇన్ఫర్మేషన్ కావాల్సి."

"మర్డర్ కేసా?"

"కాదు. కిడ్నాపింగ్ కేసు."

వాళ్ళు ఓ ఫోటోతీసి చూపించారు.

"ఈ అమ్మాయిని మీరు ఇవాళ చూసినట్లు గుర్తుపట్ట గలరా?"

పరీక్షగా చూశాడు ఫోటోవంక. ఎక్కడో చూసి నట్లుంది.

"లేదండి."

"ఈ మెప్పుడైనా మీ షాపుకు వచ్చిందా?"

"లేదండి. కానీ ఆమెను ఎక్కడో చూసినట్లు గుర్తు."

"థాంక్యూ....పదకొండు గంటల తర్వాత ఈ వీధిలో యేమైనా జరిగిందని యెవరైనా అనుకుంటుంటే ఈ నెంబర్కు తెలియచెయ్యండి" అంటూ ఓ విజిటింగ్ కార్డు అందించారు.

"తప్పకుండా సార్" అన్నాడతను వినయంగా.

## 9

నారాయణ్ ముందు పెద్ద బాటిల్ వుంది.

అప్పటికి రెండువంతులు ఖాళీ అయింది.

"సుధా నేనెవరికైనా అన్యాయం చేశానా?"

"ఆదేంమాట సార్" అన్నాడు సుధాకర్.

"మరెందుకిలా అయింది. నా విద్యకి ఘనంగా పెళ్ళి చేసి పంపించాలనుకున్నాను. అసలది బ్రతికుందంటావా?"

"అలా మాట్లాడకండి. పోలీసులు తీవ్రంగా ప్రయత్నం చేస్తున్నారు?"

"ఏం ప్రయత్నం చెయ్యటం. రెండురోజులయింది. రేపెప్పుడో ఫోన్ వస్తుంది ఏ కాలవలోనో, సముద్రవు ఒడ్డునో ఓ అమ్మాయి శవం దొరికింది గుర్తించటానికి రమ్మంటూ, అంతేగా. నా కూతురి పండంటి జీవితం నాశనం చేశారు. లేకపోతే యెందుకు తీసుకెళ్ళటం.... డబ్బు కావాలా....రమ్మను.... నాకున్నదంతా పారేస్తాను. నా బిడ్డను నాకు పంపించమను. నా కూతురు నాకు కావాలి" నారాయణి గొంతు వణికింది.

"మీరు భయపడకండి. అమ్మాయికి ప్రమాదం జరగదు. నాకు నమ్మకం వుంది."

"అంతే నంటావా....సుధా మన సినిమాల్లో చూపిస్తున్నట్లు అమ్మాయిని యెవరైనా తీసుకెళ్ళి అమ్మేస్తారేమో. ఆడపిల్లల్ని ఎత్తుకుపోయి వ్యభిచార గృహాల్లో అమ్ముతుంటున్న ముఠాలకు విద్య దొరికితే దాని గతేమిటి?"

"అలా జరగదు. ఏవేవో ఊహించకండి."

"మరెలా జరుగుతుందయ్యా..అదెవరినన్నా ప్రేమించి వెళ్ళిపోయిందా? అలా అయితే విద్య నాకెందుకు చెప్పలేదు. దానిమాట నేను కాదన్నానా? ఆదేరోజయినా బయటకు వెళ్ళిందా? ఎవరన్నా దానికి తెలుసా? మరెప్పుడు ప్రేమించింది? ఎలా వెళ్ళిపోయింది? నా విద్య యేమయింది....యేమయింది చెప్పు?"

"ప్లీజ్ మీరు ఆవేశపడకండి. మీరు రెస్టు తీసుకోండి."

"ఇంకేం విశ్రాంతి. నా విద్య నాకు లేకుండా పోయాక ఇంకా నాకు విశ్రాం తెందుకు? సుధాకర్ నాకు విద్య కావాలి....విద్య కావాలి" నారాయణ్ బిగ్గరగా ఏడుస్తున్నాడు.

అతని కళ్ళవెంట కారుతుంది గ్లిసరిన్ కన్నీరుకాదు. గుండె లోతులనుండి పొరలివస్తున్న దుఃఖం.

"నా విద్య చచ్చిపోకూడదు. ఈ సమాజంలో ఆడదానికి రక్షణలేదు. ఎవడికీ దిక్కులేదు. ఎప్పుడేమవుతుందో తెలియదు నా కూతుర్ని ఏం చేస్తున్నారో.... అమ్మా విద్యా....ఎక్కడున్నావమ్మా...."

ఉద్వేగంతో కదిలిపోయిన నా రా య ణ్ చెయ్యి విసురుగా బాటిల్‌కి తగిలింది.

దూరంగా పడి భళ్ళున బ్రద్దలయింది.

గదంతా గాజు పెంకులు—నారాయణ్ హృదయంలా.

మత్తెక్కించే వాసన—నారాయణ్ చిత్రాల్లా....

చల్లటి ఆ గది నాలుగుమూలలా పరుచుకుంటున్నాయి నారాయణ్ ఏడుపు తాలూకు ధ్వని తరంగాలు!

## 10

ఫోన్ మ్రోగింది.

నారాయణ్ భార్య అందుకొంది.

"హలో, ఎవరు మాట్లాడుతుంది?"

"నారాయణ్ గారున్నారా?"

"ఉన్నారు ఎవరు మీరు?"

"ఆయనతో మాట్లాడాలి. ముందాయనకు ఫోని

వ్వండి."

ఆదేశించా రవతలనుండి.

ఆమెకు కోపం వచ్చినా తమాయించుకొంది. ఫోన్ నారాయణ్ కందించింది మౌనంగా.

"హలో నారాయణ్ మాట్లాడుతున్నా....ఎవరు?"

నిశ్శబ్దం....

"మీ అమ్మాయి గురించి మాట్లాడాలని."

"ఎవరు మీరు?....మా అమ్మాయి కనిపించిందా?"

"మేం ఎవరో తర్వాత తెలుస్తుంది. మా ఫోన్ నెంబర్ కనుక్కునే శ్రమ తీసుకోకండి."

"మీ రెవరు? యేం కావాలి మీకు?" అరిచాడు నారాయణ్.

"మాకేం వద్దు. మేం డబ్బులుకోసం ఫోన్ చెయ్యటం లేదు."

"మరేమిటి!"

'మీ అమ్మాయికి పెళ్ళి చెయ్యబోతున్నాం."

"వాట్ నాన్సెన్స్! పెళ్ళి చెయ్యటమేమిటి? ఏమిటీ డ్రామా?"

"అరవకండి. మీకు మెల్లగా మాట్లాడితే వినబడుతుంది. ఊరికే ఆవేశపడితే బి.పి. రైజ్ అవగలదు. మీ ఆరోగ్యాని కదంత మంచిది కాదు. మరో అర గంటలో విద్య పెళ్ళి చెయ్యబోతున్నాం."

"మీరు చెబుతుందంతా అబద్ధం. మా విద్య మీ దగ్గర లేదు."

అవతల నుండి తిరిగి నిశ్శబ్దం.

"ఎవరు మీరు? నన్నెందుకు తీసుకొచ్చారు?" విద్య కంగారుగా ప్రశ్నిస్తోంది.

"విద్యా!" అరిచాడు నారాయణ్.

"అరవొద్దని చెప్పాగా. మీ అమ్మాయి కంఠం టేప్ చేశాం. ఇప్పుడు మీరు విద్య మా దగ్గరుందని నమ్ముతా రనుకుంటున్నాం. మీరేం దిగులుపడకండి! ఎవరో గుంటూరు వారికిచ్చి అమ్మాయిని దూరంగా పంపించట మెందుకు? అక్కడాగా మీ కళ్ళముందుంటే సంబంధం చేస్తాం."

"ఇది అన్యాయం. నే నంగీకరించను."

"మంచిది. సంతోషం."

"ఇది అబద్ధమని చెప్పండి."

"లాభంలేదు. ఇది నిజం. టైం నోట్ చేసుకోండి. సరిగ్గా అరగంట తర్వాత మీ అమ్మాయి మెడలో మూడు ముళ్ళు పడతాయి. ప్రళయంవచ్చినా అది జరిగి తీరుతుంది."

"మా విద్య ఒప్పుకుంటాదా?"

"ఒప్పుకుంటుంది."

"మీ కెంత కావాలో అంతిస్తాను. నా బిడ్డ గొంతు కొయ్యకండి."

"మేం మీ అమ్మాయి గొంతూ, మీ గొంతూ కొయ్యటంలేదు. అదిమాత్రం నిజం."

నారాయణ్ కు ఏం చేయాలో అర్థం కావటం లేదు.

"ఏమంటున్నారండి?" అంది నారాయణ్ భార్య ఏడుస్తూ.

సరిగ్గా అరగంట తర్వాత....

తనను ఎదుటినుండి నిలదీస్తున్నారు.

ఎంతటి నిస్సహాయ పరిస్థితి....

"ఏమిటి మాట్లాడరు. పోలీసులకిలా ఈ విషయం

తెలియ చెయ్యాలనా? ఆ పిచ్చిపని చెయ్యకండి. మీకే ప్రమాదం. విద్య శవం చెక్కపెట్టెలో వస్తే మీరు భరించగలరా? మరో సంగతి.... ఈ పోలీసు రిపోర్టులు ఎందుకు? వెంటనే విత్ డ్రా చేసుకోండి. అరగంట తర్వాత చుట్టరికం యేర్పడుతుంటే యింకా కేసు లేమిటి?

"పెళ్ళయ్యాక యేంచేస్తారో మీకు తెలుసు.... మూడు రోజులు యిద్దరూ హానీమూన్ వెళతారు. మూడు రోజులు పూర్తయ్యాక....విద్య స్వయంగా మీ ఇంటికి వస్తుంది. అప్పటిదాకా ఉద్రేకపడి ప్రయోజనం లేదు. ఇంత జరిగాక ఆశీర్వదిస్తారని మాకు తెలుసు" అవతల చెప్పుకు పోతున్నారెవరో.

నారాయణ్ కు నిస్సత్తువ ఆవహించింది.

అతని నోటివెంట మాటలు రావటంలేదు.

అతని కర్థమవుతుందల్లా తన బిడ్డ భవిష్యత్ నాశనమవుతుందనే.

తన విద్య మెడలో ఉరిత్రాడు!

"మరలా వీలయితే మాట్లాడుతాం."

"ఈ పెళ్ళి ఆగదా?"

"ఆగదు."

నారాయణ్ ఫోన్ పెట్టేయబోయాడు.

"ఎందుకో తెలుసా?" వినపడింది.

"ఎందుకు?"

"మేం మీరూహించనంతదూరంలో మరో రాష్ట్రంలో ఉన్నాం కాబట్టి"

అవతల ఫోన్ డిస్కనెక్ట్ అయింది.

ఫోన్లో భర్త మాటల్నిబట్టి ఆమె కొంత అర్థం

చేసుకొంది.

"ఏమిటండి ఇది!"

"విద్య పెళ్ళి చేస్తున్నారట."

"ఎక్కడినుండి మాట్లాడింది?"

"ఏమో తెలియదు. ఇక్కడమాత్రం కాదు. అందుకే ఇంత సేపు మాట్లాడారు. పోలీసులు ఎంత ప్రయత్నించినా దొరకంది కూడా అందుకే."

"ఇప్పుడేమిటి చెయ్యటం?"

"ఏం చేస్తాం—భగవంతు దేవరన్నా ప్రత్యక్షం కావాలి. ఆయన మాత్రమే ఈ పెళ్ళి జరక్కుండా ఆపు చెయ్యగలడు. అది సాధ్యం అయ్యే పనికాదు."

"అమ్మాయిని యేమీ చెయ్యరు కదా?"

"ఏమీ చెయ్యరు. పెళ్ళి చేస్తారు. శోభనం చేస్తారు."

"అమ్మాయి ఎదురుతిరిగితే చంపుతారేమోనండి" అందామె యేడుస్తూ.

నారాయణ్ కు యేం చెప్పి ఓదార్చాలో తెలియ లేదు.

"మూడురోజుల తర్వాత పంపుతారట."

"అంటే అంతా జరిగాక యేమీ చెయ్యరని వాళ్ళ ఉద్దేశ్యమా?"

"అంతే కదా. పెళ్ళి జరుగుతుంది. ఫోటోలు తీస్తారు. లేకుంటే బెదిరిస్తారు అంతేగా. మూడు రోజుల తర్వాత విద్యని పంపిస్తారట. వెధవలకు ఓ విషయం తెలి యదు. అమ్మాయి రాగానే ఆ పెళ్ళిని అంగీకరిస్తా నను కుంటున్నారు. విద్య రాగానే ఎవరిలా చేశారో తెలుసు కొని వారందరినీ అరెస్టు చేయిస్తాను. ఆ ఫోటోలు....

పెళ్ళి తాలూకు గుర్తులన్నీ ధ్వంసం చేయిస్తాను. అమ్మాయికి తిరిగి పెళ్ళిచేస్తాను ఘనంగా. ఏమను కున్నారో" అన్నాడు నారాయణ్ వణుకుతూ.

నారాయణ్ భార్య దీనంగా యేడుస్తూంది.

తల్లిగా ఆమె యీ సంఘటనను భరించలేక పోతూంది.

నారాయణ్ దవడ కండరాలు బిగుసుకుంటున్నాయి.

అతను ప్రయత్నంమీద దుఃఖం ఆపుకున్నాడు.

వాచీకేసి చూసుకున్నాడు.

సరిగ్గా ఇరవై అయిదు నిముషాలు!

విద్య మెడలో ఊరిత్రాడు....

ఆ తర్వాత....

ఆమె జీవితంమీదే మాయని మచ్చ!

నారాయణ్ చాలా సినిమాల్లో తీశాడు.

పెళ్ళి కాకముందే కన్నెపిల్లల శీలాన్ని బలిగొనే రేప్ దృశ్యాలు—

దారుణంగా—బాక్సాఫీస్ కోసం.

అతని కళ్ళముందు సినిమా రీళ్ళు.

అతని కళ్ళముందే జీవితం.

సినిమా జీవితం....జీవితపు సినిమా.

ఎక్కడో మంగళ వాయిద్యాల ఘోష....

వేదమంత్రాల హోరు....

పన్నీటి జల్లులా కంటి నుండి రాలుతున్న కన్నీటి బొట్లు!

## 11

మూడు రోజులు....

ప్రతి క్షణం ఓ యుగం—

టెంక్షన్ ....సంఘర్షణ....ఆవేదన....

దుఃఖపు సెగలు....

ఏదో చెయ్యాలని ఆరాటం....

ఏమీ చెయ్యలేని అశక్తత....

గంటలు గడుస్తున్నాయి....

పదకొండు గంటలు!

గోడ గడియారం ధ్వనిస్తూంది.

రోడ్డుమీద కారాగిన చప్పుడు.

తలుపు తెరుచుకొని విద్య నడిచొస్తూంది.

ఆ కళ్ళలో యేదో వింత మెరుపు.

ఆ నడకలో యేదో మార్పు.

నారాయణ్ గుండెలు వేగంగా కొట్టుకొంటున్నాయి.

ఎన్నెన్నో అడగాలనుకొన్న నోరు పడిపోయింది.

విద్య నడిచివస్తూంది!

తండ్రి ముందు తల వంచుకొని యింటిలోకి వెళ్ళిపోయింది.

కళ్ళ వెంట నీళ్ళతో నారాయణ్ యాంత్రికంగా వెనక్కు తిరిగాడు.

"అమ్మా విద్యా!" కౌగలించుకొని బావురుమంది విద్య తల్లి.

ఆమె కన్నీళ్ళు విద్యను తడుపుతున్నాయి.

ఆమె యేడుపును తొక్కిపట్టి ఉంచిన కారణంగా ఒక్కసారిగా బ్రద్దలై ....

"ఏమ్మా....యేమయింది?" అంటూ ఆగిపోయింది.

విద్య మెడలో మంగళసూత్రం!

"విద్యా....ఆ మంగళసూత్రం తీసేయ్" అరిచాడు

నారాయణ్.

విద్య తండ్రివంక జాలిగా చూసింది.

"నాన్నా! ఇదంతా చేసిందెవరో కాదు...."

నారాయణ్ మొహంలో మారుతున్న రంగులు.

"మీ కుడిభుజం సుధాకర్."

"సు....ధా....క....రా" అన్నాడు దిగ్భ్రాంతితో.

అతని జీవితంలో మరో షాక్.

"అవును. సుధాకరే. అతని పథకం అమలు చేశారు. అతని తమ్ముడికే నన్ను కట్టారు."

"నమ్మకద్రోహం" అరిచాడు నారాయణ్.

"డాడీ! .... నమ్మకద్రోహం సినిమాలకే పరిమితమా?"

"కాదమ్మా కాదు....జీవితంలోనే వుంది" నారాయణ్ తట్టుకోలేకపోతున్నాడు.

"వాడ్ని కాల్చేస్తాను. వాడి తమ్ముడ్ని కాల్చేస్తాను. వాడికి పెరాలసిస్ వచ్చినందుకు వైద్యం చేయించినందుకు నాకు శిక్షా? ...ఛీ ...ఛీ....ఇలాంటివాళ్ళు పుట్టకూడదు, బ్రతకకూడదు" అరుస్తున్నాడు నారాయణ్.

"డాడీ! మీరు ఆవేశపడకండి. మీరు కాలుస్తానంటున్నది యెవరోన్నో కాదు. నా భర్తనే...." అంది విద్య.

"వాడు భర్తా....కాదు లోఫర్ ....ఛీటింగ్ నేరం క్రింద వాడ్ని ఎంత చేయాలో అంత చేస్తాను."

"అతను తాళి కట్టిన భర్త మాత్రమే కాదు. నన్ను అన్నివిధాలా స్వంతం చేసుకున్న మనిషి" అంది విద్య....

"అదో పీడ కల తల్లీ."

"కాదు, నా స్వర్తం. ఈ నా స్వర్తం వరిచిపోకటం నాకు చేతకాదు. దయచేసి క్షమించండి. నా మెడలో మూడు ముళ్ళు వేసినవాడే నా భర్త. మంచిగాని చెడు గాని అతనితోనే నా జీవితం."

"వి....ద్యా...." గుడ్లప్పగించి చూస్తూ అన్నాడు.

నారాయణ్ జీవితంలో అది 'షాక్'ల దినం.

"అవును డాడీ! సెంటిమెంట్లు కూడా సినిమాలకే పరిమితం కాదు. జీవితంలో కూడా ఉంటాయి. మీరు తీస్తున్న సినిమాల్లో ఉండటంలా? అలానే.... మీరు మమ్మల్ని ఆశీర్వదించండి."

"అవును సార్. ఆశీర్వదించండి."

గుమ్మంలో సుధాకర్.

"ఇదంతా మీ అందరి కుట్ర" నారాయణ్ అరుస్తున్నాడు.

నారాయణ్ భార్య అప్పటికే ఓ నిర్ణయానికొచ్చింది. గిరుక్కున వెనక్కి తిరిగింది.

"మన అనుబంధం శాశ్వతం కావాలని ఈ సాహసం చేశాను. క్షమించండి" సుధాకర్ అంటున్నాడు.

"నా సినిమాలు చూసి ఒకరయినా సాహసాలకు పూనుకుంటే గర్విస్తా."

నారాయణ్ కు తన మాటలు గుర్తొచ్చాయి.

"విద్యా లోపలకురామ్మా" అంది తల్లి నుదుట బొట్టు పెట్టి.

నారాయణ్ దిగ్భ్రాంతి నుండి తేరుకోలేదు.

అతని కళ్ళముందే విద్య చేతిని అందుకుంటున్నాడు సుధాకర్ తమ్ముడు.

—: అయిపోయింది: —

# దాగని నేరం

## టెంపోరావ్

పెళ్ళి వైభవంగా జరిగింది. మామయ్య యింట్లో సాగర్ మూడు రోజులు సుఖంగా గడిపాడు.

తర్వాత సాగర్ తన భార్యతో హనీమూన్‌కి కాశ్మీర్ వెళ్ళాడు. కాశ్మీర్ వరకూ వెళ్ళడం అతడికి యిష్టంలేదు. కాని మామయ్య మరీ మరీ కోరడం వలన వెళ్ళక తప్ప లేదు.

"సాగర్, రమ నా ఒక్కగా నొక్క కూతురు. నా ఆస్తంతా ఆమెకే వెళ్తుంది. మీ కాశ్మీర్ ట్రిప్‌కు పదివేలు నేను కేటాయించి వుంచాను. నువ్వు తప్పక ఆమెతో కాశ్మీర్ వెళ్ళాలి" అన్నాడు మామయ్య వెంకట్రామయ్య.

కాశ్మీర్ వెళ్ళి సాగర్ పదిహేనురోజుల్లో తిరిగి వచ్చాడు.

"మేం మీతో వచ్చి కొత్త కాపురం పెట్టిస్తాం" అన్నాడు వెంకట్రామయ్య.

"చాలా సంతోషం" అన్నాడు సాగర్.

వెంకట్రామయ్య హైకోర్టు జడ్జిగా పనిచేసి రిటైరయ్యాడు. చాలాకాలంపాటు అతడికి పిల్లలులేరు. అతడి వయస్సు నలభైఐదు దాటాక రమ పుట్టింది. దైవం తన వంశాన్ని నిలబెట్టినందుకు అతడు చాలా సంతోషించాడు. అల్లారుముద్దుగా పెరిగింది రమ.

రమ గాఢంగా సాగర్‌ని ప్రేమించింది. అతడు మద్రాసులో చెట్టినాడు సిమెంట్ కంపెనీలో యింజనీరుగా పనిచేస్తున్నట్లు ఆమెతో చెప్పాడు. కంపెనీ పనిమీద విజయవాడ వచ్చినపుడు ఆమె అతడిని కలుసుకుంది. వాళ్ళ పరిచయం ప్రేమగా మారింది. ఆమెకోసం అతడు తరచు విజయవాడ వస్తూండేవాడు. ఒకనాడు ఆమె తన ప్రేమను గురించి తండ్రితో చెప్పింది.

"అమ్మాయి, అతడికి జీతం ఎంత?" తండ్రి ప్రశ్నించాడు.

"వెయ్యా ఐదువందలు వస్తుందట" అందామె.

"ఆ డబ్బుతో మద్రాసులో సుఖంగా జీవించడం సాధ్యంకాదమ్మా" అన్నాడు తండ్రి.

"మీరున్నారుగా!" అందామె.

"వున్నానమ్మా."

"నాకు బెంగెందుకు? అతడి జీతం చాలకపోతే మీరు డబ్బు పంపొచ్చు" అందామె.

ఆమె అలా అన్నాక అతడు మరే ప్రశ్నలూ వెయ్యలేదు.

ఒక ఆదివారం వెంకట్రామయ్య తన యింట్లో సాగర్‌ని కలుసుకున్నాడు.

సాగర్‌ని చూడగానే అతడిని తన కూతురు యెందు

కంతగా ప్రేమించిందో అతడికి అర్థమైంది. సాగర్ పచ్చగా, పొడుగ్గా వున్నాడు. చక్కటి దుస్తులు ధరించాడు. ఏ కోటీశ్వరుని కొడుకులాగో చూసేవాళ్ళకు కనిపిస్తున్నాడు.

"సాగర్, మీ పెళ్ళికి నేను ఒప్పుకుంటున్నాను. మీ పెద్దలతో మాట్లాడాలిగా?"

సాగర్ తీయగా నవ్వాడు.

"మాట్లాడవలసిన అవసరం లేదు, సార్."

వెంకట్రామయ్య అతడివంక ప్రశ్నార్థకంగా చూశాడు.

"నా తలిదండ్రులు చనిపోయారు. ఒక అక్కయ్య మాత్రం వుంది అమృతసర్‌లో. కీళ్ళ నొప్పితో ఆమె మంచంబట్టింది. ఆమె పెళ్ళికి రాలేదు" అన్నాడు సాగర్.

వెంకట్రామయ్య లోలోపల సంతోషించాడు. తన కూతురు సుఖంగా బ్రతకొచ్చు! అత్తమామల బాధలు ఆమెకుండవు.

"వెంటనే మీ పెళ్ళికి ముహూర్తం పెట్టిస్తాను" అన్నాడతను.

అతడివైపు సాగర్ సూటిగా చూశాడు.

"ఇటుపైన నా పెద్దలు మీరూ, మీ భార్యా" అన్నాడతను వుద్రేకంతో.

"మాకు మాత్రం మరెవరున్నారు. నువ్వూ, రమ తప్ప!" అన్నాడు వెంకట్రామయ్య.

ఆనాటి రాత్రి వెంకట్రామయ్య సుఖంగా నిద్ర పోయాడు. తన కూతురికి యెంతో మంచివాడైన భర్త దొరికినందుకు అతడు సంతోషించాడు.

"కమలా, సాగర్ బుద్ధిమంతుడే. అతడితో మన పిల్ల సుఖంగా జీవిస్తుంది" అన్నాడతను తన భార్యతో.

"రమ అదృష్టవంతురాలండీ. అందుకే దైవం దానికి సాగర్‌ని చూపించాడు" అంది కమల.

"రేపు వాళ్ళతో మనం మద్రాసు వెళ్దాం. అక్కడ కొంతకాలం వుండి, వాళ్ళు స్థిరపడ్డాక తిరిగివద్దాం" అన్నాడతను.

"అలాగే వెళ్దాం. మరో విషయం. సాగర్‌కి కారు లేదుట. ఒక కారు కొనియిస్తే బాగుంటుంది" అందామె.

"మద్రాసు వెళ్ళాక కొని యిద్దాంలే" అన్నాడు వెంకట్రామయ్య.

ఆటుపైన ఆ దంపతులు యే చీకూ చింతా లేకుండా నిద్రపోయారు.

ఆరింటికి లేచి వెంకట్రామయ్య హాల్లోకి వెళ్ళి సోఫాలో కూర్చున్నాడు. సాగర్, రమ వుషారుగా లోపల కొచ్చారు.

"ఇంత పొద్దుటే ఎక్కడికెళ్ళారమ్మా?" అడిగాడు వెంకట్రామయ్య.

సాగర్ నవ్వుతూ అతడివైపు చూశాడు.

"జాగింగ్‌కి వెళ్లాం. ప్రతిరోజూ జాగింగ్ చేయడం నాకలవాటు" అన్నాడు సాగర్.

"గుడ్, కీపిటప్!" అన్నాడు మామయ్య తృప్తికరంగా.

## 2

అందరూ మద్రాసు చేరుకున్నారు. నాలుగో అంతస్థులో సాగర్ తీసుకున్న ఫ్లాట్ చక్కగా వుంది.

రెండు పడగ్గదులు, పెద్ద హాలు, వంట గది, రెండు

బాత్ రూమ్స్, వసారా, ముందూ బాల్కనీలు వున్నాయి.

ముందు బాల్కనీలో నుంచుని చూస్తుంటే అద్భుతంగా వుంటుంది. ఎదురుగా వున్న రోడ్డమ్మట బస్సులూ కార్లూ దూసుకుపోతూ వుంటాయి. రామ్ అపార్టుమెంట్స్ భవనంలో 80 ఫ్లాట్లు వున్నాయి.

భవనంముందు ఖాళీస్థలం వుంది. కార్లు అక్కడ ఆపుకోవచ్చు.

వారం రోజులపాటు వాళ్ళందరూ చాలా బిజీగా వున్నారు. వెంకట్రామయ్య తన అల్లుడికోసం కొన్న కొత్త అంబాసిడర్ కారులో వాళ్ళు మహాబలిపురం వెళ్ళారు. పాండిచ్చేరి వెళ్ళి అక్కడ రెండురోజులు వుండి వచ్చారు. సాగర్ కారును నడిపేవాడు.

ఒకనాటి రాత్రి నల్గురూ భోజనాలు చేస్తున్నారు.

"సాగర్, రేపు మేం విజయవాడకు వెళ్ళిపోవాలి" అన్నాడు వెంకట్రామయ్య.

"మీ రిద్దరికీ అక్కడ ఏం తోస్తుంది? మాతోనే యిక్కడ వుండిపోండి" అన్నాడు సాగర్.

"ఆ మాట అన్నందుకు చాలా సంతోషం సాగర్. మిమ్మల్ని విడిచి వెళ్ళాలని నాకూ లేదు. కాని అక్కడ పెద్ద మేడవుంది. నౌఖర్లకు అంతా వదిలేసి యిక్కడకు వచ్చేశాం."

"అదంతా అమ్మేసి యిక్కడకు వచ్చేయండి" అంది రమ.

ప్రేమతో అతడు కూతురివంక చూశాడు.

"అలాగే చేస్తానమ్మా. రెండు మూడేళ్ళ తర్వాత వచ్చి మీతోనే వుంటాం" అన్నాడు తండ్రి.

మర్నాడు పొద్దుటే వాళ్ళను కోరమండల్ ఎక్స్

ప్రెస్‌లో యెక్కించి సాగర్, రమా యింటికి చేరుకున్నారు.

"వచ్చే సోమవారంనుంచి నేను ఆఫీసుకు వెళ్ళాలి" అన్నాడు సాగర్.

"నేనొక్కర్తినీ యింట్లో వుండాలి" అంది రమ గాభరాగా.

"ఇరుగు పొరుగు ఫ్లాట్స్‌లో మన స్నేహితులు వున్నారుగా!" అన్నాడు సాగర్.

"నాకింకా ఎవరితోటీ స్నేహం కాలేదు" అందామె.

"స్నేహం చేసుకుంటే నీవు ఒంటరిగా వుండవలసిన అవసరం వుండదు" అన్నాడతను.

సోమవారం తొమ్మిదింటికల్లా అతడు వెళ్ళిపోయాడు.

"భోజనం యెక్కడ చేస్తారు?" అడిగిందామె.

"మా ఫ్యాక్టరీలో మంచి కాంటీన్ వుంది. యాభై పైసలకు అక్కడ చక్కటి భోజనంయిస్తారు. ఫ్యాక్టరీలో పనిచేసేవాళ్ళందరూ అక్కడే తింటారు" అన్నాడతను.

చీకటిపడ్డాక అతడు తిరిగి వచ్చాడు. ఏడుస్తూ ఆమె అతడికి యెదురైంది.

"రమా! ఏమైంది?"

ఆమె కళ్ళు తుడుచుకుంది.

"ఏమీ కాలేదు. ఇంతవరకూ తలుపు మూసుకొని ఒంటరిగా వున్నాను. మిమ్మల్ని చూడగానే కళ్ళమ్మట నీళ్ళు వచ్చాయి" అందామె.

"అలా పోదాం పద. బీచ్‌లో తిరిగితే హాయిగా వుంటుంది."

"మీరు కాఫీ తాగాక వెళ్దాం" అందామె.

సాగర్ మొహం కడుక్కొని కాఫీ తాగాడు.

మెల్లిగా పడగ్గదిలోకి వెళ్ళాడు.

రమ చీర ధరిస్తోంది. అతడి వంక ఆమె సిగ్గుతో చూసింది.

"కాస్సేపు హాల్లో వుండలేరూ?" అందామె కొంటెగా.

"హాల్లో వుంటే యీ దృశ్యం కనిపించదుగా!" అన్నాడతను నవ్వుతూ.

అతడామె దగ్గరగా వెళ్ళాడు. ఆమె కళ్ళలోకి క్షణ కాలం చూస్తూ వుండిపోయాడు.

రమా వయస్సు 22 వుంటుంది. నల్లగా వున్నా చురుకైన పిల్ల. కళ్ళు పెద్దవి. చేతుల్తో ఆమెను చుట్టేశాడతను.

"ఇస్త్రీ చేసిన చీర నలిగిపోతుంది!" అందామె.

"మరో చీర కట్టుకోవచ్చులే" అని అతడామెను బలంగా పెదిమలమీద ముద్దెట్టుకున్నాడు.

"ఇదంతా తర్వాత చేయొచ్చుగా!" అందామె.

"తర్వాత మళ్ళీ చేద్దాం" అని అతడు తన దుస్తులు మార్చుకోసాగాడు.

ముందు తలుపుకు తాళం వేసి యిద్దరూ కిందకు దిగారు. ఆమె ముందు సీటుమీద కూర్చుని తలుపు మూసింది. అతడు కారును పోనిచ్చాడు.

# 3

భార్య తెచ్చియిచ్చిన టెలిగ్రామ్‌ను చదివి శంకర్రామయ్య సోఫాలో వాలిపోయాడు.

"ఏమిటండీ?" అడిగింది కమల.

అతడు జవాబివ్వలేదు. కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి. భర్తను చూసి ఆమె యేడ్వసాగింది.

"ఏమైందో చెప్పండి?" అర్చిందామె.

"రమకి యాక్సిడెంట్ అయిందట. వెంటనే రమ్మని సాగర్ టెలిగ్రాం యిచ్చాడు."

"ఇలా ఏడుస్తూ కూర్చుంటే ఏం లాభం? వెళ్ళి టికెట్లు బుక్ చెయ్యమనండి" ఆమె సలహా యిచ్చింది.

వెంకట్రామయ్య తన సెక్రటరీని పిల్చాడు. రామూ పరుగెత్తుకొచ్చాడు.

"మద్రాసుకు రెండు టికెట్లు బుక్ చేయి, ఇవాళ మెయిల్ కి."

"అలాగే సార్" అని రామూ వెళ్ళిపోయాడు.

వెంకట్రామయ్య, భార్య మెయిలెక్కి మద్రాసుకు వెళ్ళారు. నాలుగో అంతస్థులో వున్న ఫ్లాట్ కు చేరుకున్నారు. తలుపు తెర్చాడు సాగర్. అమాంతంగా మామని కౌగలించుకున్నాడు. వెక్కి వెక్కి ఏడ్వసాగాడు.

"ఏమైంది? అమ్మాయి ఎక్కడుంది?" ప్రశ్నించాడు వెంకట్రామయ్య.

"మొన్న రాత్రి బాల్కనీ నుంచి రమ జారి కింద పడిపోయింది. భయంకర కేక విని నేను బాల్కనీవైపు పరుగెత్తాను. అక్కడెవరూ లేరు. అనేకమంది అరుస్తున్నారు. చంద్రకాంతిలో కిందపడిన ఆకారం నాకు కనిపించింది. కిందకు పరుగెత్తాను. ఏడుస్తూ ఆమె మీద పడిపోయాను" అన్నాడు సాగర్.

కమల యేడ్వసాగింది. వెంకట్రామయ్య అల్లుడి వంక చూశాడు.

సాగర్ గడ్డం మాసింది. గుడ్డలు మాసి వున్నాయి. విచారవదనంతో నీరసంగా వున్నాడు.

"రమ యెక్కడుంది?"

"పోలీసులు ఆమె శవాన్ని పరీక్షకు పంపారు. ఇవాళ మనకిచ్చేస్తారు."

వెంకట్రామయ్య హాల్లోని సోఫాలో కూర్చుండి పోయాడు. లోపలకు వెళ్ళి రెండు గ్లాసుల్లో మంచినీళ్ళు తెచ్చి వాళ్ళకిచ్చాడు సాగర్.

వెంకట్రామయ్య, భార్య మంచినీళ్ళను తాగేశారు.

"ఏ బాల్కనీ నుంచి పడింది?"

ముందువైపున్న బాల్కనీకేసి ముగ్గురూ నడిచారు. అక్కడ నేలమీద అరటిపండుతొక్కలు పడివున్నాయి.

"ఆ తొక్కలు ఎవరక్కడ పడేశారు?"

"రమ పడేసి వుంటుంది."

బాల్కనీలోకి నడిచి పిట్టగోడ పక్కనే నిలబడి వెంకట్రామయ్య కిందకు చూశాడు. తటాలున కళ్ళుతిరిగి అతడు పక్కకు పడబోయాడు. సాగర్ అతడిని పట్టుకొని లోపలకు తీసుకువెళ్ళాడు.

భార్య పక్కనే సోఫాలో కూర్చుని ఆమెమీద చెయ్యివేశాడు వెంకట్రామయ్య.

"ఇంక మనమ్మాయి లేదే యీ లోకంలో! గెంతుతూ వుషారుగా జీవించే రమ పైకి శాశ్వతంగా గెంతేసింది" అన్నాడతను యేడుస్తూ.

ముగ్గురూ హాల్లో యేడుస్తూ కూర్చున్నారు. పది నిమిషాల తర్వాత సాగర్ కంఠం హాల్లో ధ్వనించింది.

"వుద్యోగం మాని నేను మరోచోటుకు వెళ్ళి పోతాను. ఈ పట్నంలో వుండలేను. ఇక్కడుంటే రమ నాకు గుర్తుకొస్తూ వుంటుంది" అన్నాడతను.

"ఎక్కడకు పోయినా నువ్వు ప్రేమించిన భార్య నీకు

జ్ఞాపకం రావడం లేదా వుంటుందా?" అడిగాడు వెంకట్రామయ్య.

కొంతసేపు సాగర్ మాట్లాడలేదు.

"మావగారూ, అది నిజమే. అయినా ఇక్కడికంటె మరోచోటుకు పోవడం మంచిదనిపిస్తోంది!"

"చూద్దాం" అన్నాడు వెంకట్రామయ్య.

## 4

సాగర్ ఫ్లాట్‌కి యెదురుగా వున్న ఫ్లాట్‌లోకి వెళ్ళాడు యిన్‌స్పెక్టర్ బాండ్.

రామచంద్రన్, అతడి భార్య ఇన్‌స్పెక్టర్ బాండ్‌ను కూర్చోమన్నారు. రామచంద్రన్ ఒక బేకరీలో పని చేస్తున్నాడు.

"మీ పేరు?"

"రామచంద్రన్, ఈమె నా భార్య మల్లిక."

"ఎదుట ఫ్లాట్‌లోవుండే సాగర్, రమలతో మీకు బాగా పరిచయముందా?"

"అంతగా లేకపోవచ్చు. అయినా వాళ్ళు రోజూ మాకు కనిపించేవారు. ఒక్కోసారి లిఫ్ట్‌లో కలిసి పైకి వచ్చేవాళ్ళం."

"భార్యాభర్తలు దెబ్బలాడుకుంటూ వుండేవారా?" ప్రశ్నించాడు బాండ్.

రామచంద్రన్ పెద్దగా నవ్వాడు.

"వాళ్ళిద్దరూ చాలా అన్యోన్యంగా వుండేవారు, సార్. ఆఫీసునుంచి రాగానే యిద్దరూ కారులో యెక్కడికో పోయేవారు. ఎనిమిది తర్వాత తిరిగివచ్చేవారు. వాళ్ళ మొహాలుచూస్తే ఆనందంతో మెరిసిపోతూ వుండేవి."

ఇన్‌స్పెక్టర్ బాండ్ మళ్లీ కళవైపు చూశాడు.

"రమ మీ యింటికి వచ్చిందా?"

"ఆమె రాలేదు. నేనే ఒకసారి వాళ్ళ ఫ్లాట్‌కు వెళ్ళాను. ఆమె చాలా మంచిది. ప్రేమించి ఆమె సాగర్‌గార్ని పెళ్ళాడింది. ఇద్దరూ హాయిగా జీవిస్తున్నారు. కాని విధి ఆమెను అకాలంగా యెత్తుకు పోయింది" అందామె.

ఇన్‌స్పెక్టర్ బాండ్ చూపు రామచంద్రన్ మీదకు వెళ్ళింది.

"ఆనాటి రాత్రి మీరు విన్నదీ, చూసిందీ చెప్పండి!"

"రాత్రి పదిదాటింది. బయటనుంచి ఒక స్త్రీ భయంకరంగా అర్చింది. కాస్సేపట్లో నేలమీద యేదో పడిన చప్పుడు వినపడింది. నేను బాల్కనీలోకి పరుగెత్తాను. కిందకు చూశాను. రోడ్డు లైట్లు వెలుగుతున్నాయి. నేలమీద ఎవరో పడివున్నారని తెల్సుకున్నాను. ఎవరో తెలియదు. తలుపు వేసుకొని ఇంట్లో వుండమని నా భార్యని హెచ్చరించి కిందకు వెళ్లాను. లిఫ్ట్ కిందకు దూసుకుపోయింది. అందువలన మెట్లమ్మట గబగబా దిగాను."

"ప్రొసీడ్!"

"బయటకు వెళ్లాను. అప్పటికప్పుడే చాలామంది కింద వున్నారు. ఆ స్త్రీ మీదపడి సాగర్‌గారు పిచ్చివాడిలా యేడుస్తున్నారు. కిందపడినది ఆయన భార్యని అప్పుడు చూశాను. పోలీసు రిపోర్టు యిచ్చాను. సాగర్‌గారిని ఓదారుస్తూ, ఆయనకు ధైర్యం చెప్తూ పోలీసులు వచ్చినదాకా కింద నే వున్నాను" అన్నాడు రామచంద్రన్.

"మీరెంతకాలం నుంచి ఈ ఫ్లాట్‌లో వుంటున్నారు?"

"ఐదేళ్ళు దాటింది."

"ఈ ఐదేళ్ళలోనూ అటువంటి యాక్సిడెంట్స్ యేమైనా జరిగాయా?"

"లేదు, సార్."

"ఒక కోతి కిందపడి చచ్చింది" అంది మల్లిక.

ఇన్‌స్పెక్టర్ ఆమెవైపు తిరిగాడు.

"అదెలా జరిగింది?"

"ఇక్కడి ఫ్లాట్లలోకి కోతులు వస్తూంటాయి. వెనక వైపు బాల్కనీలోకి ఒకనాడు ఒక కోతి వచ్చింది. తలుపు తెర్చి వుంది. కోతి వంటింట్లోకి వెళ్ళింది. అక్కడున్న జామ్ బాటిల్ దాని కంట బడింది. మూతనుతీసేసి అది జామ్‌ను మెక్కుతోంది. ఇంతలో యింటావిడ అక్కడకు వచ్చి కోతిని చూసింది. కర్రతో కొట్టడానికి వెళ్ళిందామె. కోతి గాభరాగా బాల్కనీలోకి పరుగెత్తింది. జామ్ బాటిల్ని వదల్లేదు కోతి. అక్కడనుంచి బయటకు దూకింది. చేతిలో జామ్‌బాటిల్ వుండడంవలన కోతి నీళ్ళగొట్టాన్ని పట్టుకోలేకపోయింది. కోతి కిందపడి చచ్చింది. జామ్ బాటిల్ నేలకూలి పగిలి ముక్కలైంది" అంది మల్లిక.

"ఏ ఫ్లాట్‌లో జరిగిందిది?"

"నాలుగో అంతస్థులో వున్న ఫ్లాట్‌లోనే. ఆ ఫ్లాట్ నంబరు నాకు తెలియదు. అందరం వెళ్ళి కోతిని చూసి వచ్చాం" అందామె.

వాళ్ళకు థాంక్స్ చెప్పి ఇన్‌స్పెక్టర్ బాండ్ బయటకు నడిచాడు. ఎదురుగా వున్న ఫ్లాట్ తలుపును తట్టాడు.

సాగర్ తలుపు తెర్చాడు.

"మీరా, యిన్‌స్పెక్టర్, కమిన్!" అన్నాడతను.

హాల్లో వున్న రమ తలిదండ్రులను సాగర్ యిన్‌స్పెక్టర్‌కు పరిచయం చేశాడు. వెంకట్రామయ్యకు వినయంగా యిన్‌స్పెక్టర్ నమస్కరించాడు.

"మీ రాకకోసం యెదురుచూస్తున్నాను, సార్" అన్నాడు యిన్‌స్పెక్టర్ బాండ్.

సాగర్ తన పడగ్గదిలోకి వెళ్ళిపోయాడు.

"మీ అమ్మాయి మీకు ఉత్తరాలు రాస్తూవుండేదా?" అడిగాడు యిన్‌స్పెక్టర్.

"ఉత్తరాలు రాసేది. వారానికొకసారి ఎస్.టి.డి. కాల్ చేసి మాతో మాట్లాడేది."

"ఆమె భర్తతో ఆనందంగా కాపురం చేసేదా?"

"వాళ్ళిద్దరూ ప్రేమించుకొని పెళ్ళాడారు. పెళ్ళయినాక వాళ్ళతో నేనూ, నా భార్యా ఇక్కడకు వచ్చి, కొన్ని రోజులు వుండి వెళ్ళాం. రమ అంటే సాగర్‌కి ప్రాణం. ఈనాడు అతడు గుండెలు బాదుకొని యేడుస్తున్నాడు. బాల్కనీలోంచి జారిపడ్డం యెప్పుడో గాని జరగదు. అదంతా ఫేట్, యిన్‌స్పెక్టర్. అంతా తనే చేస్తున్నానని మనిషి అహంభావంతో గర్విస్తాడు. మనిషి చేసేది సున్నా అనిపిస్తోంది నాకు. జరగవలసినవి విధిరాత ప్రకారం సాగిపోతున్నాయి" అన్నాడు వెంకట్రామయ్య.

ఇన్‌స్పెక్టర్ బాండ్ అతడివైపు నవ్వుతూ చూశాడు.

"సాగర్‌కి మీరు ఎక్కువగా కట్నం యిచ్చారా?"

"ఇవ్వలేదు. రమను ప్రేమిస్తున్నాను, పెళ్ళాడాను అన్నాడతను. నన్ను కట్నం అడగలేదు. రమ నా ఏకైక పుత్రిక. అందువలన సాగర్‌కి అంబాసిడర్ కారు కొని

ఇచ్చాను. కొంత డబ్బుకూడా ఇచ్చాను. మీరు ఏం దర్యాప్తు చేస్తున్నారో నాకు అర్థంకావడంలేదు. నా ఆస్తి అంతా నా కూతురికే వెళుతుంది. ఆమె యిలా మరణించడం మూలంగా సాగర్‌కి వచ్చేలాభం యేమీలేదు. నా కూతురు లేకపోవడంవలన సాగర్ మాకు దూరం కావచ్చు. అతడు చాలా మంచివాడు. నాకు మరో కూతురు వుంటే ఆమెను అతడికిచ్చి పెళ్ళిచేసేవాడిని. కాని ఆ అదృష్టం దైవం నాకివ్వలేదు" అన్నాడు వెంకట్రామయ్య.

ఇన్‌స్పెక్టర్ బాండ్ అంతా మౌనంగా విన్నాడు.

"ఆమె రాసిన ఈ వుత్తరాలు చూడండి!" అన్నాడు వెంకట్రామయ్య.

అరడజన్ వుత్తరాలను ఇన్‌స్పెక్టర్ బాండ్ వేగంగా చదివాడు. రమ చాలా ఆనందంగా వుంది. స్వర్గంలో వున్నట్లు జీవితం గడిచిపోతోంది.

వుత్తరాలను అతడు తిరిగి యిచ్చేశాడు.

"మీరు యిక్కడ కొంతకాలం వుంటారా, సార్?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"అల్లుడిని గురించి నాకు చాలా బెంగగా వుంది. అతడు యువకుడు. వయసు ఇరవైఏడు వుంటుంది. రమ పోయాక అతడు బతికి వుంటాడా అని నాకు అనుమానంగా వుంది. అతడి విషయం తేల్చుకున్నాక మేం మా ఊరుకు పోతాం" అన్నాడు వెంకట్రామయ్య.

సాగర్ హాల్లోకొచ్చాడు.

"మిస్టర్ సాగర్, శవ పరీక్ష పూర్తయింది. మీరు మీ భార్య శవాన్ని ఇవాళ రెండింటికి తీసుకువెళ్ళొచ్చు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ బాండ్.

సాగర్ జవాబివ్వలేదు.

"ఇలా కూర్చో, సాగర్" అన్నాడు వెంకట్రామయ్య.

మామ పక్కనే సాగర్ కూర్చున్నాడు.

ఇన్‌స్పెక్టర్ బ్రాండ్ బయటకు నడిచాడు.

"సాగర్, అమ్మాయి శవాన్ని మనిద్దరం వెళ్ళి తీసుకు వద్దాం" అన్నాడు వెంకట్రామయ్య.

సాగర్ తలాడించాడు.

## 5

రమ శవాన్ని దహనం చేసి ఆరింటికి వెంకట్రామయ్య సాగర్ తిరిగివచ్చారు.

కాళ్ళూ, చేతులూ కడుక్కున్నారు. ఎదుటి ఫ్లాట్‌లో వుండే మల్లిక కాఫీ తెచ్చి వాళ్ళకిచ్చింది.

"వద్దమ్మా" అన్నాడు వెంకట్రామయ్య.

"నాలో ఆకలి చచ్చిపోయింది" అన్నాడు సాగర్.

కమల అల్లుడివైపు చూసింది.

"సాగర్, మనందరం యెంత యేడ్చినా రమ తిరిగి రాదు. ధైర్యం తెచ్చుకో!" అందామె.

వెంకట్రామయ్య కాఫీ గ్లాసును అందుకొని సాగర్‌కి ఇచ్చాడు. మరో గ్లాసు తను తీసుకున్నాడు. కమల మరో గ్లాసును అందుకుంది. అందరూ కాఫీ తాగారు.

మల్లిక దగ్గరగా వెళ్ళి కమలవైపు చూసింది.

"నేను రాత్రి భోజనం తెచ్చి ఇస్తాను. మీరు వండకండి" అంది మల్లిక.

ఆమెను పట్టుకొని కమల భోరుమని యేడ్వసాగింది.

అరాకొరగా తిని వెంకట్రామయ్య, కమల హాల్లో పడుకున్నారు. సాగర్ బాల్కనీలో నేలమీద కూర్చున్నాడు.

పదకొండు దాటింది. కమల భర్తను మెల్లిగా తట్టింది.

"వెళ్ళి అల్లుడిని ఓదార్చండి. తన గదికి వెళ్ళి పడుకో మనండి" అందామె.

వెంకట్రామయ్య లేచాడు. బాల్కనీలోకి వెళ్ళాడు. నేలమీద కూర్చుని వున్న సాగర్ వైపు చూశాడు.

"సాగర్, వెళ్ళి నీ గదిలో పడుకో!" అన్నాడతను.

"ఈ బాల్కనీని వదల బుద్ధి కావడంలేదు!" అన్నాడు సాగర్.

నేలమీదున్న అరటిపండు తొక్కలవైపు వెంకట్రామయ్య చూశాడు.

"ఇవింకా యిక్కడే వున్నాయా?"

"పోలీసు యిన్స్పెక్టర్ అలాగే వుంచమన్నాడు. ఇప్పుడా అవసరంలేదు" అన్నాడు సాగర్.

ఆ తొక్కల్ని కసితో బయటకు పారేసి వెంకట్రామయ్య అల్లుడి పక్కనే కూర్చున్నాడు.

"సాగర్, నువ్వు బతికుండాలి. అమ్మాయిని గురించి ఆలోచించి మనసు పాడుచేసుకొని యే అఘాయిత్యం చేయకూడదు. నా చేతిలో చెయ్యేసి చెప్పు!"

సాగర్ యేడ్వసాగాడు

"నువ్వు యువకుడవు. మళ్ళా పెళ్ళిచేసుకొని సుఖంగా జీవించు" అన్నాడతను.

వెంకట్రామయ్య చెయ్యిని సాగర్ పట్టుకున్నాడు.

"నేను బతికుంటాను. కాని దయచేసి నా పెళ్ళి సంగతి ఎత్తొద్దు. నా హృదయంలో రమ రూపం జ్యోతిలా వెలుగుతోంది" అన్నాడతను.

"పడుకుందావుగాని, పద!"

ఇద్దరూ లేచారు.

"ఆనాటి రాత్రి అమ్మాయి ఒంటరిగా యీ బాల్కనీలోకి ఎందుకు వచ్చింది" అడిగాడు వెంకట్రామయ్య.

"ఇద్దరం అరటిపళ్ళు తిన్నాం. తొక్కల్ని ఆమె బాల్కనీలోకి విసిరేసింది. అలా విసరడం ప్రమాదకరమనుకుందేమో, వాటిని బయట పారేయడానికి బాల్కనీలోకి వెళ్ళింటుంది. ఆమె అరుపు విన్నాక నేను పరుగెత్తాను. కాని ఏం లాభం? అప్పటికంతా అయిపోయింది. నా ప్రాణం, నా ఊపిరైన రమ కింద పడిపోయింది" అన్నాడతను.

సాగర్ బాల్కనీ పిట్టగోడమీదకు వాలబోయాడు. అతడిని బలంగా పట్టుకుని వెంట్రామయ్య పడగ్గదిలోకి తీసుకెళ్ళాడు.

"సాగర్, పడుకో!"

"నిద్ర రావాలిగా!" అన్నాడు సాగర్.

"నిద్రబోతే రమను నువ్వు కలలో కలుసుకోవచ్చు. మేల్కొంటే నరకం. నిద్రే నీకు మంచిది" అన్నాడు వెంకట్రామయ్య.

"మీరు చెప్పింది నిజమే. ఇటువైన కలలోనే రమను కల్సుకోగలను" అన్నాడు సాగర్.

వెంకట్రామయ్య మెల్లిగా హాల్లోకి నడిచాడు. నేలమీద తన భార్య పక్కనే పడుకున్నాడు.

"ఇక్కడ నేను వుండలేనండి. విజయవాడ వెళ్ళిపోదాం" అంది కమల.

"రెండు మూడు రోజుల్లో వెళ్ళిపోదాం" అన్నాడు వెంకట్రామయ్య.

# 6

సెంట్రల్ స్టేషన్‌కి వెళ్ళి సాగర్ వాళ్ళకు వీడ్కోలు చెప్పాడు.

కంపార్టుమెంటులో వాళ్ళతో కొంతసేపు కూర్చున్నాడు.

"సాగర్, నీకు ఉత్తరాలు రాస్తూ వుంటాను. జవాబులు రాస్తూ వుండు" అన్నాడు వెంకట్రామయ్య.

"రాయండి. మీకంటే ఆప్తులు నాకీ లోకంలో ఎవరున్నారు? కాని నేను బొంబే పోతున్నాను. నేను అక్కడ సెటిల్ అయ్యాక నా అడ్రెసు రాస్తాను. ఆ అడ్రెసుకు రాయండి" అన్నాడు సాగర్.

"నువ్వు యెక్కడున్నా నీ గురించి సమాచారం నాకు చేరుతూ వుండాలి" అన్నాడు వెంకట్రామయ్య.

"చేరేటట్లు నేను చూస్తాను" అన్నాడతను.

సాగర్ తన ఫ్లాట్‌కు తిరిగి వచ్చాడు. గదులన్నీ తిరిగి చూశాడు. హాల్లోకి వెళ్ళాడు. ఎవరో తలుపును తట్టారు.

అతడు తలుపు తెర్చాడు. ఇన్‌స్పెక్టర్ బాండ్ లోపలకు వచ్చాడు.

"రండి, కూర్చోండి, యిన్‌స్పెక్టర్" అన్నాడు సాగర్.

"రమ ప్రమాదవశాత్తూ మరణించిందని నిర్ణయించబడింది. ఇటుపైన మీరు మీ ఇష్టప్రకారం ఎక్కడికైనా వెళ్ళొచ్చు" అన్నాడు యిన్‌స్పెక్టర్ బాండ్.

"మీ దర్యాప్తు ముగిసినట్లేనా?"

"ముగిసింది."

"ఇన్‌స్పెక్టర్, టీ తాగుతారా?"

"మీరు తయారు చేస్తారా?"

"ఇటు పైన నేనే చేసుకోవాలిగా!" అన్నాడు సాగర్ నవ్వుతూ.

"వద్దులెండి" అని యిన్‌స్పెక్టర్ బాండ్ బయటకు వెళ్ళిపోయాడు.

సాగర్ కిటికీ ముందుకు వెళ్ళి బయటకు చూశాడు. పోలీస్ జీవ్ కనిపిస్తోంది. ఇన్‌స్పెక్టర్ బాండ్ కూర్చోగానే జీవ్ కదిలింది. కాస్సేపట్లో జీవ్ మాయమైంది.

ఆలోచిస్తూ సాగర్ సిగరెట్ వెలిగించాడు. పొగ పీల్చి వదుల్తూ సోఫాలో కూర్చున్నాడు.

వారం రోజులపాటు సాగర్ చాలా బిజీగా వున్నాడు.

అంబాసిడర్ కారును అమ్మేశాడు. తన భార్య దుస్తులను మూర్ మార్కెట్‌లో అమ్మేశాడు. తన ఫ్లాట్ వదిలేశాడు. దాదర్ ఎక్స్‌ప్రెస్‌లో బొంబేకి చేరుకున్నాడు.

హోటల్లో నివసిస్తూ యిళ్ళకోసం అతడు వెతకసాగాడు. రాజ్ బిల్డింగ్స్‌లో ఒక ఫ్లాట్ అతడికి దొరికింది. ఆ ఫ్లాట్ ఐదో అంతస్తులో వుంది. డబ్బు చెల్లించి అతడా ఫ్లాట్‌కు మారిపోయాడు.

వెంకట్రామయ్యకు ఉత్తరం రాశాడు. తన కొత్త అడ్రెసు యిచ్చాడు. తరచు ఉత్తరాలు రాయమన్నాడు.

పదిరోజులు తిరిగేలోపల అతడికి వెంకట్రామయ్య జవాబిచ్చాడు.

"సాగర్, నువ్వు యెక్కడున్నా నా అల్లుడివే. నువ్వు వృద్ధిలోకి వచ్చేవని తెలిస్తే నేను ఆనందిస్తాను. ఎవ్వరూ ఊహించని పరిస్థితుల్లో నా కూతురు వెళ్ళిపోయింది. నువ్వు ధైర్యంగా బతుకు. ఆమె నీ హృదయంలో శాశ్వతంగా జీవిస్తుంది" అని రాశాడు వెంకట్రామయ్య.

సాగర్ తనలోతను నవ్వుకున్నాడు. సిగరెట్ వెలిగించాడు. పొగ వదుల్తూ తన ఫ్లాట్ లోంచి బయటకు నడిచాడు.

# 7

నెలలు దొర్లిపోయాయి.

వెంకట్రామయ్య తరచు బొంబేకి ఉత్తరాలు రాస్తున్నాడు. రెండు మూడుసార్లు జవాబులు వచ్చాయి. తర్వాత జవాబులు లేకుండా పోయాయి.

సాగర్ కి యేమైంది? అతడు యెందుకు జవాబివ్వడం లేదు?

ఏమైందో తెల్సుకోవాలని వెంకట్రామయ్య రోజూ ఒక ఉత్తరం రాయసాగాడు. కొన్నిరోజుల తర్వాత బరువైన కవరొకటి అతడికొచ్చింది. కవర్ను చింపి లోపలవున్న తన వుత్తరాలవంక అతడు ఆశ్చర్యంగా చూశాడు.

కవరులో టైప్ చేసిన ఒక ఉత్తరం కూడా వుంది. దాన్ని అతడు చదవసాగాడు.

"డియర్ సార్, మీనుంచి ఉత్తరాలు ఇక్కడకు రోజూ వస్తున్నాయి. ఇంతకు ముందు ఈ ఫ్లాట్ లో సాగర్ అనే అతను వుండేవాడని విన్నాను. అతడు యెక్కడికో వెళ్ళిపోయాడు. ఎక్కడకు వెళ్ళాడో నాకు తెలియదు. మీరు రాసిన ఉత్తరాలన్నీ మీకు పంపేస్తున్నాను. ఇటుపైన నా అడ్రెసుకి రాయకండి."

గజిబిజిగా వుంది సంతకం. ఎంతసేపు చూసినా పేరు స్పష్టంగా తెలియడంలేదు.

వెంకట్రామయ్య తీవ్రంగా ఆలోచించసాగాడు.

మద్రాసులో వున్న ఉద్యోగాన్ని వదిలేసి సాగర్ బొంబే పోయాడు. అక్కడ ఉద్యోగం దొరకలేదేమో! మరెక్కడికో వెళ్ళాడు. త్వరలో సాగర్ నుంచి తనకు ఉత్తరం రావచ్చు!

నెలలు గడిచిపోయినా సాగర్ నుంచి ఉత్తరం లేదు.

వెంకట్రామయ్య ఆప్యాయంగా పక్కనున్న కమల మీద చెయ్యి వేశాడు.

"కమలా, నాకు భయంగా వుంది. సాగర్ ఆత్మహత్య చేసుకుని వుండొచ్చు!"

"ఎక్కడో క్షేమంగా వుండివుంటాడు. మరో అమ్మాయి అతడికి దొరికి వుంటుంది. మన్ని మర్చిపోయి వుండొచ్చు!" అంది కమల.

"సాగర్ అలాంటివాడు కాడు!"

"అలా ఊహించుకుంటూ కూర్చోండి. తర్వాత మనకే నిజం తెలుస్తుంది. సాగర్ యువకుడు. రమ పోయిన కొంతకాలం పాటు బాధాకరంగా వుంటుంది. తర్వాత తన భవిష్యత్తు కోసం అతడు పాటుబడ్తాడు. మళ్ళా ఎవర్నో పెళ్ళాడ్తాడు" అందామె.

"అంతేనంటావా?" అన్నాడు వెంకట్రామయ్య.

"సాగర్‌ని గురించి అనవసరంగా ఆలోచించి బాధపడకండి. రమ వున్నంత కాలం అతడు మన అల్లుడు. ఇప్పుడు యెవరి అల్లుడో!" అంది కమల నిశ్చయంగా.

# 8

ఆమె వేగంగా నడుస్తోంది. ఆమె చేతిలోని పుస్తకం ఒకటి కింద పడింది. అప్పుడే బస్సు వచ్చింది. ఆమె

బస్సులో ఎక్కేసింది.

బస్ కదిలింది. వెనుకనుంచి అతడామెను చూశాడు. నేలమీద పడిన పుస్తకాన్ని తీసి చూశాడు. మిల్టన్స్ పారడైజ్ లాస్ట్. ఆమె లిటరేచర్ స్టూడెంట్ అయి వుండాలి. చక్కటి అక్షరాల్లో ఆమె పేరు రాయబడి వుంది. మిస్ లలితా కలేల్కర్!

వెళ్ళిపోతున్న బస్ వైపు అతడు నిస్సహాయంగా చూశాడు. ఆమె ప్రతిరోజూ యిదే స్టాపులో బస్సు ఎక్కుతూ వుండాలి!

మర్నాడు సాయంత్రం ఆదే బస్టాపు దగ్గర అతడు నిలబడి వున్నాడు. ఆరు కావస్తోంది. ఆమె యింకా రాలేదు. ఇంతకు ముందే ఆమె వెళ్ళిపోయిందేమో!

ఆరున్నరవరకూ చూసిపోవాలని అతడు నిశ్చయించుకున్నాడు. ఆరు దాటి పదినిమిషాలు కాగానే ఆమె ముఖం అతడికి కనిపించింది.

అతడు యెదురుగా వెళ్ళి నవ్వుతూ ఆమె వంక చూశాడు.

"మిస్!" అన్నాడతడు.

ఆమె చిరాకుగా అతడివంక చూసింది.

"మిస్ లలితా, నిన్న మీరొక బుక్ను యిక్కడ పారేసుకున్నారు...."

"పారేసుకోలేదు, పడిపోయింది" అందామె.

అతడా పుస్తకాన్ని ఆమెకు యిచ్చాడు.

"మిస్టర్, చాలా థాంక్స్!" అందామె.

"నా పేరు సాగర్" అన్నాడతను.

"ఈ బుక్కు మళ్ళా దొరుకుతుందని నేననుకోలేదు. ఐ యామ్ లక్కీ!" అందామె.

"అలా వెళ్ళి టీ తాగుదాం రండి" అన్నాడతను.

"కాలేజిలో ఆలస్యమైంది. ఇంటికి పోవాలి" అందామె.

ఆమె కళ్ళలోకి సూటిగా చూశాడు.

"పొరపాటున నేలపడిన పుస్తకం నన్ను మీకు పరిచయం చేసింది. ఎందుకో? అదే జీవితంలోవున్న మిస్టరీ" అన్నాడతను.

నవ్వుతూ ఆమె అతడివైపు చూసింది.

"మీరేం చేస్తున్నారు?"

"కలింగా యింజనీర్స్ కంపెనీలో యింజనీర్ గా పని చేస్తున్నాను."

"పదండి. తొందరగా మనం టీ తాగేయాలి" అందామె.

ఇద్దరూ రోడ్డువారగా నడిచారు. ఒక రెస్టారెంట్ లోకి దూరారు. మూలగా వున్న టేబుల్ దగ్గర కూర్చున్నారు.

బేరర్ వచ్చాడు.

"ఏదేనా తినండి" అన్నాడతను.

"ప్లీజ్! నాకు ఆకలిగా లేదు. టీ మాత్రం తెమ్మనండి" అందామె.

"మీరు మొహమాట పడుతున్నారు" అన్నాడతను.

"నన్ను బలవంతం చేయకండి!"

అతను టీ ఆర్డరిచ్చాడు.

కాస్సేపట్లో రెండు కప్పుల్లో టీ వచ్చింది.

"మీరు చాలా అందంగా వున్నారు" అన్నాడతను.

"మీరు సినిమా హీరోలా వున్నారు. మొదట్లో మీరొక యాక్టరై వుండాలి అనుకున్నాను" అందామె.

ఇద్దరూ టీ సేవిస్తూ మాట్లాడసాగారు. చీకటిపడింది. రోడ్డులైట్లు వెలుగుతున్నాయి.

వాళ్ళు బయటకు వచ్చేసరికి ఏడు దాటింది.

"ఆటోలో మిమ్మల్ని మీ యింటి దగ్గర దింపేస్తాను" అన్నాడతను.

"చాలా ఖర్చవుతుంది" అందామె.

అతడు ఆటోని పిల్చాడు. ఆమె ఎక్కగానే పక్కన కూర్చున్నాడు.

"శాంతాక్రూజ్ కి పద" అన్నాడతను డ్రయివర్ తో.

ఆటో దూసుకుపోయింది.

# 9

హాల్లోని లైట్లు వెలుతోంది. కలేల్కర్, అతడి భార్య శాంత కూతురివైపు చూశారు.

"లలితా, ఎక్కడో రోడ్డుమీద కనిపించిన యువకుడిని పెళ్ళాడ్తాననడంలో అర్థంలేదు. అతడు మరో రాష్ట్రంవాడు. మన భాష అతడికి రాదు" అన్నాడు తండ్రి.

"భాషకేముంది నాన్నా? అతడు మరాఠీ నేర్చుకోగలడు. నేను ఇంగ్లీషు నేర్చుకోలేనూ?" అంది లలిత.

"ప్రేమలో పడినవాళ్ళు మీరు యేం చెప్పినా వినరండీ" అంది శాంత.

లలిత తండ్రివంక సూటిగా చూసింది.

"గతంలోకి వెళ్ళి ఆలోచించండి. మూడేళ్ళ క్రితం అక్కయ్య ఒక అరవ యువకుడిని ప్రేమించింది. మీతో

చెప్పింది. మీరు ఒప్పుకోలేదు. ఆమె ఏం చేసిందో మీకు జ్ఞాపకం వుందిగా!"

కలేల్కర్ కోపంగా ఆమెవైపు చూశాడు.

"ఆమెలా అతడితో లేచిపోతానని నన్ను భయపెడ్తున్నావా?" అరిచాడతను.

"నిన్నూ, అమ్మనీ నే నెప్పుడూ భయపెట్టను, నాన్నా" అంది లలిత.

"అయితే నువ్వు చెప్పేది యేమిటి?"

"సాగర్ యీ పట్నంలో ఉద్యోగంలో వున్నాడు. నెలకు రెండువేలు జీతం వస్తోంది. చిల్లిగవ్వ కట్నం అడగకుండా నన్ను పెళ్ళాడ్తాడు. అంతకంటే మనకు యేం కావాలి?" అంది లలిత.

"అతడిని నేను చూడాలి. అతడితో మాట్లాడాలి. అంతవరకూ నే నేమీ చెప్పలేను" అన్నాడు తండ్రి.

"అతడిని రేపే యిక్కడకు రమ్మంటాను," అంది లలిత.

"తొందరపడకమ్మా! మంచి రోజు చూసి నేను చెప్తాను. అప్పుడు రమ్మను."

"అలాగే నాన్నా!" అంది లలిత.

"అమ్మాయి! కట్నం లేకుండా పెళ్ళాడ్తామని యెందరో అంటారు. తర్వాత అతని తలిదండ్రులు నిన్ను ముప్పతిప్పలు పెడ్తారు. ఇది తేలేదు, అది తేలేదని నిన్ను వేధిస్తారు" అన్నాడు కలేల్కర్.

"ఆ బాధలేదు నాన్నా. సాగర్ కి తలిదండ్రులు లేరు" అందామె.

"అయితే చూద్దాం తర్వాత" అన్నాడు తండ్రి.

# 10

సాగర్‌తో లలిత పెళ్ళి జరిగిపోయింది. పెళ్ళయ్యాక సాగర్, లలిత హనీమూన్ కి గోవా వెళ్ళారు. రెండు వారాల తర్వాత యింటికి తిరిగివచ్చారు,

"మేం నా ఫ్లాట్ కి యివాళ వెళ్ళిపోతాం" అన్నాడు సాగర్.

"తొందర ఏమిటి? లలితను చూడకపోతే మాకు తోచదు" అన్నాడు కలేల్కర్.

"నేను ఆఫీసుకు వెళ్ళాక రోజూ యిక్కడకు రావచ్చు" అన్నాడు సాగర్.

ఆ నాటి రాత్రి సాగర్ తన భార్యను తన ఫ్లాట్ కు తీసుకుపోయాడు. నీళ్ళ సౌకర్యం సరిగా లేక అతడు రాజ్ బిల్డింగ్స్‌లోని ఫ్లాట్‌ను వదిలేసి కాద్మార్ భవనంలో మరో ఫ్లాట్ తీసుకున్నాడు.

కలేల్కర్ ఫ్లాట్‌ను చూసి సంతోషించాడు. ఫ్లాట్ విశాలంగా వుంది. మెట్లు దిగవలసిన అవసరం లేదు. ఇరవై నాలుగ్గంటలూ లిఫ్ట్ సౌకర్యం వుంది.

టైమ్ ఎనిమిది దాటింది. అందరూ అక్కడే భోజనం చేశారు. తర్వాత కొంత సేపు అందరూ హాల్లో కూర్చు న్నారు, ముచ్చటగా మాట్లాడుతూ.

"మేమిక యింటికి పోతాం" అన్నాడు కలేల్కర్.

సాగర్, లలిత కిందకు వెళ్ళి వాళ్ళకు సెండాఫ్ యిచ్చారు. కలేల్కర్ తన కారును పోనిచ్చాడు.

సాగర్, లలిత పైకి చేరుకున్నారు. ఇద్దరూ అరటి పళ్ళు తిన్నారు. తొక్కలను సాగర్ బాల్కనీలో వున్న చుక్క డబ్బాలో పడేశాడు.

తలుపులన్నీ మూసి వాళ్ళు పడగ్గదిలోకి చేరుకున్నారు.

బయట పౌర్ణమి చంద్రుడు అఖండంగా ప్రకాశిస్తు న్నాడు. చల్లని కాంతి!

ముందు బాల్కనీ తలుపును తెరిచాడు సాగర్. బాల్కనీలోకి వెళ్ళి నిలబడ్డాడు. నవ్వుతూ ఆమె వచ్చి పక్కనే నిలబడింది.

రోడ్డు కటువైపున ఎదురుగా మరో భవనం వుంది. ఎదుటి భవనంలో కొందరు బాల్కనీల్లో నిలబడి మాట్లాడుకుంటున్నారు.

"రాత్రిళ్ళు ఈ బాల్కనీలో జాగ్రత్తగా వుండాలి. కిందపడితే బతికివుండం" అన్నాడు సాగర్.

"బాల్కనీ పిట్టగోడ తొడలదాకా వుంది. కిందపడ్డం కష్టం" అంది లలిత నవ్వుతూ.

అతడు రోడ్డువైపు చూశాడు. కార్లు దూసుకుపోతు న్నాయి. చటుక్కున సాగర్ కళ్ళు మూసుకున్నాడు.

"సాగర్! ఏమిటలా వున్నావు?"

"ఇంత పైనున్న బాల్కనీలో నుంచుంటే భయం వేస్తోంది" అన్నాడతను.

ఆమె నవ్వింది.

"ఎందుకు భయం? లైట్‌హౌస్ పైదాకా నేను ఎన్నిసార్లో ఎక్కాను" అందామె.

"ఒంటరిగానా?"

"నా కాలేజిమేట్స్‌తో. పైనించి కిందకు చూసే దాన్ని. థ్రిల్లింగ్!"

"నాకు కళ్ళు తిరుగుతాయి!"

"సాగర్, అయితే నాలుగో అంతస్తులో వున్న యీ ఫ్లాట్ వదిలేసి గ్రౌండ్ ఫ్లోర్‌లో వున్న ఫ్లాట్ తీసుకుందాం" అందామె.

"వద్దు!" అన్నాడతను.

"భయమంటావు! వద్దంటావు!"

"నాలోని భయాన్ని యీ ఫ్లాట్‌లోనే వుండి జయించాలి" అన్నాడతను.

"నేను పక్కనుంటే మీకేం భయం వుండదు" అందామె.

అతడామెను కౌగలించుకోబోయాడు. ఎదురుగా ఫ్లాట్ వైపు ఆమె చూపించింది.

"వాళ్ళు చూస్తారు. లోపలకు పోదాం రా!" అందామె.

ఆమె వెనకనే అతడు లోపలకు నడిచాడు. ఆమె బాల్కనీ తలుపును మూసేసింది.

## 11

నాలుగు నెలలు గడిచిపోయాయి.

కలేల్కర్ గాఢనిద్రలోంచి లేచాడు.

మ్రోగుతున్న టెలిఫోన్ వైపు చూశాడు. కిందకు దిగి రిసీవర్ని అందుకున్నాడు.

"హలో, ఎవరు?"

"కలేల్కర్ గారా?"

"అవును కలేల్కర్నే" అన్నాడతను.

"నేను కామ్దార్ భవనం నుంచి మాట్లాడుతున్నాను. మీరు వెంటనే యిక్కడకు రండి" అందో కంఠం.

"ఏమైంది?"

"వెంటనే రండి" అందా కంఠం.

అటువైపున రిసీవర్ పెట్టేయబడింది.

కలేల్కర్ రిసీవర్ పెట్టేసి ఆలోచిస్తూ వుండిపోయాడు. ఏమై వుంటుంది?

లలిత సాయంత్రందాకా తనింట్లో కూర్చుని తన ఫ్లాట్ కు వెళ్ళింది. గత నాలుగు మాసాల నుంచీ లలిత జీవితం ఆనందంగా సాగిపోతోంది.

ఏమై వుంటుంది? సాగర్ కి ఒంట్లో బాగాలేదేమో!

కలేల్కర్ దుస్తులు మార్చుకున్నాడు. అతడి భార్య నిద్రపోతోంది. ఆమె నతను లేపలేదు.

అతడు బయటకు నడిచాడు. ముందు తలుపును మూసి అతడు తాళం వేశాడు. కిందకు వెళ్ళాడు. తన కారును వేగంగా కామ్దార్ భవనం వైపు పోనిచ్చాడు.

కామ్దార్ భవనంలోని లైట్లన్నీ వెల్గుతున్నాయి. ఎంత మందో భవనంముందు గుమిగూడారు. కారులోంచి దిగిన కలేల్కర్ టైమ్ చూశాడు. పదిన్నర అయింది.

పోలీసులు యిటూ అటూ తిరుగుతున్నారు.

"ఏమైంది?" కలేల్కర్ అడిగాడు.

"ఎవరో కిందపడ్డారు?" అన్నాడొక కాన్ స్టేబుల్.

"ఎవరు పడ్డారు?"

"పేరు తెలియదు" అని కానిస్టేబుల్ పరుగెత్తాడు.

ఒక గుంపు మధ్యకు దూరాడు కలేల్కర్.

"ఏమైంది?"

"పైనుంచి కింద యెవరో పడ్డారు."

"కిందపడిన వ్యక్తి ఎక్కడ?"

"హాస్పిటల్ కి తీసుకుపోయారు."

కలేల్కర్ పిచ్చిగా లిఫ్ట్ లో పైకి వెళ్ళాడు. నాలుగో అంతస్థులోని సాగర్ ఫ్లాట్ ముందుకు వెళ్ళాడు. ముందు తలుపు తెర్చివుంది.

ఇన్ స్పెక్టర్ దివాకర్ అతడి వైపు సూటిగా చూశాడు.

"ఎవరు మీరు?" అడిగాడు ఇన్స్పెక్టర్.

"లలిత తండ్రిని, నా పేరు కరేల్కర్."

"కూర్చోండి" అన్నాడు యిన్స్పెక్టర్.

"వాళ్ళు ఏరి?"

"నానావతీ హాస్పిటల్లో వున్నారు."

"ఇన్స్పెక్టర్, యేమైంది?"

"లలిత బాల్కనీలోంచి కిందపడింది. ఆమె భర్త అది చూసి స్పృహతప్పి పడిపోయాడు."

"లలిత యే స్థితిలో వుంది?"

"జీవం లేనిస్థితిలో" అన్నాడు ఇన్స్పెక్టర్.

కాన్స్టేబుల్తో ఒక యువకుడు లోపలకు వచ్చాడు.

"ఇన్స్పెక్టర్, మీతో రహస్యంగా మాట్లాడాలి" అన్నాడతను.

ఇన్స్పెక్టర్ అతడిని లోపలి గదిలోకి తీసుకువెళ్ళాడు.

"ఎవరు నువ్వు?" అడిగాడు యిన్స్పెక్టర్.

"నా పేరు దేశాయి. ఎదురుగా వున్న భవనంలో నాలుగో అంతస్థులో నా ఫ్లాట్ వుంది. నా ఫ్లాట్ ఈ ఫ్లాట్కి ఎదురుగా వుంటుంది."

"నాతో ఏం చెప్పాలి?"

"నా భార్య మీతో చెప్తుంది."

"ఆమె నీతో చెప్పలేదా?"

"లేదు."

ఇన్స్పెక్టర్ దివాకర్ హాల్లోకొచ్చాడు. కరేల్కర్ అక్కడ కూర్చుని యేడుస్తున్నాడు. ఒక కాన్స్టేబుల్ని అక్కడ వుండమన్నాడు దివాకర్.

"మిస్టర్ దేశాయి. నీ ఫ్లాట్కి వెళ్దాం పద" అన్నాడు ఇన్స్పెక్టర్ దివాకర్.

# 12

హాల్లోని లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి. పన్నెండు అయింది.

ఒక కాన్‌స్టేబుల్ సాగర్‌ని తీసుకువచ్చి సోఫాలో పడుకోబెట్టాడు. ఇన్‌స్పెక్టర్ దివాకర్ అతడిముందుకు నడిచాడు.

"మిష్టర్ సాగర్, ఎలా వున్నారు?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"బెటర్" అన్నాడు సాగర్ నీరసంగా.

కరేల్కర్ అతడి ముందుకు వెళ్ళాడు. అతడిని కాగ లించుకొని సాగర్ యేడ్వసాగాడు.

ఇన్‌స్పెక్టర్ దివాకర్ సూటిగా సాగర్ వంక చూశాడు.

"ఇక్కడ మా పని పూర్తయింది. మేం వెళ్తున్నాం. మళ్ళా రేపు వస్తాను. ఈ ఫ్లాట్ వదిలి మీరు ఎక్కడకూ వెళ్ళొద్దు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఎక్కడికెళ్తాను, ఇన్‌స్పెక్టర్?" అన్నాడు సాగర్ యేడుస్తూ.

ఇన్‌స్పెక్టర్ దివాకర్, కాన్‌స్టేబుల్స్ బయటకు నడిచారు.

"సాగర్ ఏం జరిగింది?" అడిగాడు కరేల్కర్.

"నేను చెప్పలేను! ప్లీజ్ నన్నడక్కండి!" అరిచాడు సాగర్.

టెలిఫోన్ మ్రోగింది. మెల్లిగా వెళ్ళి సాగర్ రిసీవర్ని అందుకున్నాడు.

"హాలో, సాగర్" అన్నాడు.

అటువైపు వ్యక్తి యేదో చెప్తున్నాడు. సాగర్

మౌనంగా వింటున్నాడు.

రిసీవర్ని పెట్టేసి సాగర్ కర్లేల్కర్ వంక చూశాడు.

"మీరు యిక్కడే వుండండి. నేను కిందకు వెళ్ళి సిగరెట్ పాకెట్లు కొని తెస్తాను" అని సాగర్ బయటకు నడిచాడు.

*　　　*　　　*

నడవలో ఎవ్వరూ లేరు. అతడు తలుపుమీద మెల్లగా తట్టాడు. కాసేపట్లో తలుపు తెరవబడింది. సందులోంచి ఒక యువతి అతడివైపు చూసింది.

"ఆయన యింట్లో లేరు. రాత్రి షిఫ్టుమీద పనికి వెళ్ళారు. పొద్దుటే రండి" అందామె.

"మీతో మాట్లాడాలి. అందుకు మీ భర్త లేని సమయమే మంచిది. మీకు నా మూలంగా బాగా లాభిస్తుంది."

"ఎలా?"

"మీరు ఫోన్లో మాట్లాడింది నాతోనే. మీకెంత కావలసివా యిస్తాను."

"డబ్బు తెచ్చారా?"

"తెచ్చాను."

"నాకు భయంగా వుంది" అందామె.

అతడు నవ్వాడు.

"మనం చేసేది వ్యాపారం. భయపడవలసిన అవసరం లేదు."

ఆమె తలుపు తెర్చింది.

"మిమ్మల్ని నమ్ముతున్నాను, లోపలకు రండి" అందామె.

అతడు లోపలకు వెళ్ళాడు. వీపుతో తలుపును మూశాడు.

హాల్లో లైటు వెల్గుతోంది. ఆమె చేతిలో పిస్టల్ మెరుస్తోంది.

"ఈ పిస్టల్ని నమ్మి మిమ్మల్ని లోపలకు రానిచ్చాను" అందామె.

"మీరు ఏం చూశారు?"

"అంతా" అందామె.

"మీకెంత కావాలి?"

"నేను బ్లాక్ మెయిలర్ను కాను. కాని నాకు డబ్బు అవసరం వుంది. లక్ష రూపాయలు ఇస్తే నేను చూసింది మర్చిపోతాను" అందామె.

"డబ్బు కోసం మళ్ళా జ్ఞాపకం వస్తుందేమో!"

"అలా రాదు. ఒక్కసారిస్తే చాలు."

"మీకు లక్షా యిస్తాను. వారం రోజులు గడువు కావాలి" అన్నాడతను.

"వారంరోజుల్లోపల డబ్బు నాకు అందాలి. లేకపోతే మీరు ప్రమాదంలో పడ్తారు" అందామె.

"పడను. లక్షా మీకిస్తాను."

"వెళ్ళండి" అందామె.

అతడు వెనక్కి తిరిగాడు. తలుపువైపు అడుగులు వేశాడు.

"మిస్టర్ సాగర్!" అందో గంభీర కంఠం.

అతడు వెనక్కి తిరిగి చూశాడు.

ఆమె పక్కన ఇన్స్పెక్టర్ దివాకర్, కానిస్టేబుల్సు భర్త దేశాయి నిలబడి వున్నారు.

"సాగర్, నువ్వు ఇక్కడకు వస్తావని నాకు తెలుసు. ఆ ఫోన్ కాల్ నీకు నేనే చేయించి, యిక్కడ నీకోసం సిద్ధంగా వున్నాను. నీ భార్యను బాల్కనీలో ముద్దెట్టుకున్నావు. సరసాలాడుతూ లలితను కిందకు తోసేశావు! అదంతా చూసిన యీ మెను చంపాలని యిక్కడికొచ్చావు!" అరిచాడు యిన్‌స్పెక్టర్ దివాకర్.

తటాలున తలుపు తెర్చి సాగర్ బయటకు పరుగెత్తాడు. ఇన్‌స్పెక్టర్ దివాకర్ వెనకనే తూసుకెళ్లాడు. లిఫ్ట్‌లో యెక్కేలోపల దివాకర్ చేతులు సాగర్‌ని బలంగా చుట్టేశాయి.

దివాకర్ అతడి చేతులకు బేడీలు వేశాడు.

• • •

దినపత్రికను చదువుతున్న వెంకట్రామయ్య అమాంతంగా సోఫాలోంచి కిందకు దొర్లిపడ్డాడు.

"ఏమైందండీ?" అడిగింది కమల.

"ఆ సాగర్‌గాడిని బొంబే పోలీసులు అరస్టుచేశారే. తన భార్య లలితను వాడు బాల్కనీలోంచి కిందకుతోసి చంపేశాడట. ఇదేవిధంగా ప్రేమ, రుక్మిణి, భామ, శ్రీమతి, సావిత్రి, రమ అనే యువతులను పెళ్ళాడి, బాల్కనీలనుంచి కిందకు తోసి చంపినట్లు ఒప్పుకున్నాడు డర్టీ రాస్కెల్!"

"మన రమను వాడే చేతులారా కిందకు తోసి చంపాడన్నమాట!" అంది కమల.

"అంతా చేసింది ఆ దుర్మార్గుడే! ప్రేమ నటిస్తూ పెళ్ళాలను చంపాడు! వాడు యెందరొన్నో పెళ్ళాడాడు'

అందర్నీ చంపేశాడు! ఇప్పుడు పట్టుబడిపోయాడు పోలీసులకు" అన్నాడు వెంకట్రామయ్య.

"ఇంతమందిని పొట్టబెట్టుకున్న ఆ రాక్షసుడు ఎప్పుడో అప్పుడు పోలీసులకు చిక్కకలడిందేగా" అంది కమల.

"డర్టీ డెవిల్!" అన్నాడు వెంకట్రామయ్య కోపంగా.

—: అయిపోయింది :—

సీరియల్



ప్రతాప రవిశంకర్

(గత సంచిక తరువాయి)

వెంటనే హెలికాప్టర్ దిశ మారి వెనక్కు మళ్ళింది. సగం దూరం వచ్చిన తర్వాత అనంత్ సూచించిన దిశగా బయల్దేరింది.

పది నిమిషాలు గడిచేసరికి దూరంగా యేదో దీవి ఉన్నట్టుగా తోచింది.

కొంచెం ముందుకు వెళ్ళేసరికి భారత్ సంతోషంతో అరిచాడు. అతడు ఆ సముద్ర తీరాన్ని—తీరం వెంబడే ఉన్న పొట్టి చెట్లను గుర్తించాడు. వాటి వెనుకనే కన పడుతున్న పొడుగాటి చెట్లు.

అనంత్ ప్రశ్నించాడు—

"అదేనా టకారా?"

"అవును."

సముద్రతీరాన్ని దాటి దీవిమీదకు వచ్చేసింది హెలి

కాప్టర్. బాగా ఎత్తుగా తీసుకెళ్ళమని చెప్పాడు భారత్ — పైలట్ తో.

ఇంకా పైకి లేచింది.

అంతక్రితం పదినిముషాల క్రితమే మేఘాల చాటునించి సూర్యుడు బయటకు వచ్చాడు.

ఇంకొంచెం ముందుకు వెళ్ళేసరికి వాళ్ళకు చెట్లపైగా ఎర్రటి దివ్యమైన తేజస్సు కనపడింది.

ఆ తేజస్సును చూస్తూనే ప్రొఫెసర్ అనంత్ తో పాటు పైలట్ కూడా ఆశ్చర్యపోయాడు. భారత్ ఆశ్చర్యపడలేదు. ఆ అద్భుతమైన తేజస్సు యేమిటో అతడికి తెలుసు.

ఆ తేజస్సును చూస్తూనే అతడి శరీరం పులకించి పోయింది.

"ఏమిటా తేజస్సు?!" విస్మయంగా అడిగాడు అనంత్.

భారత్ ఆ తేజస్సు యేమిటో అనంత్ కు చెప్పలేదు. మౌనం వహించాడు.

గూడెంమీదికి వచ్చేసింది హెలికాప్టర్.

కొంతమంది టకారాలు నడుస్తూ కనిపించారు పైనించి. తర్వాత కపాచీదేవత విగ్రహం, ఆ విగ్రహం మెళ్ళో వున్న హారంలోని కోట్ల రూపాయల విలువచేసే మణి కనిపించాయి.

కొంతమంది టకారాలు తలలు పైకెత్తి పైన యెక్కడో ఎగురుతున్న హెలికాప్టర్ ని వింతగా చూశారు.

విగ్రహానికి మణి వున్నదనీ, దానినించే ఆ దివ్యమైన తేజస్సు వస్తోందనీ ప్రొఫెసర్ అనంత్ కు తెలియదు. అసలు

అలాంటి అద్భుతమైన కాంతులను విరజిమ్మే మణి వుంటుందనే ఆలోచన అనంత్‌కు రాలేదు.

వెనక్కు మళ్ళించాడు హెలికాప్టర్ని—భారత్.

కింద కనపడుతున్న యిళ్ళను చూపిస్తూ వాటి గురించి అనంత్‌కు వివరించాడు భారత్.

"ఇంతకీ ఆ అద్భుతమైన ఎర్రటి కాంతి యేమిటి? ఆ విగ్రహం దగ్గర్నించి వస్తోంది?" అడిగాడు అనంత్—భారత్‌ని.

ఆ మణి గురించి యిక అతనితో చెప్పక తప్పదనుకున్నాడు భారత్.... అవును. అందుకు యిదే తగిన సమయం.

టకారా దీవిని గుర్తించిన హెలికాప్టర్ వెనక్కు తిరిగి వెళ్ళిపోయేటప్పుడు భారత్ కోట్ల రూపాయల విలువచేసే ఆ మణి వెదజల్లుతున్నదే ఆ దివ్యమైన తేజస్సు అంటూ, అనంత్‌తో తన టకారాదీవి ప్రయాణంలోని అంతర్యాన్ని అతనికి చెప్పటం మొదలుపెట్టాడు.

* * *

ఎదురుచూసిన టకారాదీవి ప్రయాణం మొదలయ్యింది-పడవలో అంతా బయల్దేరారు.

హెలికాప్టర్‌లోనే వెళదామని అన్నాడు రంజిత్. కాని భారత్ అందుకు ఒప్పుకోలేదు. హెలికాప్టర్ దీవిలో దిగటాన్ని ఎవరైనా గమనిస్తే మన ప్రయాణం అంతా వృధా అవుతుందని అన్నాడు భారత్.

అతని ఆలోచన అందరికీ నిజమే అనిపించింది. పైగా అక్కడికి టకారాదీవి మరీ యెక్కువ దూరంలో లేదు.

దొర పెద్ద పడవను సిద్ధంచేసి దాన్ని నడపటానికి ఇద్దరు మనుషులను కూడా ఇచ్చాడు.

పడవ సముద్రంలో బయల్దేరింది.

భారత్ కు చెప్పలేనంత సంతోషంగా వుంది. తన ధ్యేయం యిప్పటికి నెరవేరబోతోంది. అనంత్ తో ఆ మణి గురించి, అందుకోసమే తను టకారా దీవికి ప్రయాణమవటం గురించి చెప్పగానే ఆశ్చర్యపోయాడు. తర్వాత ఆ మణి విలువ గురించి ఒక ఒప్పందం ఇద్దరిమధ్య కుదిరింది.

రంజిత్ మణి గురించి జాన్సన్ తో రహస్యంగా చెప్పాడు. అతనికి ఎంత డబ్బు ముట్టచెప్పేది కూడా చెప్పేశాడు భారత్ చెప్పినట్టుగా—

ఇప్పటికి ముహూర్తం కుదిరింది.

తను కన్న కలలన్నీ నిజమవబోతున్నాయి.

భారత్ కి గాల్లో తేలిపోతున్నట్టుగా వుంది.

వాలు గాలికి పడవ వేగంగా వెళుతోంది-సాబూజా దీవి మనుషులు తెడ్లు వేస్తూ దాన్ని నడుపుతున్నారు.

టకారా దీవికేసి దూసుకు వెళుతోంది పడవ. ఇప్పుడు పడవలో ప్రయాణిస్తున్న అందరికీ తెలుసు కోట్ల రూపాయల విలువచేసే ఆ మణి గురించి.

చూడనివాళ్ళు ఆ మణిని చూడాలని ఉత్సాహపడుతున్నారు. చూసినవాళ్ళు దాన్ని చేజిక్కించుకోవాలని పగటికలలు కంటున్నారు.

వీళ్ళందరి ఆలోచనలతో సంబంధం లేనట్టు నిశ్శబ్దంగా నీటిమీద జారిపోతోంది పడవ.

• • •

టకారాదీవిని పడవ చేరేసరికి సాయంత్రమయ్యింది. ఇంకొంచెం సేపట్లో నే చీకటి పడబోయేలా వుంది.

పడవను ఒడ్డుకులాగి యిసుకలో కొయ్యను పాతి

తాళ్లతో కట్టేశారు—సాబూజాదీవి మనుషులు.

వాళ్ళిద్దర్నీ అక్కడే వుండమని చెప్పి మిగిలినవాళ్ళు చెట్లలోకి వెళ్ళిపోయారు. జాన్సన్ చేతిలో ఆయుధాలు వున్న తోలుపెట్టె వుంది. అందులో కత్తులు—తుపాకులు వున్నాయి.

తెప్పలను తయారుచేసిన చోటుకు వచ్చారు అంతా. తాము తయారుచేసిన తెప్పలను వాళ్ళందరికీ చూపించారు భారత్—స్టెల్లాలు.

ఒక్కసారిగా అమావాస్య రోజు రాత్రి మిగిలిన మనుషులంతా మాయమైపోవటం గుర్తొచ్చి బాధ కలిగింది.

వాళ్ళంతా చెట్ల దగ్గరకు వెళ్ళి ఒక చోట నిల్చుని తమ పథకం గురించి మాట్లాడుకుంటున్నారు.

భారత్ అందరికీ వివరించి చెబుతున్నాడు.

ఆ కపాలీదేవత విగ్రహం గురించీ ఎవరెవరు ఎక్కడ నిలుచోవలసిందీ చెబుతున్నాడు.

ఉన్నట్టుండి చెట్లచాటున యేదో అలికిడి వినిపించింది! అంతా గబుక్కున తలలు తిప్పి చూశారు.

అక్కడికి దగ్గర్లోనే చెట్టుపక్కనే ఓ టకారాజాతి మనిషి బల్లెంతో నిలబడి వాళ్ళ చర్యలను గమనిస్తున్నాడు.

ఉలిక్కిపడ్డారు.

ముందుగా రంజిత్ తేరుకొని వాణ్ణి పట్టుకోటానికి ముందుకు పరుగుతీశాడు. వెంటనే కాలికి యేదో తీగ లాంటిది అడ్డుపడి ముందుకు పడ్డాడు.

కాని అప్పటికే జాన్సన్ రివ్వున ముందుకు పరు

గత్తాడు.

పరుగుదీశాడు టకారా మనిషి.

జాన్సన్ వదల్లేదు. అంతా ముందుకు పరుగుతీశారు.

"వాడ్ని వదలకు జాన్సన్ .... చంపు.... లేకపోతే మన ప్రయాస అంతా వృధా అవుతుంది" అరిచాడు భారత్.

ఆ మనిషి ఉన్నట్టుండి వెనక్కు తిరిగి చేతిలో వున్న బల్లేన్ని జాన్సన్ మీదకు విసిరాడు. జాన్సన్ పక్కకు తప్పుకున్నాడు తెలివిగా—

వెంటనే అతను జాన్సన్ మీదకు వచ్చాడు. జాన్సన్ యెగిరి యెదురుగా వస్తున్న వాడి గుండెలమీద తన్నాడు వాడు కింద పడ్డాడు ఆ అదురుకు. పడటంతో బల్లెం దగ్గరగా పడిపోయాడు. దాన్ని అందుకోబోయాడు లేస్తూనే.

సెల్టా అతని ప్రయత్నాన్ని గ్రహిస్తూనే ఎగిరి అక్కడకు దూకి బల్లేన్ని అందుకొని పైకి లేవబోతున్న టకారాజాతి మనిషి గుండెల్లో బలంగా పొడిచింది.

దిగిపోయింది బల్లెం!

భయంకరంగా ఆర్తనాదం చేశాడు. చేస్తూనే వెనక్కు విరుచుకుపడిపోయాడు కట్టెలా.

బల్లేన్ని తీసి కసిగా ఒకటికి నాలుగుసార్లు వాడి శరీరమంతా పొడిచింది సెల్టా. టకారాజాతిమీద తనకు వున్న కసినంతా దొరికిన వాడిమీద నే చూపించింది.

వాడి శవాన్ని అక్కడే వదిలారు.

"ఒకసారి చీకటి పడకముందే కత్తుల చెట్ల మధ్యగా యేవైనా క్రూరజంతువులు వున్నాయేమో చూసివద్దాం" అన్నాడు భారత్.

సరేనన్నారు మిగిలినవాళ్ళంతా.

"నేను నడవలేను వెంటనే. కాలు నొప్పిగా వుంది. కొంచెంసేపు రెస్టు తీసుకోవాలి" అన్నాడు రంజిత్.

"నువ్వొక్కడివే యిక్కడ వుండగలవా?" అడిగాడు భారత్.

"ఉండలేను. అసలే కాలు నొప్పిగా వుంది. చిన్న జంతువు వచ్చినా ఈ నొప్పితో ఎదుర్కోలేను."

"ఐతే నీకు తోడుగా యెవరు వుంటారు?"

"ఎవరో ఒకరు"

"ఐతే స్టెల్లా—లీల వుంటారు."

"నేను వుండను. నేను కూడా మీతోనే వస్తాను" అన్నది లీల అనంత్‌తో.

"స్టెల్లా! మేము వెంటనే వచ్చేస్తాం! రంజిత్‌కు తోడుగా నువ్వుండు" అన్నాడు భారత్.

స్టెల్లా తల వూపింది.

తోలుపెట్టెలోనించి అంతా ఆయుధాలు తీసుకుని అక్కడినించి బయలుదేరారు.

రంజిత్‌కు ముందుగా కూర్చునివుంది స్టెల్లా.

ముందుగా వెళుతున్నవాళ్ళు చెట్ల మధ్యగా వున్న దారిలో నడిచి వెళుతున్నారు. వాళ్ళు కొంచెం దూరమైన తర్వాత అడిగాడు రంజిత్—

"స్టెల్లా నువ్వు భారత్‌తో మా దేశానికి యెందుకొచ్చావు?"

ఆశ్చర్యంగా అతణ్ని చూసింది.

తర్వాత ఇలా చెప్పింది:

"భారత్‌ను ప్రేమించాను. అతడి ప్రేమ కోసం ఈ దేశానికి వచ్చాను."

నవ్వేడతను—"నేను నమ్మను! అతను కోటీశ్వరుడని

అతని ఆస్తిని ప్రేమించి వచ్చావు కదూ!"

ఉలిక్కిపడి అంతలోనే "ఫూల్‌లా మాట్లాడకు రంజిత్. నేను మంచిదాన్ని కాదు" అన్నది.

రంజిత్ కూడా నవ్వాడు.

"సరే.... నువ్వెలాంటిదానివైనా నా మనసులో ఇన్ని రోజులుగా వున్న మాటను చెబుతాను. మొదటి చూపులోనే నన్నాకర్షించావు. నిన్ను నేను ప్రేమించాను. నువ్వు ఒప్పుకుంటే భారత్‌తోపాటుగా మిగిలినవాళ్ళని కూడా చంపి కోట్లు ఖరీదుచేసే మణితో...."

అతడి మాటలు పూర్తిఅవకముందే స్ప్రింగ్‌లా ప్రళయకాళిలా యెగిరి అతడి మొహం మీద శక్తి కొద్దీ తన్నింది.

రంజిత్ వెనక్కి పడ్డాడు. పడుతూనే జేబులోనించి రివాల్వర్ బయటకు తియ్యబోయాడు. కాని అతడి చర్యను గమనిస్తూనే రెండు గుండెల మధ్య వక్షంలో దాచుకున్న రివాల్వర్‌ను బయటకు లాగి అతను వూహించనంత వేగంగా రెండుసార్లు అతనికేసి కాల్చింది.

"ఢాం.... ఢాం!"

నెత్తురు మడుగులో పడిపోయాడు రంజిత్.

* * *

కత్తుల చెట్లమధ్య నడుస్తున్న ఎళ్ళంతా వెనక్కి మళ్ళారు—ఉలిక్కిపడుతూ.

"ఏదో జంతువో లేక టకారాజాతి మనిషో ఎటాక్ చేసివుంటాడు. అందుకే యిద్దర్లో యెవరో రివాల్వర్ పేల్చారు. పదండి వెనక్కి...." అన్నాడు భారత్ కంగారుగా.

గబగబా నడిచి అక్కడకు వచ్చిన వాళ్ళందరికీ

రివాల్వర్ పట్టుకొని యెర్రబడిన కళ్ళతో నిల్చున్న స్టెల్లా, నెత్తురు మడుగులో పడివున్న రంజిత్ కనిపించారు.

ఆ దృశ్యం చూడటంతోనే అంతా కొయ్యబారి పోయారు.

భారత్‌ను చూడటంతోనే ఒక్కసారి విసురుగా పరిగెత్తుకువచ్చి అతని గుండెలమీద పడిపోయింది స్టెల్లా.

"ఏం జరిగింది స్టెల్లా?"

ఆమె కళ్ళలో మొదటిసారిగా భారత్ కన్నీళ్ళను చూశాడు.

ఆమె జరిగిందంతా చెప్పేసింది

అంతా విని భారత్ బాధపడలేదు. టకారాదీవిలో తిరిగే నీలిరంగు పాము కంటే—నికోలాయ్ దీవుల్లో తిరిగే యెర్ర తోదేలు కంటే ప్రమాదకరమైన అలాంటి నీచుడు చనిపోయినందుకు భారత్ కొంచెంకూడా విచారపడలేదు.

అప్పటికప్పుడే సముద్రతీరంలో గోతిని తవ్వి అందులో రంజిత్ శవాన్ని పూడ్చిపెట్టారు.

అప్పటికి చీకటిపడిపోయింది.

* * *

గూడెంలో సందడి సద్దుమణిగిన తర్వాత—టకారా జాతి మనుషులంతా తలుపులు బిగించుకుని ఇళ్ళలో పడుకుని నిద్రపోతూ వుంటారని నిర్ధారణ చేసుకున్న తర్వాత వాళ్ళంతా చీకట్లో జాగ్రత్తగా దయ్యాల్లా నడుస్తూ కపాలీదేవత విగ్రహం దగ్గరకు చేరుకున్నారు.

చెట్ల మధ్యనించి నడుస్తున్నప్పుడే వాళ్ళకు ఆ మణి యెర్రని కాంతులు కనిపించాయి. వాళ్ళు ఆశ్చర్యంతో

చూశారు.

విగ్రహం ముందు ఇళ్ళ ఎదురుగా వున్న గుంజలకు కాగడాలు వెలుగుతున్నాయి.

అంతా నిశ్శబ్దంగా వుంది!

ఆ విగ్రహాన్ని చూడటంతోనే భయంతో లీల కెవ్వున అరవబోయింది. ఆమె ప్రయత్నాన్ని గ్రహించిన ప్రొఫెసర్ అనంత్ అరిచేత్తో ఆమె నోరును మూసేశాడు.

బయల్దేరే ముందు భారత్ అందరికీ హెచ్చరికలు చెయ్యనే చేశాడు__యెటువంటి పరిస్థితిలోనూ అరవకూడదని.

కాగడాల వెలుగులో వింత కాంతులను ప్రసరిస్తున్న మణిని వాళ్ళు చూశారు!

అటూ యిటూ చూసి మిగిలినవాళ్ళకు సైగ చేసి భారత్ దేవత విగ్రహం ముందున్న మెట్టుమీద కాలు వేశాడు. జాన్సన్ అతడిని అనుసరించాడు.

ఒక మెట్టు యెక్కే సరికే హఠాత్తుగా వెగటు వాసన అందరి ముక్కు పుటాలనూ తాకింది. ఆ వాసన గురించి తెలిసిన స్టెల్లా భారత్ అదిరిపడ్డారు. నీలిరంగు పాము కాలిని చుట్టుకున్నంతగా వణికిపోయారు.

భారత్ వెనక్కు తిరిగాడు.

అప్పటికే దేవత విగ్రహానికి పక్కగా వున్న ఇళ్ల వెనుకనించి టకారాలు బల్లేలు, వంకీ కత్తులతో వికృతంగా నవ్వుతూ బయటకొచ్చారు!

షాక్ .... షాక్ .... షాక్.

కెవ్వున అరిచింది లీల షాక్‌తో!

టకారాలలో నాయకుడూ వున్నాడు. నాయకుడి

పక్కనే అంద్రూస్ కూడా వున్నాడు నవ్వుతూ—అతడి చేతిలో వంకీకర్ర వున్నది!

సెల్లా షాక్ నించి తేరుకోక ముందే "ఈ రోజు ఉదయం ఈ దీవిపైన హెలికాప్టర్ తిరిగినప్పుడే ఈ రాత్రికి మీరు యిక్కడికి మణికోసం తిరిగివస్తారని ఊహించాను. అందుకే మేమంతా యిక్కడ దాక్కుని మీ కోసం యెదురుచూస్తున్నాం! పోయినసారి ఎలాగో మీరిద్దరూ ప్రాణాలతో తప్పించుకుని వెళ్ళగలిగారు. కాని కోట్లు విలువచేసే ఈ మణికోసం వ్యామోహంలో తిరిగివచ్చారు. ఆ వ్యామోహమే యిప్పుడు మీ ప్రాణాలను బలిగొనబోతోంది. ఈసారి ఒక్కరు కూడా ప్రాణాలతో ఈ దీవినించి తప్పించుకోలేరు" అన్నాడు అంద్రూస్ నవ్వుతూనే.

అతడి మాటలు పూర్తి అవకముందే "పారిపొండి" అని అరిచాడు భారత్ వూహించనంత వేగంగా కపాలీ దేవత విగ్రహం వెనక్కి పరుగుదీస్తూ.

అంతే.

జాన్సన్—సెల్లా తుపాకులు పేలుస్తూనే అక్కడినించి చెట్లవైపుకు పరుగుతీశారు!

ఒక తుపాకిగుండు టకారాజాతి మనిషి గుండెల్లో దిగబడి వాడు పెద్దగా అరుస్తూ కూలిపోయాడు.

నాయకుడు బిగ్గరగా అరిచాడు కిచకిచల భాషలో!

అంద్రూస్ వంకీకర్ర సాయంతో నడుస్తూ గబగబా దేవత విగ్రహం వెనకవైపుకు వచ్చాడు. అంద్రూస్ అక్కడికి వస్తాడని వూహించకపోయినా చీకటిగా వుందని, టకారాలు యింకో దిక్కుకు వెళ్ళగానే పారిపోవచ్చుననీ అక్కడ దాక్కుని వున్నాడు భారత్ రివా

ల్వర్ పట్టుకుని.

అటువైపుగా వచ్చిన ఆంద్రూస్‌ను విగ్రహం చాటుకు లాగుతూనే ఒక చేత్తో అరవకుండా నోరు మూశాడు! గింజుకున్నాడు ఆంద్రూస్ భయంతో!!

"ఆంద్రూస్ ...! నువ్వో జిత్తులమారి నక్కవి. కాడిస్టువి! అసలు నీవల్లనే ఇదంతా జరిగింది! అమావాస్య రోజు రాత్రి మా పథకాన్ని నువ్వు చెడగొట్టకుండా వున్నట్లయితే ఈ మణితో అందరం సురక్షితంగా ఈ దీవి వదిలి వెళ్ళిపోయేవాళ్ళం ... కాని నాగరికుడివై వుండీ ఈ అనాగరికులతో చేతులు కలిపి మా వాళ్ళందర్నీ వూచ కోత కోయించావు. అందుకు ఫలితం అనుభవించు. నీ లాంటి గుంటనక్కలు బతికి వుండకూడదు" అంటూ ప్యాంటు జేబులోనించి కత్తి తీసి బలంగా అతడి గుండెల్లో ఒక్క పోటు పొడిచాడు.

మూలిగాడు ఆంద్రూస్.

ఒక్క పోటుకే ఆంద్రూస్ ప్రాణం గాల్లో కలిసి పోయింది.

వదిలేశాడు ఆంద్రూస్‌ను.

ఇళ్ళ వెనుకవైపుకు వచ్చాడు.

కొంతమంది టకారాలు—నాయకుడు విగ్రహం ఎదు రుగా నిలబడి వున్నారు.

చప్పుడు చెయ్యకుండా చీకట్లోకి పరుగుతీశాడు భారత్. అతడి చేతిలో రివాల్వర్ వుంది.

మరోవైపు—

మిగిలినవాళ్ళందరినీ టకారాలు వెంట తరమగానే పరుగుదీశారు వాళ్ళు ప్రాణభయంతో!

టకారాలు బల్లేలు విసురుతున్నారు!

లీల పరుగెత్తలేకపోయింది!

వెనుకపడింది. ఆమెకోసం ఒక్క నిముషం ఆగాడు ప్రొఫెసర్ అనంత్. అంతే. టకారా విసిరిన బల్లెం రివ్వునవచ్చి అతడి డొక్కలో దిగిపోయింది!

భయంకరంగా అరుస్తూ కూలిపోయాడు అనంత్. అప్పుడే అంతా అక్కడకు వచ్చేశారు టకారాలు. పిచ్చి పట్టినదానిలా అరిచింది లీల. ఆమె అరుపు పూర్తి అవకుండానే ఓ వంకీ కత్తి ఆమె తలను నరకేసింది! లీల తల వెళ్ళి దూరంగా పడిపోయింది.

ముందు పరిగెత్తుతున్న జాన్సన్ — స్టెల్లాలకు ఆ ఇద్దరి అరుపులూ వినిపించాయి. వాళ్ళు యేమైవుంటారో వూహించుకున్నారు. స్టెల్లా భారత్ గురించి ఆలోచిస్తోంది.

చీకట్లో దారి సరిగా తెలీటంలేదు.

పరిగెత్తుతున్న వాడల్లా జాన్సన్ చీకట్లో ఓ చెట్టును ఢీకొని కింద పడిపోయాడు! అతడికోసం ఆగదల్చుకోలేదు స్టెల్లా. ముందుకు పరుగుదీసింది.

జాన్సన్ లేవబోయాడు!

అప్పటికే టకారాజాతి మనుషులు అతడిని చుట్టుముట్టారు. చెట్టును ఢీకొనటంతో జాన్సన్ చేతిలోని తుపాకీ ఎగిరి ఎక్కడో పడిపోయింది!

ఒకడు జాన్సన్ చేతులు వెనక్కు విరిచి పట్టుకున్నాడు. రెండోవాడు బల్లేన్ని వెనక్కల్లా పోనిచ్చి విసురుగా తీసుకొచ్చి జాన్సన్ పొట్టలో దించేశాడు. హృదయవిదారకంగా అరిచాడు జాన్సన్.

ఆ అరుపు స్టెల్లాకు వినపడింది.

వెనుకనే వస్తున్న భారత్‌కు కూడా వినపడింది.

ఎండుటాకులమీద పరిగెత్తుతున్న షీలా ఆయాసంతో ఓ చెట్టును ఢీకొనబోయి ఆగిపోయి నిల్చుంది ఆ చెట్టును పట్టుకుని.

ఒకే ఒక్క నిముషం.

ఆ ఒక్క నిముషంలోనే ఆమె పాదం మీద చురుక్కుమంది. ఒక్కసారికాదు వెంటవెంటనే నాలుగు సార్లు.

ఆ తర్వాత ఎండుటాకులమీద సరసరాతో పాకుతున్న చప్పుడు వినిపించింది.

షీలా బిగుసుకుపోయింది. తన కాలిమీద నాలుగు సార్లు నీలిరంగు పాము కాటు వేసిందని తెలుసుకుంది. వెంటనే ఆమె పాదంమీదనించి నీలిరంగు పాము జరజరా పాకుతూ వెళ్ళటాన్ని ఆమె గ్రహించింది.

భయంతో బిగుసుకుపోయింది.

వెనకనించి టకారా మనుషులు పరిగెత్తుకు వస్తున్న చప్పుడు వినిపించింది! వాళ్ళకు దొరక్కూడదనుకుంటూ అక్కడినించి కదిలింది షీలా. కాని ఆమెకు అడుగులు ముందుకు పడలేదు. కళ్ళు తిరిగాయి! శరీరమంతా అదోలా అయిపోయింది. స్పృహ తప్పుతున్నట్టుగా అనిపించింది!

ఆమె తూలుతూ కింద పడబోతున్నప్పుడే ఓ బల్లెం రివ్వున వచ్చి ఆమె వెన్నులో దిగబడిపోయింది!

అంతే! షీలా అరవకుండానే కూలిపోయింది. ఎంతో ధైర్యసాహసాలు కలిగిన షీలా చివరకు ఆ దీవికి బలి అవక తప్పలేదు!

టకారాలు దగ్గరికొచ్చారు.

ఆమెను గుర్రించి కసితో ఆమె తలను నరికేశారు. భారత్ కోసం ముందుకు వెళ్ళారు.

వాళ్ళు వెళ్ళిన రెండు నిమిషాలకు భారత్ అక్కడికి వచ్చాడు. దార్లో పడివున్న శరీరం కాలికి తగిలి ఆమె మీద పడిపోయాడు. అలా పడినప్పుడే అతని ముఖం మీద రెండుసార్లు చురుక్కుమని యెవరో సూదితో పొడిచినట్లనిపించింది. ఆ తర్వాత యెండుటాకులమీద కొరడాతో కొడుతున్నట్లుగా అనిపించింది. జేబులో నించి టార్చ్ తీసి వెలిగించి చూశాడు.

నీలిరంగు పాము జర జర వెళ్ళిపోతోంది.

కొయ్యబారిపోయాడు భారత్.

ఎదురుగా—

తల తెగిపోయిన స్టెల్లా....

"స్టెల్లా" బిగ్గరగా అరిచాడు భారత్.

ఆ అరుపు ముందు ముందు వెళుతున్న టకారాజాతి మనుషులకు వినపడింది. వాళ్ళు రివ్వున వెనక్కి తిరిగారు.

ఏడుస్తున్నాడు భారత్-స్టెల్లా శరీరంమీదపడి.

"స్టెల్లా నన్ను క్షమించు. నువ్వు వద్దని ఎంతగా చెప్పినా కోట్ల విలువచేసే మణికోసం మళ్ళీ ఈ దీవికి తీసుకువచ్చాను. ఆంద్రూస్ చెప్పిన మాటలు నిజం. ఆ వ్యామోహమే మనందరినీ ఇలా దహించివేసింది. అంతే కాదు స్టెల్లా ప్రమాదంలో ఇరుక్కున్నప్పుడల్లా కరోన్ శాపం వెంటాడుతుందనుకున్నాను. ఆ ప్రమాదం నించి బయటపడగానే కరోన్ మనల్ని క్షమించిందనుకున్నాను. కాని కరోన్ మనల్ని క్షమించలేదు స్టెల్లా... కరోన్ శాపమే మనకీ శిక్షను విధించింది."

టకారాలు దగ్గరకు వస్తున్నారు.

ఐనా భారత్ అక్కడినించి పారిపోయే ప్రయత్నం చెయ్యలేదు. ఇంతమంది చావుకు కారకుడైన తను తప్ప

ఖండా చావాలి....

అతడికి కళ్ళు తిరుగుతున్నాయి. నీలిరంగు పాము విషం శరీరంలోకి ఎక్కుతోంది....

కళ్ళు మూతలుపడుతున్నాయి....

'క్షణోక్ ....నన్ను క్షమించు—' సరిగ్గా అప్పుడే టకారాజాతి మనిషి చేతిలోని వంకీ కత్తి భారత్ తలను నరికేసింది. తల ఎగిరి దూరంగా యెక్కడో పడింది.

టకారాలు తృప్తిగా గంతులు వేశాడు.

కాగడాల వెలుగులో టకారాలను కాపాడే కపాలీ దేవత హారంలో వున్న మణి దివ్యమైన కాంతులను విరజిమ్ముతోంది.

—:సమాప్తం:—

## క్రొత్త సీరియల్ ప్రారంభం!



• బొమ్మిడి అచ్చారావు

కన్నార్పకుండా ఆమెవంకే చూస్తున్నాడు నవీన్. ఆమె చాలా సామాన్యంగా అలంకరించుకున్నది. అయినా ఆ అలంకరణలోనే అనన్యమైన, అసాధారణమైన ప్రత్యేకత వుంది! అందం వుంది; అంతకుమించిన ఆకర్షణవుంది.

ఆమె తదేక దీక్షతో పుస్తకం చదువుతూనే వున్నది. ఆమె దృష్టి యిటు తిప్పితే తనివితీరా కళ్ళు కలపాలని, ఆమెతో పరిచయం చేసుకోవాలని అతని మనసు తహతహ లాడుతోంది.

కానీ, ఆమె కనికరించలేదు. శ్రద్ధగా పుస్తక పఠనంలో లీనమైపోయి చదువుతుంటోంది. నవీన్ కి ఆమెని పలకరించటానికి సరైన అవకాశం దొరకటం లేదు. తెల్లవార్లు ప్రయాణమే కదా! చూదాం, యింతలోనే ఆమె మధ్యలో యెక్కడా దిగిపోకుండా వుంటే అవకాశం దొరక్కపోదు! అసలు ఆమె ఎక్కడికి వెళ్తోందో?

నవీన్ ఆమెను విజయవాడ నుంచీ చూస్తున్నాడు. ఆమె ఖచ్చితంగా విజయవాడలోనే ఎక్కి వుండాలి!

అది మద్రాసు నుంచి న్యూఢిల్లీ పోయే దక్షిణ ఎక్స్‌ప్రెస్! కాజీపేటలో తమ బోగీలని హైదరాబాద్ నుంచి ఢిల్లీ పోయే దక్షిణ ఎక్స్‌ప్రెస్‌కు కలుపుతారు. అందుకే దీన్ని లింక్ ఎక్స్‌ప్రెస్ అని కూడా అంటారు.

తను విజయవాడలోనే ట్రెయిన్ ఎక్కాడు. అప్పటికే ఆమె కంపార్టుమెంట్లో వున్నది! అంటే, విజయవాడకి ముందునుంచీ ట్రెయిన్‌లోనే వుందేమో! మద్రాసు విజయవాడ మధ్యలో యే స్టేషన్‌లోనైనా యెక్కి వుండొచ్చు. ఏమో?! అయినా తనకు ఆమె గురించిన ఆలోచనలు యెందుకిలా ముసురుకుంటున్నాయి?

కాలేజీలోను, యూనివర్సిటీలోను తను యెంతోమంది అందమైన అమ్మాయిల్ని చూశాడు. మాట్లాడాడు. స్టూడెంట్ యూనియన్ తరఫున ఎంతోమంది అమ్మాయిలతో కలిసి పని చేశాడు. కాని, తన మనసు యెప్పుడూ చలించలేదు — యే అమ్మాయి కూడా తన మనసుకి దగ్గరగా రాలేదు. తనకి దగ్గరవుదామని ప్రయత్నించిన అమ్మాయిలు లేకపోలేదు. కాని, తనే ఆ 'దగ్గరతనాన్ని' దూరంగా వుంచాడు.

ఇప్పుడు, అకస్మాత్తుగా ట్రెయిన్‌లో కలిసిన యీ అమ్మాయి తన మనసులో చాలా చిత్రంగా స్థానం కల్పించుకున్నది. నిశ్చలంగా వున్న కొలనులో చిన్న రాయి వేస్తే నీరంతా యెలా చెదిరిపోతుందో, అదే విధంగా ఆమె దర్శనంతో తన మనసు చెల్లాచెదురయిపోయింది.

ఆమె యెవరో? ఆమెను చూసి తనెందుకిలా చలించి

పోతున్నాడు? తన మనసెందుకు అదుపు తప్పుతోంది? ఏమో, తనకే తెలియటంలేదు. ఆమెవైపు తదేకదీక్షతో చూడటం సంస్కారం కాదని, కంపార్టుమెంటులో వున్న తదితరులు తనని గమనిస్తూ వుండొచ్చునని, పెద్ద మనిషి తరహాగా లేదని అతనికి తెలుసు—కాని బలహీనతను జయించలేక పోతున్నాడు!

కాసేపు తను విజయవాడలో కొన్న మేగజైన్స్ తిరగేశాడు. దేనిమీదా యేకాగ్రత కుదరలేదు. చూపులు నిమిషానికి రెండుసార్లు ఆమెమీదనే నిలుస్తున్నాయి.

ఈ రెండుగంటల ప్రయాణంలోను రెండే రెండుసార్లు ఆమె తనవైపు చూసింది. అయితే ఆ చూపుల్లో ఆసక్తి లేదు! గుర్తింపులేదు. ఎలాంటి బలహీనత లేదు. మరేవిధమైన భావమూ లేదు. చాలా కాజువల్‌గా యథాలాపంగా చూసిందంతే! చూసిన క్షణంలోనే ఆమె చూపు మళ్ళించుకున్నది.

ఆమె బెర్తు సరాసరి తన కెదురుగా వున్నది! అదే నేమో తన బలహీనతకి కారణం! అది త్రీటైర్ స్లీపర్ కోచ్. రాత్రి తొమ్మిదిగంటల వరకు ముగ్గురు ప్రయాణీకులు కూచునే సీటు. ఆ తర్వాత బెర్తుగా మారిపోతుంది. మధ్య ఓ బెర్తు, పైన ఓ బెర్తు—మొత్తం మూడు బెర్తులు తయారవుతాయి. అదృష్టవశాత్తూ తనది క్రింది బెర్తే! ఆమెది ఖచ్చితంగా క్రింది బెర్తే అయి వుంటుంది. ఆడవాళ్ళకి కింది బెర్తులే కేటాయిస్తారని తనకు తెలుసు!

ఆమె ప్రయాణం ఢిల్లీవరకో కాదో తనకు తెలీదుగాని, ఆమె తెల్లారేవరకు అదే ట్రెయినులో ప్రయాణిస్తుందని ఖచ్చితంగా చెప్పగలడు. త్రీటయిర్ కోచ్‌లో

రాత్రంతా ప్రయాణం చేసే వాళ్ళే బెర్తు తీసుకొం
టారు!

కాని, యేం ప్రయోజనం? ఇప్పట్నుంచి అందరు బెర్తులు అరేంజి చేసేసుకుంటున్నారు—అలాగే, ఆమె కూడా పదయ్యేసరికి నిద్రపోతుంది. తెల్లారేసరికి దిగిపోయినా ఆశ్చర్యంలేదు! తను యెప్పుడామెతో పరిచయం చేసుకుంటాడు? ఆమె గురించి ఎలా తెలుసుకోగలుగుతాడు? ఆమె చూడబోతే ఒక్కతే ప్రయాణం చేస్తున్నట్టుంది! ఆమెతో ఎవరూ కనిపించలేదు.

ట్రెయిన్ వరంగల్లో ఆగింది—అప్పటికే దాదాపు కంపార్టుమెంటులోని వాళ్ళంతా బెర్తులు సర్దేసుకున్నారు. తను కూచోవటాని కవకాశంలేదు—మధ్య బెర్తు అడ్డొస్తోంది.

తప్పనిసరిగా కాంప్ కాట్ కింది బెర్తుమీద పరుచుకుని కిటికీమీదికి తల పెట్టుకుని నడుం సగంవరకు మాత్రమే బెర్తుమీదికి చేర్చి ఆమెవంకే చూస్తున్నాడు. పూర్తిగా నడుం వాలుస్తే నిద్రొచ్చే ప్రమాదముంది!

ఈ మధురస్వప్నం కనీసం కొన్ని గంటలైనా అనుభవించాలి. ఆ తర్వాత ఆమె ఎవరో, తనెవరో!

నవీన్ మనసు స్థిరత్వాన్ని కోల్పోయి మూడు గంటలయింది. ట్రెయిన్ కాజీపేట చేరుకున్నది. అప్పటివరకు ఆమె కాళ్ళనుంచి గుండెలదాకా దుప్పటి కప్పుకొని అలవోకగా బెర్తుమీద పడుకొని యేదో చదువుతూనే వున్నది.

రాత్రి పదకొండు గంటలయింది.

కాజీపేట స్టేషన్లో అరటిపళ్ళ బండివాడు తను కంపార్టుమెంటుకి కొంచెం అవతలగా పిలుస్తూ వెళ్ళిపోతు

న్నాడు.

ఆమె కిటికీలోనించి ప్లాట్ ఫాంమీదికి చూసి పళ్ళ వాడిని పిలిచింది. వాడు వినిపించుకోలేదో యేమో, రాలేదు. నవీన్ కి అవకాశం వచ్చింది.

ఆమె వంక చిన్నగా నవ్వుతూ చూసి, "నేను తీసుకొస్తా నుండండి!" అంటూ ఆమె సమాధానం కోసం యెదురుచూడకుండా ప్లాట్ ఫాం మీదికి దూసుకుపోయాడు.

పదినిమిషాల తర్వాత ఓ డజను పచ్చ అరటిపళ్ళు, రెండు బ్రిటానియా నైస్ బిస్కట్ పాకెట్లు తీసుకొని వచ్చాడు నవీన్.

"అయ్యో, మీకెందుకండీ శ్రమ?" అన్నదామె నొచ్చుకుంటూ, అతనివైపు కృతజ్ఞతగా చూస్తూ. ఆమె ఆ చూపుకోసం కొన్ని కోట్లు ఖర్చుపెట్టినా ఫరవాలేదనిపించింది నవీన్ కి—ఆ క్షణంలో.

ఆమె పర్సు తెరచి పదిరూపాయల నోటు అతనికి అందించబోయింది. అతను దెబ్బతిన్నట్టు చూశాడు.

"సారీ, మీ చేత ఖర్చు పెట్టించినందుకు!" అన్నదామె పొడి పొడిగా.

"ఇట్సాల్ రైట్!" అన్నాడు పళ్ళు, బిస్కట్లు ఆమె ముందుకి తోస్తూ.

"ఇవన్నీ నాకేనా? మీరూ తీసుకోండి!"

ఆ మాత్రం పలకరింపుకే పులకరించిపోయాడు.

"నో, నో! నేను విజయవాడలో భోంచేసి ఎక్కాను! మీరు తీసుకోండి....అన్నట్టు మీరు భోంచేశారో లేదో, మీల్స్ వుందేమో చూసిరానా?" అన్నాడు వెళ్ళటానికి

తయారవుతూ.

"వద్దు, వద్దు. నేను ప్రయాణంలో రాత్రిళ్ళు భోం చెయ్యను" నవ్వింది. ఆమె నవ్వులో కోటి శరత్కాం తులు వెల్లివిరిశాయి. "నిద్రాసుందని!" అని పూర్తి చేసింది. ఆమె భావం అతని కర్థమైంది. ఒంటరిగా ప్రయాణం చేసేటపుడు, ముఖ్యంగా రాత్రిళ్లు అమ్మాయిలు జాగ్రత్తగా మేలుకుని వుండటం అవసరమే!

అతను ఆమె మొహమాట పడుతుందని తన బెర్తు మీదికి చేరి కిటికీలోనుంచి సీరియస్‌గా బయటకి చూడ సాగాడు. అంతలోనే యేదో గుర్తొచ్చి తన దగ్గరున్న సీసా తీసుకుని వెళ్ళి చల్లటి మంచినీళ్ళు పట్టితెచ్చి ఆమె పక్కన పెట్టాడు.

మరోసారి కృతజ్ఞతగా చూసిందామె.

ఈలోపల వాళ్ళు కూచున్న బోగీని విడదీసి, మరో యింజను అవతలి ప్లాట్‌ఫాంమీదికి తీసుకుపోయింది. హైదరాబాద్‌నించి వచ్చిన ట్రెయిన్‌కి తగిలిస్తారని తెలుసు నవీన్‌కి.

"అయితే, మీరు ప్రయాణంలో వున్నపుడు రాత్రిళ్లు నిద్ర పోరన్నమాట!" అన్నాడు మరో టాపిక్ యేదీ లేక.

ఆమె చిన్నగా నవ్వి తలూపింది. ఆమెతో యెన్నో మాట్లాడాలని వుంది. ఆమెతో యెన్నో యేళ్ళుగా పరి చయమున్నట్టు అనిపిస్తోంది. బహుశా మూడు నాలుగ్గం టల నుంచి ఎడతెగకుండా ఆమెనే చూస్తూ వుండిపోయి నందు వల్ల తనకలా అనిపిస్తున్నదేమో ననుకున్నాడు మళ్ళీ.

"మీరెక్కడికి కెళ్తున్నారు?" మొదటిసారిగా నోరు

విప్పి అతని గురించి అడిగిందామె.

"ఢిల్లీ. అక్కడ ఓ రిసెర్చి లాబొరేటరీలో అప్రెంటిస్ ట్రయినింగ్ కి సీటొచ్చింది. నేను సైన్స్ పోస్ట్ గ్రాడ్యుయేట్ ని. నా పేరు నవీన్. మాది కాకినాడ. విజయవాడవరకు మెయిల్లో వచ్చి యీ ట్రయిన్ కేచ్ చేశాను" అంటూ గబగబ తన గురించి చెప్పేశాడు.

ఆమె చిన్నగా నవ్వింది. తన గురించి ఆమె యేమైనా చెప్తుందేమోనని కొద్ది నిమిషాలు చూశాడు. చెప్పక పోవటంతో నిరాశపడిపోయాడు.

పెద్ద శబ్దంతో షంట్ చేశారు వాళ్ళ బోగీని.

ఆమె ఉలిక్కిపడింది. కిటికీలోంచి బయటికి చూసి, "అరె, మన కంపార్టుమెంటు ఆఖర్న తగిలించారు" అన్నది.

నవీన్ ప్లాట్ ఫాంమీదికి చూశాడు. పొడవుగా కొండచిలువలాగా వున్నది ట్రెయిన్. తమ కంపార్టుమెంటు యెక్కడో, ప్లాట్ ఫాంకి బాగా దూరంగా వుంది. తమ బోగీయే చివరిది.

"మీరు ఎక్కడికెళ్తున్నారో తెలుసుకోవచ్చా?" ఉండబట్టలేక అడిగేశాడు నవీన్.

ఆమె అతనివైపు చురుగ్గా చూసి, "నాగపూర్. మా అన్నయ్య, వదిన ఉన్నారక్కడ. ఫైనల్ బి.ఎస్సీ. పరీక్షలు రాశాను. ఖాళీగా వున్నావు కదా, రమ్మని అన్నయ్య గొడవ పెడ్తుంటే ఓ నెలరోజులు కేంప్ వేసుకున్నాను. మాది విజయవాడ—నాన్నగారు డిప్యూటీ తాసిల్దారు" చెప్పింది.

"అనుకున్నాను. విజయవాడ అమ్మాయిలు చాలా ధైర్యవంతులని విన్నాను. అందుకే ఒంటరిగా రాత్రి

ప్రయాణం చేయగలుగుతున్నారు” అన్నాడు ప్రశంసగా ఆమెవైపు చూస్తూ.

“ఇలా కూచోవటం చాలా కష్టంగా వుంది. సీటు మీద చివరికి కూచుని మాట్లాడాల్సి వస్తోంది. మధ్య బెర్తు నెత్తికి తగులుతోంది” అన్నదామె.

నవీన్ చుట్టూ చూశాడు. అందరూ గాఢనిద్రల్లో వున్నారు. ప్రపంచమంతా యేమయిపోతే మాకేం అన్నట్టు నిశ్చింతగా నిద్రిస్తున్నారు. నవీన్ పైబెర్తుపై పడుకున్న ముసలాయన మాత్రం మెలకువగా వున్నాడు.

నవీన్ లేచి నించుని “మీరు మరోలా భావించక పోతే ఆమె బెర్తుమీదికి వెళ్తారా?” అనడిగాడు.

ముసలాయన నవ్వుతుని, “అలాగే! నాక్కూడా కింది బెర్తంటేనే యిష్టం!” అంటూ అప్పటికప్పుడు తన సరంజామాతో బెర్తు మారిపోయాడు.

ఆయనకి ధన్యవాదాలు చెప్పి, ఆయన బెర్తుకున్న షేయిన్ లింక్స్ తీసేసి, కిందికి వాల్చేశాడు నవీన్. ఆమె తన ఏర్ బేగ్ తోను, దుప్పటితోను నవీన్ బెర్తుమీదికి మారిపోయింది. కిటికీ పక్కగా కూచున్నది.

“మరి, మీరు దూరప్రయాణం కదా, నిద్రపోరా?” అన్నది మెల్లిగా.

“మీకు కంపెనీ యివ్వాలి కదా! మీరొక్కరు ఎంత సేపని మెలకువగా వుండగలరు? మీకు ఎప్పుడు కూచోవటం కష్టమనిపిస్తే అప్పుడు నిరభ్యంతరంగా నిద్రపోండి! నేను ఆ ముసలాయన బెర్తుమీద రాత్రి గడిపేస్తాను” అన్నాడు నవీన్.

“వద్దు. వద్దు! అసలు నిద్రపోను నేను!” అన్నదామె.

“మీ యిష్టం!” అన్నాడు నవీన్.

ట్రెయిన్ కూత వేసి కదిలింది.

"మీ పేరు తెలుసుకోవచ్చా?" అనడిగాడు బిడియంగా.

"సౌమ్య." చెప్పింది.

'బ్యూటిఫుల్ నేమ్!' అనుకున్నాడు మనసులోనే.

ఆమెకి యిదివరకటి బెరుకుపోయింది. అతనితో స్వేచ్ఛగా మాట్లాడగలుగుతోంది. ఆమె సాన్నిధ్యం అతనికెంతో తృప్తి నిస్తోంది. చాలా ఆనందంగా వుంది. ఈమెతో పరిచయం కాకుండానే విడిపోవాల్సి వస్తుందేమో ననుకున్నాడు. కాని పరిచయం స్నేహం వరకు పెరిగిపోయింది ఆ కొద్ది గంటల్లోనే.

* • •

ట్రెయిన్ సిరిపూర్ కాగజ్ నగర్ దాటింది.

"రాబోయేదే బల్హార్షా. అంటే మనం ఆంధ్రా బార్డర్ దాటి మరో రాష్ట్రంలోకి అడుగు పెట్టబోతున్నాం. నాగపూర్ చేరేసరికి తెల్లవారిపోతుంది" అన్నాడు నవీన్.

అప్పుడు సమయం రాత్రి రెండుగంటలయింది.

ట్రెయిన్ యెందుకో ఆగింది. సమీపంలో స్టేషన్ యేదీ లేదే, లైన్ క్లియర్ దొరకలేదా అనుకుంటూ నవీన్ కిటికీలో నుంచి తొంగిచూసి అదిరిపడ్డాడు.

వాళ్ళ కంపార్టుమెంటుని ట్రెయిన్‌తో కలిపే లింకును విడగొడుతున్నారు నలుగురు వ్యక్తులు! రెండు నిమిషాల తర్వాత ట్రెయిన్ బయల్దేరింది. అయితే తమ బోగీ దాంతో వెళ్ళటంలేదు. పూర్తిగా డిటాచ్ చేయబడింది. అయినా అదేం గమనించకుండా ట్రెయిన్ వెళ్ళిపోతోంది.

గార్డు యే బోగీలో వున్నాడో! ఇది చూసి కూడా ఎలా వూరుకున్నాడు?

ఏం జరగబోతోందో నవీన్ ఊహించాడు. అది బందిపోటు దొంగల పని! అనుమానంలేదు. కంపార్టుమెంట్‌ని విడదీసి, దాంట్లో చొరబడి, తుపాకులతో, నాటు బాంబులతో ప్రయాణీకుల్ని బెదిరించి దోచుకుంటారు. అసలు ట్రెయిన్ వెనక్కి వచ్చి బోగీని తగిలించుకునే లోపల వాళ్ళ పని పూర్తవుతుంది! పూర్తయేలా చూసుకుంటారు.

మహారాష్ట్ర బందిపోట్లు గురించి నవీన్ పేపర్లో చదివాడు. వాళ్ళు డబ్బు, నగలు దోచుకోవటంతో తృప్తి పడక వయసులో వున్న అమ్మాయిల్ని ఎత్తుకుపోయి, సామూహిక మానభంగం చేసేసి చంపేస్తారు!

క్షణాల్లోనే ఓ నిర్ణయాని కొచ్చేశాడు నవీన్. నిరాయుధులుగా ఆ బందిపోట్ల నెదుర్కోవటం కష్టం! తమ నెదిరించినవాళ్ళని చంపకుండా వదలరు. వాళ్ళకి దయ, జాలి మచ్చుకయినా వుండవు. రెండో మార్గం— పారిపోవటమే!

చల్లగా సౌమ్య చెవిలో సంగతి వూదేశాడు నవీన్. ఆమె బిగుసుకుపోయింది. భయంతో ఒణికిపోయింది. బయటికి చూసి అదిరిపడింది.

"వాళ్ళు కంపార్టుమెంట్లోకి ఎక్కేస్తున్నారు" అన్నది హీనస్వరంతో.

నవీన్ మెరుపులా లేచాడు. ఆమె చెయ్యి పట్టుకుని, "నాతో రండి, పారిపోదాం!" అన్నాడు.

ఆమె అతనితో చకచక అడుగులు వేసింది. కంపార్టుమెంటులోని ప్రయాణీకులు గాఢ సుషుప్తిలో

ఉన్నారు. వాళ్ళ వంక జాలిగా చూశాడు నవీన్. అప్పటికే బందిపోట్లు చకచక కంపార్టుమెంటులోకి ఎక్కేస్తున్నారు.

అవలి పక్కకు చక చక దిగిపోయాడు నవీన్. ఆమె దిగటానికి నేల అందటంలేదు. ఒక్కసారిగా ఆమె నడుముచుట్టూ చేతులువేసి దించేశాడు. వాళ్ళు దిగిన ద్వారం వైపు కూడా బందిపోట్లు పరుగెత్తుకొస్తున్నారు....

నవీన్ ఆమె చెయ్యి పట్టుకుని, "కమాన్!.... పరుగెత్తండి....!" అంటూ పరుగు మొదలు పెట్టాడు.

అయితే అప్పటికే ఎవడో వాళ్ళని చూసేశాడు.

"ఠహరో!" అంటూ హిందీలో అరిచాడు.

నవీన్ చెయ్యి సౌమ్య చేతిని గట్టిగా అదిమి పట్టుకున్నది. "మీరు పరుగెత్తాలి. లేకుంటే వాళ్ళకి దొరికిపోతాం; నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తారు" అన్నాడు.

అతనితో సమానంగా ఆమె పరుగెడుతోంది. చీర కాళ్ళకు అడ్డుపడి రెండుసార్లు తూలిపడబోయి నిలదొక్కుకుంది. దారంతా రాళ్ళు, రప్పలు, ఎగుడుదిగుళ్ళు. ముందే ముందో పక్కల యేముందో తెలియటంలేదు. కటిక చీకటి!

వెనకనుంచి "ఠహరో, నహీంతో గోలీ మార్ దూంగా!" అన్న కర్కశమైన గొంతు, దాని వెంట బూట్ల శబ్దం వినిపించాయి. ఎవరో వెన్నాడుతున్నాడు.

నవీన్ సౌమ్య చేతిని వదిలి పెట్టలేదు.

ఇద్దరు శక్తికొద్దీ పరుగెడుతున్నారు.

వెనకనుంచి తుపాకీ శబ్దం! రెండు గుళ్ళు సర్రుమంటూ దూసుకొచ్చాయి. నవీన్ సౌమ్యతోబాటు బోర్లా పడ్డ

ఉన్నాడు.

క్షణంలో ప్రమాదం తప్పింది.

వెనక బూట్ల శబ్దం దగ్గరయ్యింది.

"లేచి పరుగెడదామా?" అన్నది సౌమ్య.

ఆమె ఊపిరి బలంగా పీలుస్తోంది. బాగా అలసిపోయింది. లేచి పరుగెత్తటం మాటుంచి, నడవటానికూడా శక్తిలేని దానిలా వుంది. ఇలాంటి పరిస్థితుల్లో లేచి పరుగెత్తబోవటం ప్రమాదకరం! ఈసారి చాలా దగ్గరగా పేల్చింది తుపాకీ. తమ చావు ఖాయం!

"కదలకుండా అలాగే పడుకోండి. శత్రువు సమీపిస్తున్నాడు. జాగ్రత్త! ఊపిరి బిగబట్టాలి. ఏమాత్రం కదలకూడదు" అన్నాడు నవీన్.

సౌమ్య అతను చెప్పినట్లే చేసింది.

వాళ్ళ దగ్గరలో బూట్ల శబ్దం స్పష్టంగా వినిపించింది. ఎవడో నవీన్ దగ్గరకొచ్చి కాలితో తన్ని చూశాడు. నవీన్ ఊపిరి బిగబట్టాడు. బోర్లా పడుకునే పక్కకి చూశాడు. చీకట్లో యెవడో పక్కన నిల్చున్న పొడ కట్టింది. మరికాస్త పైకి చూపు తిప్పాడు. గన్ వుంది చేతుల్లో.

మెరుపులా లేచాడు నవీన్. ఎగిరి అతని గుండెలమీద తన్నాడు వెనక కాళ్ళతో. అగురుబాటుగా వున్న బందిపోటు వెనక్కితూలి పడిపోయాడు. గన్ ఎగిరి దూరంగా పడింది. ఆ క్షణంలోనే సౌమ్యలేచి గన్ అందుకొన్నది. ధైర్యంగా బందిపోటుకి గురిచేసింది.

ఈలోపల బందిపోటు లేచి నవీన్ మీదికి ఉరకబోయాడు. నవీన్ పక్కకి జరిగాడు. అతను బాలెన్స్ నిలదొక్కుకోలేక తూలాడు. నవీన్ సౌమ్య చేతినుంచి

గన్ తీసుకొని బందిపోటును కాల్చాడు. గుండు అతని భుజంలోనుంచి దూసుకుపోయింది.

బందిపోటు పెడబొబ్బపెట్టి నవీన్ మీదికి దూకాడు. నవీన్ యీసారి అతని ఛాతీకి గురిచేసి కాల్చాడు.

బందిపోటు పెద్దగా అరుస్తూ నేలమీద పడిపోయాడు.

నవీన్ యేమాత్రం ఆలస్యం చెయ్యకుండా అతను నడుముచుట్టూ కట్టుకున్న బుల్లెట్స్వున్న బెల్టు తీసుకున్నాడు. తన నడుముకు పెట్టుకున్నాడు.

ఇంతలోనే దూరంగా పరుగులు పెడుతున్న శబ్దం, ఇటే వస్తున్న సవ్వడి వినిపించి సౌమ్య వంక తిరిగి, "వీడు పెట్టిన పెడబొబ్బలు, తుపాకీ కాల్పులు బందిపోట్ల చెవులపడ్డాయి. వాళ్ళు ఇటే వస్తున్నారు. ఈ ఒక్క తుపాకీతో వాళ్ళందర్నీ ఎదుర్కోవటం కష్టం! మనం తప్పించుకొని పోవాలి!" అన్నాడు.

సౌమ్య లేని ఓపిక తెచ్చుకొని "పదండి!" అన్నది.

ఇద్దరు ముందుకు పరుగెత్తారు. వెనకనుంచి తరుముతూనే వున్నారు బందిపోట్లు. అయితే కాల్పులు జరగలేదు. బహుశా తామే దిశలో పరుగెత్తినదీ వాళ్ళు గ్రహించి వుండరని ఊహించారు ఇద్దరు. కాని దూరంగా పరుగెత్తుకొస్తూన్న సూచనగా బూట్ల శబ్దాలు వినిపిస్తున్నాయి.

* * *

ఎదురుగా గుబురుగా వున్న చెట్లు, దట్టంగా అలుముకొని వున్నాయి. దారికూడా అడ్డదిడ్డంగా వుంది. పొదలు, ముబ్బులు అలుముకొని వున్నాయి.

"ఇదేదో చిట్టడవిలా వుంది!" అన్నాడు నవీన్.

"ఏం చేస్తాం. ప్రాణరక్షణకు ప్రస్తుతం యిదే గతి!" అన్నది సౌమ్య విచారంగా.

సరిగ్గా అదే సమయంలో దూరంగా ట్రెయిన్ కూత వినిపించింది. ట్రెయిన్ బోగీ లేకపోవటం గుర్తించి వెనక్కి వస్తూన్నదన్న మాట!

ఒక్క క్షణం వారిద్దరి మనసులో యేదో ఆశ మెరిసింది, కాని, వెనక్కి వెళ్ళటానికి అవకాశం లేదు. వాళ్ళు తమని వెంటనంటే వున్నారు. తమ ఉనికి గుర్తించగానే కాల్పులు సాగిస్తారు! వాళ్ళకి ఎదురు వెళ్ళటం మూర్ఖత్వం!

"మన తొందరలోపడి మీ సూట్ కేస్, నా ఏర్ బాగ్ ట్రెయిన్ లోనే వదిలేశాం. ట్రెయిన్ వెళ్ళిపోతున్నట్టుంది" అన్నది దిగులుగా సౌమ్య.

నవీన కి అకస్మాత్తుగా గుర్తుకొచ్చింది. తన ఒరిజినల్ సర్టిఫికెట్సు అన్నీ సూట్ కేస్ లోనే వున్నాయి! ట్రెయినింగ్ అథారిటీస్ కి చూపించాల్సి వున్నది. కాని అనుకోకుండా యిలా జరిగింది!

ఇద్దరూ ఆ పొదల్లోను, గుబురుల్లోను దారి చేసుకొని లోపలకు వెళుతుండగా వాళ్ళ కాళ్ళకు మెత్తగా ఏదో తగిలింది.

చటుక్కున నిల్చుండిపోయారు.

ఎండుటాకులమీద జరజర పాకిన శబ్దం! చీకట్లో కళ్ళు చికిలించుకొని చూశారు!

బ్రహ్మాండమయిన పాము! కనీసం ఆరడుగుల పొడవుంటుంది! జరజరమని పాకుతూ పొదలమధ్య మాయమయ్యింది. ఆసరికి వాళ్ళ కళ్ళు చీకటికీ బాగా అలవాటుపడ్డాయి.

"ఇక నేను పరుగె త్తలేనండీ!" అన్నది సౌమ్య, కొద్ది క్షణాల తర్వాత. అంత పెద్దసర్పాన్ని ఆమె యిదివరకు

చూడకపోవటంవల్ల బాగా భయపడిపోయింది. పరు గెత్తటం అలవాటు లేకపోవటంవల్ల బాగా అలిసి పోయింది. కాళ్ళకి రాళ్ళు, ముళ్ళు చేసిన గాయాలు ఆమెను బాధిస్తున్నాయి.

దూరంగా బందిపోట్లు వస్తున్న జాడ లీలగా వినిపిస్తోంది. తమకోసం వేరేచోట్ల వెతుకుతున్నట్టున్నారు! బహుశా ఈ అడవిలోకి ప్రవేశిస్తామని వాళ్ళు వూహించి వుండరు!

"వాళ్ళు దూరమైపోయేవరకూ యీ అడవిలోనే తలదాచుకుందాం!" అన్నాడు నవీన్.

"నా ఊహే నిజమయితే, వాళ్ళ స్థావరం ఇక్కడే ఎక్కడో వుండివుండాలి! పగలుకూడా మనుషులు మసల టానికి భయపడే ప్రాంతమిది! మనం యింకా లోపలకు వెళ్ళటం క్షేమమనిపించటం లేదు" అన్నది సౌమ్య.

"పోనీ ఈ గుబురు చెట్లమధ్య ఎక్కడైనా కాసేపు దాక్కుని గడిపేద్దామా?"

"వద్దు, వద్దు కింద విషసర్పాలు విచ్చలవిడిగా తిరుగు తున్నట్టున్నాయి. గుబుర్లలోను పొదల్లోను అవి నివాస ముండొచ్చు. ఇంకా ఎలాంటి క్రూరజంతువులున్నాయో! అడవి కదా!"

"నాకో అయిడియా వస్తోంది."

"ఏమిటి?"

"తెల్లారేవరకు చెట్టు యేదైనా ఎక్కి గడిపేస్తే?"

"నాకు చెట్టెక్కడం రాదు."

"నేను ఎక్కిస్తాను."

ఒక్కక్షణం సౌమ్య ముఖం సిగ్గుతో ఎర్రగాఅయింది. అంతక్రితం, పామును చూసినపుడు భయంతో ఆమె అతని

ఒంటికి అతుక్కుపోయింది. భయపడవద్దని అతను ఆమె వెన్ను నిమిరి ధైర్యం చెప్పాడు.

ఆ ఏకాంత ప్రదేశంలో అతను తనకెంతో సన్నిహితుడిలాగా కనిపించాడు. తనని బందిపోట్ల బారినుంచి తప్పించి మహోపకారం చేశాడు. తనని రక్షించే ప్రయత్నంలో అతని జీవనాధారమైన సర్టిఫికెట్లు, గుడ్డలు, వదిలేసుకున్నాడు. కేవలం తన మాన ప్రాణాలు రక్షించటంకోసం స్వార్థత్యాగం చేశాడు.

అతనొక్కడే అయితే తన దగ్గరున్న విలువైన వస్తువులేమైనా దొంగలకిచ్చేసి హాయిగా ఢిల్లీ పోయుండేవాడు తక్కిన వారితోబాటు. దోపిడి దొంగలు సర్టిఫికెట్లు గుడ్డలు ఏం చేసుకుంటారు! వాళ్ళకి మగవాళ్ళు అక్కర్లేదు.

ఆమె జాలిగా నవీన్ వంక చూసింది. అతనిపట్ల వేదనతోను, కృతజ్ఞతతోను ఆమె మనసు నిండిపోయింది.

అప్పుడు తెల్లవారుఝామున నాలుగ్గంటలయింది. ముందుగా నవీన్ చెట్టెక్కి ఆమెకు చేయి అందించాడు. ఆమె రెండుసార్లు ప్రయత్నించినా ఎక్కలేకపోయింది. మోకాలి దగ్గర చెక్కుకుపోయింది. చర్మంలేచి మంట పుట్టింది. మోచేతుల దగ్గర కొంతమేర చెక్కుకుపోయింది. ఆమె కంట నీరు తిరిగింది. ప్రాణభయం ఎంత చెడ్డది!

మూడోసారి అతిప్రయత్నంమీద యెక్కగలిగింది. ఆమె భుజాలు గుచ్చిపట్టి జారిపోకుండా జాగ్రత్తగా పైకి చేరుకున్నాడు నవీన్.

ఆ చెట్టు శాఖోపశాఖలుగా విస్తరించి వున్నది. దగ్గర్లో యూకలిప్టస్ చెట్లున్నట్టున్నాయి. వాటిమీద

తేలివస్తున్న గాలి అదోరకమైన వింత వాసన సంతరించుకున్నది. చల్లటి గాలి వాళ్ళను సేదతీర్చింది.

* * *

దూరంగా కనిపిస్తూన్న కాంతిరేఖలను చూసి ఉలిక్కి పడ్డాడు నవీన్. ఫోకస్ చేయబడిన కాంతి! టార్చి వెలుగు. ఒకటి కాదు, రెండు కాదు దాదాపు ఏడెనిమిది టార్చిలైట్లు నిర్విరామంగా ఆ చుట్టుపక్కల గాలిస్తున్నాయి సౌమ్యకూడా గుర్తించింది.

“మనకోసం వేట కొనసాగుతున్నది. వాళ్ళ సహచరుడ్ని చంపినందుకు ప్రతీకారం తీర్చుకోవటంకోసం మన గురించి తీవ్రంగా వెతుకుతున్నారు. అదీగాక వాళ్ళని మోసంచేసి తప్పించుకున్నందుకు మనమీద కక్ష పెట్టుకుని వుంటారు. మనం కనపడితే చాలు, కాల్చిపారేస్తారు. చెట్టెక్కి మంచి పనే చేశాం!” అన్నాడు నవీన్.

అంతకంతకు టార్చి వెలుగు దగ్గరవుతోంది.

“వాళ్ళు ఇటే వస్తూన్నారు!” అన్నది సౌమ్య.

నవీన్ తలూపాడు-“భయంగా వుందా?” అన్నాడు.

“భయపడి చేసేదేముంది?” ఉపహాసం చేసింది.

“జాగ్రత్త. వాళ్ళు ఈ చెట్టుకిందికికూడా రావచ్చు. వాళ్ళకి మన ఉనికి తెలియనివ్వకుండా జాగ్రత్తపడాలి!”

“అలాగే. వాళ్ళు కిందినుంచి లైట్లు ఫోకస్ చేస్తేతప్ప మనం కనపడం.”

“హుమ్, వాళ్ళొచ్చేశారు!” అన్నాడు నవీన్.

పొదలు, తుప్పలు వెలుగుతో పట్టపగల్లా చేస్తూ బందిపోట్లు వెతుక్కుంటూ వచ్చారు. వాళ్ళు హిందీలో లోస్వరంలో మాట్లాడుకుంటున్నారు. దాదాపు పన్నెండు మంది వున్నారు. అందరు ఆరడుగుల ఎత్తుతో పొత

పోసిన కంచువిగ్రహాల్లా వున్నారు.

అందరి చేతుల్లోను తుపాకులున్నాయి.

"బహుశా ఈ అడవిలోకి వాళ్ళు ప్రవేశించలేదేమో" అన్నాడొకడు హిందీలో.

"అడవి మొదటివరకు వచ్చేదాకా మనముందు ఆకులు చప్పుడయ్యింది. ఎవరో పరుగెత్తిన సవ్వడి వినిపించింది" అన్నాడు మరొకడు హిందీలోనే.

"అప్పుడే గురి చూసి కాల్చెయ్యాల్సింది. పోతే నాలుగు బుల్లెట్లు పోయుండేవి. వాళ్ళెక్కడున్నదీ తేలిపోయేది!" అన్నాడు ఇంకొకడు.

వాళ్ళు సరిగ్గా వాళ్ళున్న చెట్టుకిందికే వచ్చారు. నవీన్, సౌమ్యల గుండె దడదడకొట్టుకుంటోంది. ఊపిరి బిగబట్టి చూస్తున్నారు. వాళ్ళు యధాలాపంగా పైకి ఫోకస్ చేశారంటే తాము దొరికిపోక తప్పదు. పిట్టల్ని కాల్చినట్టు కాల్చేస్తారు.

అయితే, వాళ్ళు భయపడ్డట్టు జరగలేదు.

బందిపోటు దొంగలు ఇంకా అడవిలోకి చొచ్చుకొని పోయారు. లైట్ల వెలుగులో సన్నటి కాలిదారి కనిపించింది నవీన్ సౌమ్యలకు. ఆ కాలిదారిన బందిపోట్లు ఒకరివెనక ఒకరు వెళుతున్నారు.

అది వాళ్ళకు అలవాటుపడిన దారిలాగా చకచక వెళ్ళిపోయారు. చివరగా నడుస్తున్న నలుగురి భుజాల పైన మూటలున్నాయి. బహుశా అవి ట్రెయిన్‌లో దోచుకున్న విలువైన వస్తువులు, డబ్బు కావచ్చునని ఊహించారు.

బందిపోట్లు దూరమయిపోయారనటానికి సూచనగా వాళ్ళు ఫోకస్ చేస్తున్న టార్చిలైట్ల వెలుగు క్రమంగా

దూరమయిపోతూ కనిపించింది.

"వాళ్ళు వెళ్ళిపోయారు" అన్నాడు నవీన్.

"కాని, మళ్ళీ వెనక్కి వచ్చే అవకాశముంది" అన్నది సౌమ్య.

"వాళ్ళు బహుశా ఈ అడవిలోనే ఎక్కడో వాళ్ళ స్థావరం ఏర్పరచుకొని వుండొచ్చు. అందుకే బాగా అలవాటుపడిన ధోరణిలో నిరాటంకంగా లోనికి వెళ్ళిపోయారు" అన్నాడు నవీన్ — సౌమ్య తలాడించింది.

• • •

తూర్పున వెలుగురేఖలు కనిపిస్తున్నాయి. అయిదు గంటలు దాటి పదినిమిషాలయింది.

"చెట్టు దిగి మెల్లగా వచ్చిన తోవనే పోదామా?" అన్నది సౌమ్య. నవీన్ ఏదో చెప్పబోయేలోపల మళ్ళీ టార్చి వెలుగు కనిపించింది.

బందిపోట్లు తిరిగొస్తున్నారు.

సౌమ్య, నవీన్ ఊపిరి బిగబట్టి చూస్తున్నారు. ఒకరి తరవాత మరొకరు పన్నెండుమంది వస్తున్నారు. ఇప్పుడు ఆ నలుగురి భుజాలమీద మూటల్లేవు. అంటే.... యీ అడవిలోనే యేదో సంకేత స్థలంలో వాళ్ళు దోచుకున్న సొమ్మంతా దాస్తున్నారన్నమాట! వీళ్ళు నివసించే స్థావరం వేరే యేదో ఎక్కడో వుండివుండాలి! బహుశా వాళ్ళు యిప్పుడు అక్కడికే పోతున్నారేమో!

సౌమ్య, నవీన్ వున్న చెట్టుకింద యిద్దరు ఆగారు. సిగరెట్లు ముట్టించుకున్నారు. మళ్ళీ ముందుకు కదిలారు. అందరూ వచ్చిన దారినే తిరిగి అడవి బయటకు వెళ్ళిపోయారు.

వీళ్ళు పగలు నాగరిక ప్రపంచంలో ఘరానా పెద్ద

మనుషులుగా చలామణీ అయిపోతున్నారనుకోవాలి! వాళ్ళ చేతుల్లో తుపాకులు లేవు. నడుములకు తూటాల బెల్టులు లేవు. ఇప్పుడు వాళ్ళని ఎవరు చూసినా బందిపోట్లు అంటే నమ్మరు. కాయకష్టం చేసుకొనే రైతుల్లా వున్నారు!

నవీన్, సౌమ్య ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"వాళ్ళు దూరమైపోయారు. ఇక దిగుదామా?" అన్నది సౌమ్య.

ఒక్క రాత్రికే ఆమె నీరసించిపోయి, కృషించి పోయింది. కొన్ని గంటల క్రితం ట్రెయిన్‌లో ఆమెని చూసిన వాళ్ళెవరైనా యిప్పుడు చూస్తే గుర్తుపట్టడం కష్టం. ఆ రూపలావణ్యం మచ్చుకైనా కనిపించటం లేదిప్పుడు.

నవీన్ చెట్టుమీదినుంచి మెల్లగా దిగాడు. సౌమ్యని చేయిపట్టి దింపాడు. ఎక్కినంత కష్టంగా లేదు దిగటం. ఇద్దరిలోను ఒకరికొకరు ఎంతో సన్నిహితులయిపోయిన భావం కలిగింది. ఈ కలయిక ప్రమాదాలతో కూడుకున్నది కాకపోతే, ఎంతో ఆహ్లాదంగా, మనోహరంగా వుండివుండేది కదా అనిపించింది ఇద్దరి మనసుల్లోను.

సౌమ్య దిగుతూనే తమ పక్కకు చూసి అదిరిపడింది. నాలుగు తోడేళ్ళు నాలుకలు చాచుకుంటూ వారివైపే పరుగెత్తుకొస్తున్నాయి.

"నవీన్!" అన్నది అటువైపు చేయి చూపించి. తక్కిన మాట ఆమె నోటినుంచి రాలేదు.

నవీన్ ఉలిక్కిపడి చూశాడు. బలంగా, ఎత్తుగా బాగా పోతరించి వున్నాయా తోడేళ్ళు. వాటి కోరలు బాగా వాడిగా, బయటకి పొడుచుకువచ్చినట్టున్నాయి. తమ

వైపే నోరు తెరుచుకొని నాలుకలు చాచుకొని వస్తున్నాయి!

నవీన్ యేమాత్రం ఆలస్యం చెయ్యకుండా, గన్‌తో గురిచూసి కాల్చాడు. రెండు తోడేళ్ళు నేలకూలి పోయాయి. తక్కిన రెండు రెట్టించిన ఆగ్రహంతో అతని మీదికి ఉరికాయి.

నవీన్ తుపాకిలో గుళ్ళు లోడ్ చేసుకోవటానికి సమయంలేదు. ఆ తుపాకీలో రెండు గుళ్ళు మాత్రమే ఒకసారికి లోడ్ చేసుకునే వీలుంది!

నవీన్ తుపాకీ తిరగేసి మడమతో ఓ తోడేలు నెత్తి మీద బలంగా మోదాడు. రెండో తోడేలు దాడిచేసే ప్రయత్నం విరమించుకొని ఊహించని రీతిలో తోక ముడిచి పారిపోయింది.

నవీన్ చకచకా మేగజైన్ విప్పి తుపాకీలో రెండు గుళ్ళు లోడ్ చేసుకున్నాడు. సౌమ్య దాదాపు స్పృహ తప్పిపోయే స్థితిలో కనిపించింది.

అప్పటికి తెల్లవారటానికి ఎంతో సమయంలేదు. అడవి మూలాన పగటి వెలుగును చెట్లు అడ్డేశాయి. సూర్యుడు ఉదయించిన ఎంతోసేపటికిగాని అడవిలో వెలుగు ప్రసరింపబడదు. అంత ఒత్తుగా, ఆకాశాన్ని కనపడనీయకుండా గుబురుగా ఎత్తుగా పెరిగిపోయినాయి అక్కడి చెట్లు!

"సౌమ్యా, మీరు ఓపిక చేసుకొని నడవగలరా? వీలయినంత త్వరగా మనం రైలుపట్టాలున్న ప్రాంతం చేరుకోవాలి! మధ్యలో ట్రెయిన్ ఆగదు కనక, దగ్గరో వున్న స్టేషన్ దేన్నయినా చేరుకోవాలి! చిన్న స్టేషన్లలో

పాసింజర్ ట్రెయిన్లు ఆగుతాయి. ఏదోకటి పట్టుకొని ఎక్స్‌ప్రెస్‌లు ఆగే స్టేషన్ వరకు ప్రయాణం చేయొచ్చు" అన్నాడు నవీన్.

ఆమె బాగా అలసిపోయినట్టు కనిపించింది.

"నడవగలను, పదండి!" అన్నది చిన్నగా నవ్వి.

పక్షుల కిలకిలారావాలు అడవంతా ప్రతిధ్వనిస్తున్నాయి. రాత్రంతా రాజ్యమేలిన అడవి మృగాలు, చిన్న జంతువులు ఎక్కడో విశ్రాంతి తీసుకుంటూ వుంటాయి. చీకటి పడ్డాకనే వాటి ఆగడాలు ఆరంభమవుతాయి. కాని, యీ తోడేళ్ళు ఎందుకు బయటకొచ్చాయో తెలీదు ఆ సమయంలో. బహుశా వాటికి ఆహారమేదీ దొరకలేదన్నమాట! చిన్న జంతువుల్ని వేటాడి తింటానికి బదులు మనుషుల్ని వేటాడే స్థితికి వచ్చాయంటే అవి ఎంతో క్రూరమయినవై వుండాలి!

అలాంటి ప్రమాదాన్ని అతి సాహసంగా ఎదుర్కొన్న నవీన్ వంక ప్రశంసగా చూస్తోంది సౌమ్య! పైకి అమాయకుడిలాగా కనిపించే యీ యువకుడు అవసరమైతే యెలాంటి సాహసాన్నయినా చేయగలడనిపించింది ఆ సంఘటన చూశాక!

* * *

తెల్లవారిపోయింది.

వెలుగురేఖలు ఎక్కడినుంచో చెట్ల సందులగుండా లోపలికి చొచ్చుకొని వస్తున్నాయి. రాత్రంతా రకరకాల సంకీర్ణ ధ్వనులతో భయోత్పాతం సృష్టించిన అడవి ఒక్కసారిగా నిశ్శబ్దంగా అయిపోయింది. ఆ నిశ్శబ్దం కూడా భయం పుట్టిస్తోంది. అప్పుడప్పుడు వుండీ వుడిగీ చెట్లమీద పక్షుల కూతలు వినిపిస్తున్నాయి. ఆహారం

కోసం పక్షులు ఎగిరి వెళ్ళిపోయాక, అంతటా ప్రశాంతంగా వున్నది.

"మనం చాలా దూరం నడిచాం. ఈ పాటికి యీ అడవి దాటి వెళ్ళిపోయుండాలి. కాని, ఇంకా అడవిలోనే తిరుగుతున్నాం. రాత్రి మనం వచ్చిన దారి ఇది కాదు!" అన్నాడు నవీన్ నడక ఆపి, చుట్టూ పరిశీలనగా చూస్తూ.

సౌమ్య తనూ ఆగి పరిసరాలు గుర్తించటానికి ప్రయత్నించింది.

"రాత్రి తొందర్లో పరుగులు పెడుతూ దిక్కుతోచని పరిస్థితిలో ఎట్నుంచి లోపలికి ప్రవేశించామో, ఎలా వచ్చామో గుర్తించలేదు! నాకంతా అగమ్యగోచరంగా వుంది" అన్నది సౌమ్య.

"నాకు కొంత గుర్తున్నది! మనం లోపలికి రావటానికి పొదలు, తుప్పలు, డొంకదారి తప్ప ఇలాంటి సాఫీగా వున్న కాలిబాట కనిపించలేదు. అయితే బందిపోటు దొంగలు వెళ్ళిన దారి మాత్రం కాలిబాటతో మొదలయింది. మరి యీ కాలిబాట యెట్నుంచి మొదలై ఎటు వెళ్తున్నదో అంతుబట్టడంలేదు" అన్నాడు నవీన్.

ఈ మాటలతో సౌమ్య బాగా డీలా పడిపోయింది.

ఎటు చూసినా పొడవాటి దట్టమైన చెట్లు, పుట్టలు, గుట్టలు, యూకలిప్టస్ చెట్లు, వెదురు పొదలు, సర్వే చెట్లు నేలమీద ఒత్తుగా పెరిగిన పిచ్చిమొక్కలు, పొదలు, ఎండుటాకుల గుట్టలు, నానాబీభత్సంగా వుంది నేలంతా. పేరుకి కాలిబాటగాని, నేలమీద ఒత్తుగా ఎండుటాకులు పడి కాలు ముందుకు వేయటానికి భయం

వేస్తోంది. వాటికింద ఎలాంటి విషపురుగులు దాగివున్నా కనిపించే అవకాశంలేదు! కాటందుకు తీర్తాయి.

"పదండి, యీ దారి యెటుపోతే మనమూ అటు పోదాం. అంతకుమించి గత్యంతరంలేదు. మీరు బాగా అలసిపోయినట్టున్నారు....!" అన్నాడు నవీన్ ఆమె వడలిన ముఖంవైపు తేరిపార చూస్తూ.

సౌమ్య సిగ్గుపడింది. "మీరు ముందు నన్ను 'మీరు' అని మన్నించటం మానెయ్యండి. నాకేమిటోగా వుంది!" అన్నది.

నవీన్ నవ్వుతూ ఆమెవైపు చూసి, "అలాగే! మీరు సారీ—నువ్వుకూడా నన్ను మన్నించటం మానెయ్యాలి, సరేనా?" అన్నాడు.

"ఆహా, అదేం కుదరదు — మిమ్మల్ని.... ఊహుం, అలా పిలవలేను...." సిగ్గుతో ఆమె వదనం ఎర్రనైంది.

"అది కుదరనప్పుడు ఇదీ కుదరదు."

"హు, మీరు ఉత్త మొండిమనుషులు బాబూ! సరే, అలాగే .... మనిద్దరం ఒక్క రాత్రిలో యెంత దగ్గరైపోయాం. మన్నించుకోవటం బాహ్య సంబంధమైనది. మన మనసులు మాటాడుకునే భాష వేరు! దానికి బాహ్య సంబంధమైన మన్ననతో పనిలేదు!"

"సౌమ్యా!" మెత్తగా పిలిచాడు నవీన్. అతని కంఠంలోని మార్దవానికి, అతడు తన పేరును అలా అందంగా ఉచ్ఛరించటంలో చిలికిన సాన్నిహిత్యానికి ఆమె పులకించిపోయింది. కళ్ళు అరమోడ్పులయ్యాయి. అనిత ముఖంలోకి చూడటానికి సిగ్గేసింది.

నవీన్ చేయి చాచి ఆమె చేతిని పట్టుకొని మెల్లగా పెదాలకు హత్తుకొని ముద్దించాడు. ఆ చిన్న చర్యలోనే

అతనికి ఆమెపట్ల ఉద్భవించిన ప్రేమానురాగాలు వ్యక్త మయ్యాయి. సౌమ్య అణువణువునా ఓ వింత అనుభూతి, తాదాత్మ్యత వ్యాపించి ఆమె ఉనికినే మరపింపచేశాయి.

"నవీన్!" అన్నది మరో లోకంలో విహరిస్తూ.

సరిగ్గా అదే సమయంలో 'బుస్'మన్న ఫీత్కారం నవీన్ చెవులకి వినిపించింది. ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. యెదురుగా చుట్టచుట్టుకొని వున్నది బ్రహ్మాండమయిన గోధుమ త్రాచు. దాని పడగమీదున్న కృష్ణపాదాలు స్పష్టంగా చూశాడు నవీన్.

సౌమ్య అదేం గమనించలేదు. ఆమె మధురోహల నించి ఇంకా యీ లోకంలోకి రాలేదు. పాము సరిగ్గా ఆమె కుడికాలికి రెండంగుళాల దూరంలో పడగవిప్పి బుస్సుమంటోంది. కాటందుకోవటానికి సిద్ధంగా వుంది!

నవీన్ యేమాత్రం ఆలస్యం చెయ్యలేదు. తుపాకీ బారెల్‌తో చుట్ట చుట్టుకున్న పాముని ఎత్తి అవతలికి విసిరేశాడు. దూరంగా పడిపోయింది పాము. ఆ తర్వాత జరజరమంటూ ఎటో పాక్కుంటూ క్షణాల్లో మాయ మయిపోయింది.

అంతా రెండు క్షణాల్లో జరిగిపోయింది. సౌమ్య కళ్ళు విప్పేసరికి కనిపించిన దృశ్యం నవీన్ బారెల్‌తో పాముని విసిరెయ్యటం! ఆమె కొద్ది క్షణాలు నిశ్చేష్టురాలై నిల్చుండిపోయింది.

కొద్ది సేపటికి తేరుకొని "నవీన్, ఆ పాము నన్ను కాటందుకో బోయింది కదూ!" అన్నది భయంగా.

"అవును, ఒక్క క్షణం ఆలస్యమయితే ప్రమాదం జరిగిపోయేది!"

"మరి... తుపాకీ వుందికదా, వెంటనే కాల్చెయ్యక

పోయావా?"

"అంత వ్యవధి లేదు. అందుకే బారెల్‌తో విసిరేశాను. అయినా యీ అడవిలో ఇంకా ఎన్నిరకాల విష సర్పాలు మనకెదురవుతాయో! వాటన్నిటికోసం తూటాలు ఖర్చు పెట్టేసే ఈ బెల్టులోని తూటాలన్నీ సరిపోవు!"

"కాని కాని....ఆ పాము పగబడితే. ?"

"నీకూ వున్నాయా ఈ మూఢనమ్మకాలు? పాము పగబట్టటమేమిటి? నాన్సెన్స్?....అసలు విషసర్పంగాని, మరొకటిగాని, కావాలని మనల్ని కాటందుకోవు. వాటికి మనం హాని చేసినప్పుడే, చెయ్యేతలపెట్టినప్పుడో, ప్రాణ రక్షణకోసం మనల్ని భయపెట్టడానికి బుసకొడతాయి. అప్పటికీ మనం వై తొలగకపోతే అప్పుడు కాటువేసి తప్పించుకు పారిపోవటానికే ప్రయత్నిస్తాయిగాని, ఎదురు నిలిచి కవ్వించవు. మనకి మన ప్రాణం కాపాడుకోవాలని ఎంత తాపత్రయమో, మననుంచి తన ప్రాణం కాపాడుకోవాలని ఆ విష పురుగూ తాపత్రయపడుతుంది. సో, పగా, గిగా అంతా ఉత్తది, ట్రాష్!"

"అబ్బ, దీనికింత ఉపన్యాసమిచ్చారు?"

"అదిగో, మళ్ళీ బహువచనం....!?"

"సారీ, అలవాటు. అయినా ఒక్కసారిగా 'నువ్వు' అని పిలవాలంటే నాకెందుకో మనస్కరించటంలేదు. మధ్య మధ్యలో బహువచనమే వచ్చేస్తూంది!"

"ఆల్‌రైట్....పద, పోదాం. ఈ దారి పట్టుకొని పోవటం తప్ప వేరే దారిలేదు" అన్నాడు నవీన్ ముందుకి అడుగు వేస్తూ.

సౌమ్య వాచీ చూసుకున్నది. ఉదయం పదిగంటలు కావస్తోంది.

"ఇలా ఎంతదూరం నడవాలి? అసలు మనం ఎక్కడికి పోతున్నాం? ఒకసారి చెట్టుమీదికెక్కి చూస్తే పరిసరాలు గురుతెలుస్తాయేమో!" అన్నది సౌమ్య.

"గుడ్ ఐడియా!" అన్నాడు మెచ్చుకోలుగా ఆమె వంక చూస్తూ నవీన్. ఓ ఎత్తయిన ఊడల మర్రి కనిపించింది. ఊడలు పట్టుకొని పైకి ఎగబ్రాకాడు. బాగా ఎత్తుగా వున్న కొమ్మమీదికి చేరుకొని చుట్టూ దృష్టి పరికించాడు.

చుట్టూ ఎటు చూసినా పెద్ద పెద్ద చెట్లు. కొండల బారు తప్ప మైదాన ప్రదేశంగాని, రైలు కట్టగాని ఎక్కడా కనిపించలేదు. ఎటుచూసినా ఒక్కలాగేవుంది! ఓ పక్కగా మాత్రం సెలయేరు గలగల పారుతున్న సవ్వడి, సన్నటి నీటిపాయ కనిపించింది.

నిరాశ ఆవరించుకున్నది నవీన్‌కి. చెట్టు దిగి వచ్చాడు. ఆసక్తిగా చూస్తున్న సౌమ్యవైపు తల అడ్డంగాతిప్పి "కనుచూపు మేరలో యెక్కడా బయటికిపోయే దారి కనిపించలేదు, సెలయేరు తప్ప!" అన్నాడు.

"ఒకసారి సెలయేట్లో మొహాలు కడుక్కుందామా?" అన్నది సౌమ్య. ఆమెకు చాలా దాహంగాకూడా వున్నది.

"అలాగే, దగ్గర్లోనే వున్నది" అన్నాడు నవీన్.

వాళ్ళు పదిగజాలు వెళ్లారో లేదో చెట్టుపైనుంచి ఏదో ఆకారం దబ్బున వాళ్ళమీద కురికింది.

* * *

సౌమ్య కెవ్వున అరిచింది నల్లటి దుబ్బులా వున్న ఆ ఆకారం వైపుచూసి. గుర్రుమంటోంది. అదో రకమైన భరించలేని దుర్వాసన!

నవీన్ చేతిలోని తుపాకీ ఆ అదుటుకి ఎగిరి అల్లంత

దూరాన పడింది.

అది ఎలుగుబంటి! బాగా దృఢంగా, భయంకరంగా వుంది. దాని ఒంటినిండా అంగుళం జాగాకూడా లేకుండా దట్టంగా నల్లటి బొచ్చు అలుముకొని వున్నది. దానికళ్ళు పచ్చగా క్రూరంగా చూస్తున్నాయి. నోరు తెరుచుకొని వాళ్ళమీదకు వేగంగా గెంతుతూ వచ్చేసింది!

గన్ అందుకోవటానికి అవకాశంలేదు! ఈలోపల అది కోరలతో తమని చీల్చి రక్తం తాగేస్తూంది.

నవీన్ గుండె దిటవుచేసుకున్నాడు. వేగంగా మీదికొస్తున్న ఎలుగును తనవైపు ఆకర్షించుకున్నాడు. చేతులు చాచి దాని ముందరి కాళ్ళనందుకున్నాడు మెలికవేసి పడగొట్టబోయాడు. కాని ఎలుగు మెరుపు వేగంతో అతన్ని వదిలించుకుని గోళ్ళతో అతని భుజంమీద గీరింది.

షర్టు చినిగిపోయింది. భుజంమీద దాని కాలిగోళ్ళు చేసిన గాయంనుంచి జాడలుగా రక్తం స్రవించసాగింది.

నవీన్ లెక్కచెయ్యలేదు. తన భుజంమీదకు మరోసారి ముందరి కాలు విసిరిన ఎలుగు కాలును బలంగా పట్టుకొని మెలితిప్పాడు. ఆగ్రహంతో గుర్రుమన్నది ఎలుగు. రెండో ముందరి కాలితో యీసారి అతని గుండెలమీద గాయం చేసింది. ఒక్కసారిగా దాని బరువు తనమీద పడటంతో నవీన్ తూలాడు.

సౌమ్య కొద్దిక్షణాలు మాత్రం కర్తవ్యం తోచక శిలాప్రతిమలా నిలిచుండిపోయింది. కాని, రెండోసారి అది నవీన్ గుండెమీదకు కాలు విసిరినప్పుడు ఆమెకు మెరుపులాంటి ఆలోచన వచ్చింది. ఎలుగు తన గురించి పట్టించుకోవటంలేదు.

ఒక్కో అడుగే మెల్లిగా జరుగుతూ తుపాకీవైపు

కదిలింది. ఎలుగుబంటి యేమాత్రం గమనించినా తన మీదకు దాడిచేస్తుందని, తన ప్రయత్నం విఫలమవుతుందని ఆమెకు తెలుసు!

నవీన్ ఎలుగుబంటి తనమీదకు పూర్తిగా లంఘించే లోపల కిందనే రెండుసార్లు అటు యిటు పొర్లాడు. ఎలుగుబంటి అతని కంఠాన్ని పట్టుకోవాలని ప్రయత్నిస్తోంది. కాని పట్టు చిక్కటంలేదు. రెండుసార్లు దాన్ని కాళ్ళతో నెట్టేశాడు నవీన్. అయినా అది, అతనిమీద పడి కాళ్ళతో పట్టు చిక్కించుకొని కంఠం కొరికెయ్యాలని అతని మీదిమీదికి వస్తోంది.

నవీన్ బాగా అలసిపోయాడు. భుజంమీద, ఛాతీ మీద ఎలుగు చేసిన గాయాలనుంచి నెత్తురు స్రవిస్తోంది. ఆ ప్రదేశాల్లో భగభగ మండుతోంది. అయినా అతను లెక్కచెయ్యలేదు. ఎలుగుబంటి శక్తిని క్షీణింపచేసి దాన్ని వెళ్ళగొట్టాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు. కొద్ది క్షణాల్లోనే అది తన శక్తికి మించినపని అని అతడికి తెలిసిపోయింది.

సరిగ్గా అదే సమయంలో ఎలుగుబంటి నవీన్ కంఠానికి చాలా సమీపంగా వచ్చేసింది. మరోక్షణం ఆలస్యమయితే నవీన్ కంఠంలోకి దాని వాడి కోరలు దిగిపోయి వుండేవి!

కాని అదేక్షణంలో తుపాకీ భయంకరంగా గర్జించింది. చెట్లమీదున్న పక్షులు రెక్కలు టపటప కొట్టుకుంటూ అరుస్తూ గాల్లోకి ఎగిరిపోయాయి. అడవిలో ఎక్కడో పంచలనం పుట్టి ఏవో వింత శబ్దాలు పుట్టాయి.

తూటా ఎలుగుబంటి భుజంలోంచి దూసుకుపోయింది.

చటుక్కున నవీన్‌ని వదిలి తూటా వచ్చిన దిశ తిరగ

బోయింది. ఇంతలో మరో గుండు దాని కడుపులోకి చొచ్చుకుపోయింది.

ఎలుగుబంటి పెద్దగా గుర్రుపెట్టి అరిచింది. రెండు పల్టీలు కొట్టింది. కాని, చావలేదు. తీవ్రంగా గాయపడి అడవిలోకి పారిపోయింది.

సౌమ్య రెండంగల్లో నవీన్ దగ్గరకు చేరుకుని. అతన్ని ఆప్యాయంగా నిమిరింది. నవీన్ బాధ మరిచిపోయి ఆమె వంక ప్రేమగా చూసి, కృతజ్ఞతాపూర్వకంగా సం చేశాడు.

"నా ప్రాణం కాపాడావు సౌమ్యా!" అన్నాడు విచలిత కంఠస్వరంతో.

"కాదు, కాదు. నన్ను నేను కాపాడుకున్నాను" అన్నదామె. ఆమె కళ్ళు వర్షించటానికి సిద్ధంగావున్న మేఘాల్లా వున్నాయి.

నవీన్ లేచి కూచున్నాడు. అతని దుస్తులు చీలికలై పోయాయి. దుమ్ముకొట్టుకుపోయాయి. రక్తంతో ఎర్రగా తడిసిపోయాయి.

సౌమ్య కొంగు చించి అతని భుజానికి బాండేజిలా కట్టింది. రక్తస్రావం కాకుండా నిరోధించాలని ఆమె ఉద్దేశ్యం. అతని ఛాతీమీద ఎలుగుబంటిచేసిన గాయం స్వల్పమైనదే! నవీన్ దూరంగా జరగటంవల్ల ప్రమాదం నించి తప్పించుకోగలిగాడుగాని లేకుంటే అతని గుండెను చీల్చి వుండేది ఎలుగు!

"ఇదంతా నా మూలాన్నే! నన్ను బందిపోట్లనించి రక్షించటంకోసం నీ ప్రాణాల్ని సైతం పణంగా పెట్టావు. చివరికి మృత్యువుకు వెంట్రుకవాసిలో వచ్చావు. మన అదృష్టం బావుండి ఆ ఎలుగుబంటి ఇంతటితో వదిలి పారిపోయిందిగాని, లేకుంటే...."

"సమయానికి నువ్వు తుపాకీ ప్రయోగించకపోతే అంత పనీ అయ్యేది."

"ఎప్పుడో స్కూల్ డేస్‌లో ఎన్.సి.సి. కడెట్‌గా వున్నప్పుడు షూటింగ్ నేర్చుకున్నాను. ప్రాక్టీస్ లేదు. అందుకే మొదటిసారి గురితప్పింది. రెండోసారి గుండు తగిలినా ఎలుగు చావలేదు. నా ఊహ ప్రకారం అది కడుపులో బలంగా నాటుకొని వుండాలి. ఎలా బతికిందో అర్థంకాదు...."

"గుండు దాని కడుపును చీల్చేసింది. నేను చాలా దగ్గర్నుంచి చూశాను. ఎలుగు పారిపోయినా ఎక్కడో పడిపోయుంటుంది. అది బతకటం కష్టం!"

ఆమె ఆసరా యిచ్చి అతన్ని లేపి నించోబెట్టింది. గత రాత్రి ఏడుగంటలకు రైల్వే కేంటీన్‌లో తిన్న ప్లేటు భోజనం, మధ్యలో రెండు అరటిపళ్ళు బిస్కట్లు తప్ప మరేం ఆహారంలేదు. అప్పుడే పన్నెండు గంటలు కావస్తోంది. ఆకలితోను, గాయాలవల్ల కలిగిన బాధతోను నిస్త్రాణగా వున్నది నవీన్‌కి. పళ్ళ బిగువున భరిస్తున్నాడు.

"రైలరోడుదాకా నడవగలవా?" అడిగింది సౌమ్య.

ఇందాకా నవీన్ అడిగిన ప్రశ్న ఇప్పుడు ఆ అమ్మాయి అడుగుతోంది. ఇప్పటిదాకా తన బాధ్యత అతను తీసుకున్నాడు. ఇప్పుడు అతను గాయపడ్డాడు. ఆ బాధ్యత తను తీసుకోవాలి! అనుకున్నది సౌమ్య.

జరిగిపోయిన సంఘటనలు ఆమెకు యెంతో జీవితానుభవం గడించిపెట్టాయి. ఇరవై ఏళ్ళుకూడా నిండని ఆ ముగ్ధ మనోహరమైన యువతిలో నలభై ఏళ్ళ అనుభవం జీర్ణించుకుపోయి ముఖం గంభీరంగా తయారయింది. ఎంతో అరిందాలాగా అతని రక్షణ భారం తనదే అన్న

ట్టుగా బాధ్యతాయుతంగా ప్రవర్తిస్తోంది.

నవీన్ తను చెట్టువెనుంచి చూసిన దిశగా ఆమెకు గుర్తులు చెపుతున్నాడు. ఇప్పుడు అవయవాలు స్వాధీనం లోకి వచ్చాయి. ఆమె ఆసరా లేకుండానే నడవగలుగు తున్నాడు.

* * *

దగ్గర్లోనే గలగల నీరు పారుతున్న సవ్వడి విని పించింది. ఆ శబ్దం యిద్దరూ స్పష్టంగా విన్నారు.

"అదిగో సెలయేరు దగ్గరయినట్టే వుంది" అన్నది సౌమ్య.

నవీన్ తలూపాడు. ఇద్దరూ ఉత్సాహంగా అటువైపు నడిచారు.

గలగల శబ్దం దగ్గరయ్యే కొద్దీ గాల్లో యేదో వాసన తేలి తేలి వస్తున్నట్టు గుర్తించాడు నవీన్. అలాంటి వాసన యిదివరకు హైదరాబాద్ లోని జూలాజికల్ పార్క్లో తనకు అనుభవమే!

అది గబ్బు వాసన!

నవీన్ కి మెదడులో మెరుపులు మెరిశాయి.

సౌమ్య చెయ్యిపట్టి ఆపేశాడు. దూరంగా కనిపించిన దృశ్యంవైపు చేయి చాపి సైగచేశాడు.

సౌమ్య ఆ దృశ్యం చూసి నిర్ఘాంతపోయింది.

సెలయేరుకి అవతలితట్టున తాపీగా నిలబడి నీటిని తాగుతోంది ఓ పెద్దపులి!

నల్లటి చారలు, పసుపుపచ్చటి దాని శరీరంమీద వాతలు తేలినట్టుగా కనిపిస్తూ చాలా భయంకరంగా వున్నాయి. దృఢంగా, ఎత్తుగా భారీ శరీరంతో పులి చూసేవాళ్ళ గుండెల్ని అదరగొడుతోంది!

ఇద్దరు పక్కనే వున్న పెద్ద చెట్టుపక్కకు తప్పు కున్నారు. వాళ్ళకి, పులికి మధ్య చాలా దూర ముంది! కాని పులి వాళ్ళ కంతో దగ్గర్లో వున్నట్టు అది యే క్షణంలోనైనా తమమీదికి దూకబోతున్నట్టు భ్రాంతి కలుగుతోంది!

ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కూడా మరచిపోయి అలా చూస్తూండిపోయారు సౌమ్య, నవీన్.

పులి దర్జాగా తాగుతోంది. నిర్భీతిగా తాగుతోంది. నిశ్చింతగా, యేమాత్రం సంకోచం లేకుండా, యీ అడవికి తనే రాజునన్నట్టు ఠీవిగా వెనుతిరిగి, చెట్లమధ్య మాయమయిపోయింది.

పులి వెళ్ళిపోయిన అయిదు నిమిషాలవరకు, అది అక్కడే నిల్చుని నీళ్ళు తాగుతున్న భ్రాంతినుంచి తేరుకో లేక పోయారిద్దరు. సౌమ్య తన దాహాన్ని ఎప్పుడో మరిచి పోయింది. ఒక్కో సంఘటన ఆమె గుండెను బండగా మార్చేస్తోంది. తామిద్దరూ బతికి బయటపడతామనే ధైర్యం సన్నగిల్లి పోతోంది. క్షణక్షణానికి తాము మృత్యు ముఖంలోకి వెళ్తున్న అనుభూతి కలుగుతోంది.

ఈ అడవిలో మనుష్య సంచారం లేనట్టుంది! ఎక్కడ చూసినా విషసర్పాలు, క్రూరమృగాలు వీరవిహారం చేస్తు న్నాయి. ప్రమాదం యే క్షణం యే రూపంలో విరుచుకు పడుతుందో అనూహ్యంగా వున్నది! ఎటు వెళ్ళినా బయ టకు దారి కనిపించటంలేదు. చెట్లు, గుట్టలు, పుట్టలు అడుగడుగునా దర్శనమిస్తున్నాయి. బందిపోట్లు అందుకే తమ దోపిడీ సొత్తును దాచుకోవటానికి సురక్షితమైన స్థలంగా ఎంచుకున్నారు! మానవమాత్రు డెవడూ యీ దుర్గమారణ్యంలోకి కాలు పెట్టలేడనేది నిర్వి

వాదాంశం!

నవీన్ ఆమెవైపు చూసి "వెళ్దామా?" అన్నాడు.

సౌమ్య పరధ్యానంగా "ఎక్కడికి?" అన్నది.

"ముఖం, కాళ్ళు కడుక్కుంటే అలసట తీరి కాస్త ఫ్రెష్‌గా వుంటుంది. పులి వెళ్ళిపోయి చాలాసేపయింది" అన్నాడు.

ఇద్దరూ మళ్ళీ అడుగులు ముందుకు వేశారు. సెలయేటికి యివతలితట్టున నిల్చుని చల్లటినీటితో ముఖాలు కడుక్కున్నారు. ఎంతో హాయనిపించింది. నవీన్ తన గాయాలు చల్లటినీటితో కడుక్కున్నాడు. సెలయేట్లో కాసేపు యీదాలన్నంత ఉత్సాహం కలిగింది. ఆ ఉద్దేశ్యాన్ని బలవంతాన మానుకున్నాడు.

ఇద్దరూ మళ్ళీ కాలిబాట దగ్గర కొచ్చారు. అప్పుడు గుర్తొచ్చింది నవీన్‌కి—గన్ లోడ్ చెయ్యలేదని. రెండు గుళ్ళు యెలుగుబంటి కోసం ఖర్చు చేసింది సౌమ్య.

జేబులో నుంచి రెండు బుల్లెట్స్ తీసి తుపాకీ లోడ్ చేసి చేతపట్టుకున్నాడు.

"ఈ దారిన పోయేకొద్దీ అడవి అంతర్భాగానికి వెళ్ళిపోతున్నామనిపిస్తోంది నాకు. వ్యతిరేక దిశలో వెళ్ళి చూద్దామా యిప్పుడు....!?" అన్నాడు సౌమ్యతో నవీన్.

ఆమె తలూపింది. ఆమె మస్తిష్కం మొద్దుబారిపోయింది. స్వయంగా ఆలోచించగల శక్తి సన్నగిల్లిపోయింది.

ఇద్దరూ అంతదాకా నడిచిన బాటకు వ్యతిరేక దిశలో ప్రయాణం మొదలుపెట్టారు.

సౌమ్య వాచీ చూసుకున్నది. మధ్యాహ్నం రెండు గంటలు కావస్తోంది.

ఓ అరగంట నడిచారు. ఇద్దరిలోనూ వీలయినంత వేగంగా, చీకటి పడేలోపల అడవి దాటి వెళ్ళిపోవాలనే ప్రగాఢమైన కోరిక చోటు చేసుకున్నది! నడక వేగం హెచ్చింది.

నవీన్ అప్రమత్తంగా నడుస్తున్నాడు — అతని చేతిలో తుపాకీ పొజిషన్ లో వున్నది. బరువుకి చేతులు నొప్పి పెడుతున్నాయి. గాయం తగిలిన భుజం పీకుతోంది. అడుగులు ఒక్కోసారి తడబడుతున్నాయి. అయినా అతని చేతులు తుపాకీని ఫర్మ్ గా పట్టుకునే వున్నాయి.

ఏమాత్రం అలికిడి అయినా అతను చెవుల్ని దోరబెట్టి వింటున్నాడు. ఎక్కడో యేవో సంకీర్ణ ధ్వనులు కలగాపులగంగా వినిపిస్తున్నాయి. ఎండుటాకులమీద వుండి వుండి జరజరా పాకుతున్న సవ్వడి స్పష్టంగా వినిపిస్తోంది. ఒకటి రెండు కుందేళ్ళు చెంగు చెంగున వాళ్ళ ముందు గెంతుతూ పారిపోయాయి.

చెట్లమీద ఏవేవో పక్షులు వింత ధ్వనులు చేస్తున్నాయి. కువకువ శబ్దం వినిపిస్తోంది. అంతకుమించి అడవంతా ప్రశాంత గంభీరంగా వుంది.

ప్రళయానికి ముందు, తుఫాన్ రావటానికి ముందు వాతావరణం ప్రశాంతంగానే వుంటుంది! ఇది మరో ప్రళయానికి సంకేతం కాదుగదా అనుకున్నది సౌమ్య. ఆమె మనసు యిదివరకటిలా భయంతో చెదిరిపోవటంలేదు. నిగ్రహాన్ని, ధైర్యాన్ని సంతరించుకుంటున్నది.

ఓ గంట నడిచారిద్దరు.

అకస్మాత్తుగా చెట్లమీద నుంచి పదిమంది మనుషులు

బిల బిల మంటూ కిందికి ఉరికి వాళ్ళిద్దర్నీ చుట్టు ముట్టేశారు.

నిర్ఘాంతపోయి నిల్చుండిపోయారు నవీన్, సౌమ్య.

పోతపోసిన కంచువిగ్రహాల్లా వున్నారు అందరూ. మెళ్ళో పూసలదండలు, చేతుల్లో మొన తేలిన ఈటెలు వున్నాయి. నడుమువరకు యెలాంటి ఆచ్ఛాదనా లేని ఒళ్ళు నల్ల చేవకర్రతో చేసిన కర్రబొమ్మలా నిగనిగ లాడుతోంది. నడుముచుట్టూ జింక చర్మం కట్టుకున్నారు. నెత్తిమీద ఈకలతో చేసిన వలయాకారపు కిరీటాలు పెట్టుకున్నారు.

కోయలు! ఈ అడవి ఆంధ్ర ప్రాంతంలోదో మహారాష్ట్రకు చెందినదో తెలియదు. వాళ్ళకు తమ భాష వచ్చునో, లేదో! వాళ్ళతో మాట్లాడి తమకు ఓ దారి చూపించమని కోరాలి.

సౌమ్యకు, నవీన్‌కు వాళ్ళను చూడగానే ప్రాణం లేచివచ్చింది! వాళ్ళు అపకారం చేసేవాళ్ళలా కనిపించలేరు. తామిద్దరి చుట్టూ వలయాకారంగా తిరుగుతూ కిచ కిచ నవ్వుకుంటున్నారు. వాళ్ళ ఆనందం ఎందుకో అర్థం కాలేదు. నాగరికుల్ని చూసిన సంతోషంవల్ల నేమో; కావచ్చు!

“ఏయ్ పుంజా, ఏయి పెట్టా, వోరు మీరు? ఏడ్నించి వత్తుండ్రు ఎరిక సెయ్యండె హే!” అన్నాడు కోయల్లో ఒకడు.

సౌమ్య, నవీన్ ఒకరిముఖా లొకరు చూసుకున్నారు. వీళ్ళు తమకు సాయం చేస్తారా, లేదా? వీళ్ళు మాట్లాడేది తెలుగులాగానే వున్నది. కాకపోతే కొండజాతివాళ్ళ భాష యాసగానే వుంటుంది.

నవీన్ నోరు తెరిచి చెప్పాడు. "మేము దారితప్పి వచ్చాం. ఈ అడవిలో నుంచి బయటకు పోవటానికి దారి తెలియక యిటు అటు తిరుగుతున్నాం. దారి చూపిం చండి" అని.

"ఏడ్నుంచి వొత్తున్రు?" అడిగాడు మరొకడు.

ఏం చెప్పాలా అని ఓ క్షణం ఆలోచించాడు నవీన్. తర్వాత, "ట్రెయిన్ లో వెళ్తుండగా కాలుజారి క్రింద పడిపోయాం" అన్నాడు. ట్రెయిన్ ను అభినయించి చూపాడు.

కోయవాళ్ళు అనుమానంగా చూశారు నవీన్ వంక.

"ఇద్దరూ ఓ పాలే యెట్టా పడిపోయిండ్రు?" అన్నాడు.

"అసలు యీమె జారిపోతుండగా నేను పట్టుకో బోయాను. కాలు జారి నేనూ యీమెతో కింద పడి పోయాను—రైలు బండి వెళ్ళిపోయింది!" వాళ్ళని నమ్మించటానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు నవీన్.

వాళ్ళందరు ఎగ తాళిగా నవ్వారు కిచకిచ మంటూ కోయభాషలో యేదో చెప్పుకున్నారు. ఒకరికొకరు ఏదో సంకేతం చెప్పుకున్నట్టుంది!

"నీ సేతుల బందూకెట్టొచ్చినాది? యీడ ఏటాడ బోయినవ్, అగునా?" అందులో ఒక కోయ గద్దించి అడిగాడు, నవీన్ చేతిలోని తుపాకీ చూసి.

జరిగిన పొరపాటు అర్థమయింది నవీన్ కి. దాని గురించి చెప్పాలంటే బందిపోట్లు గురించి చెప్పాలి. ఇది నమ్మని వాళ్ళు అది మాత్రం నమ్ముతారని నమ్మకమేమిటి?

నవీన్ యేదో చెప్పాలని నోరు తెరిచాడు. ఇంతలో నే

ఓ కోయ అతని చేతిలోని తుపాకీ విసురుగా లాక్కున్నాడు. మరొకడు అతని నడుముకున్న తూటాల బెల్టు లాగేసుకున్నాడు.

నవీన్ నివ్వెరపోయాడు. వాళ్ళు సాయం చేస్తారనుకుంటే ఎదురుతిరిగా రేమిటి?

"మీ జోడా మా ఎనకపాలి రాండ్రి. మా దొరదగ్గరికెళ్ళాల. మీ యిసయం దొర సూస్కుంటాడు" అన్నాడు ఓ కోయ.

అదేదో వాళ్ళ దొరదగ్గిర చెప్పుకుంటేనే నయమనిపించింది సౌమ్య, నవీన్ లకు. ముందు అయిదుగురు వెనక అయిదుగురు మధ్యన నవీన్, సౌమ్య నడుస్తూండగా కోయ దగ్గరకు ప్రయాణం సాగింది.

• • •

ఓ యిరవై నిమిషాల ప్రయాణం తర్వాత వాళ్ళు ఓ కొండలబారు దగ్గరకి చేరుకున్నారు. అక్కడ కొండ ఏటవాలుగా వున్న ప్రాంతంలో రెల్లుగడ్డితో నేసిన పూరిళ్ళు వున్నాయి.

అదే కోయ గూడెం అని గ్రహించారు నవీన్, సౌమ్య.

ఆ యిళ్ళ మధ్య వెదురుబొంగుల ఫెన్సింగుతో ఎత్తయిన చెక్క కట్టడం కనిపించింది. తక్కిన ఇళ్ళకన్న అది ప్రత్యేకంగా వున్నది—ఏవేవో రంగు రంగుల అల్లికలతో ఎత్తుగా కట్టారు! గోమయంతో ఆవరణంతా అలికి ముగ్గులు పెట్టారు. చూడటానికి ఎంతో ఆర్టిస్టిక్ గా వుందా యిల్లు, దాని పరిసరాలు.

కోయలు అక్కడ ఆగిపోయారు. వాళ్ళల్లో ఒకడు మాత్రం వెదురుబొంగుల గేటు తెరుచుకుని ఆవరణలోకి

ప్రవేశించాడు.

అంతదాకా తక్కిన తొమ్మిదిమంది కోయలు వెదురు బొంగుల ఫెన్సింగ్ కి యివతల మోకాళ్ళమీద కూచున్నారు. ఈ వెల్సి వాళ్ళ కెదురుగా నేలలో గుచ్చిపెట్టుకున్నారు.

అయిదునిమిషాల తర్వాత లోపలికి వెళ్ళిన కోయవాడు బయటికొచ్చాడు. కోయభాషలో సహచరుల కేదో చెప్పాడు. వాళ్ళందరు వాళ్ళ దొరే ఎదురుగా మాట్లాడుతున్నంత శ్రద్ధగా, వినయంగా తల యూపుతూ విన్నారు.

లోపలికి వెళ్ళివచ్చినవాడే, నవీన్ తుపాకీని, బుల్లెట్సున్న బెల్టుని తీసుకుని మళ్ళీ లోపలికి వెళ్ళివచ్చాడు. ఈసారి వాడి చేతుల్లో యేమీ లేవు.

సౌమ్య, నవీన్ నిశ్చలంగా వాళ్ళవైపే చూస్తున్నారు. వాళ్ళ చర్యలు వింతగా అనిపించాయి వాళ్ళకి. అయితే వాళ్ళ ప్రవర్తననుబట్టి యేం జరగబోతోందో ఊహించుకున్నారు. బహుశా వాళ్ళ దొర పంచాయితీ పెడతాడు దానికి కోయ గూడెంలోని ప్రజలందరు హాజరవుతారు. తమమీద విచారణ జరుగుతుంది.

తాను చెప్పిన విషయం నమ్మితే తమ యిద్దర్నీ క్షేమంగా అడవి దాటిస్తారు. లేకుంటే, యేం చేస్తారు? ఏమో....వాళ్ళ పద్ధతులు, ఆచార వ్యవహారాలు ఎలాంటివో! ఏం చేస్తారో వేచి చూడాలి!

అప్పటికి చీకటి పడిపోయింది. బయట సూర్యుడు అస్తమించినదీ లేనిదీ తెలియటంలేదు. చుట్టూ చెట్లు, సూర్యకిరణాలు చూడటానికి అవకాశం లేకుండా దట్టంగా అలుముకున్నాయి. కొండవాలులో మాత్రం చెట్లు యెక్కువగా లేవు. అందుకే వాళ్ళు అక్కడ తమ

నివాసగృహాలు కట్టుకుని వుంటారు!

వాచీ చూసుకున్నాడు నవీన్. అద్దం పగిలిపోయి వున్నది. కాని వాచీ పని చేస్తోంది. అది ఆటోమెటిక్ డే అండ్ డేటెడ్ వాచ్. ఆల్ ప్రూఫ్!

ఆరు గంటల పదినిమిషాలు!

లోపలికి వెళ్ళి వచ్చినకోయ-సౌమ్య, నవీన్‌లను సమీపించి "పొద్దోయినంక మా దొర పంచాయితీ ఎట్టడు. ఈ రేతిరికి ఎదురు బువ్వ ఎట్టమన్నడు. మా గూడెంలో తొంగోమన్నడు. ఎరికేనా?" అన్నాడు.

ఇదేం రూలురా బాబూ అనుకున్నారు యిద్దరు. తమ ప్రయాణం మొదలై యిరవై నాలుగ్గంటలు కావస్తోంది! ఇంతలోనే ఎన్ని గండాలు! ఎన్ని దారుణ సంఘటనలు! ఎన్ని చేదు అనుభవాలు!

అయితే వాళ్ళిద్దరూ బాగా అలసిపోయి వుండటం మూలాన విశ్రాంతి చాలా అవసరమనే స్థితిలో వున్నారు! ఇదీ ఒకందుకు మంచిదే! మానసికంగా, శారీరకంగా పూర్తి విశ్రాంతి తీసుకోవటానికి మంచి అవకాశం! కోయ వాళ్ళ రక్షణ వుంటుంది. కాబట్టి క్రూరమృగాల గురించి బెంగపడనక్కర్లేదు.

కోయలు వాళ్ళిద్దరినీ రెల్లుగడ్డతో నేసిన యిళ్ళ దగ్గరకు తీసుకుపోయారు. అప్పటికప్పుడు ఓ యిల్లు ఖాళీచేసి వాళ్ళకిచ్చారు.

ఆ యిల్లు చూసి నవ్వొచ్చింది వాళ్ళకు. పేరుకు ఇల్లు గాని అది ఒకే ఒక గదిగా అయిదారు గజాల పరిధిలో వలయాకారంగా కట్టబడిన చిన్న గుడిసె. లోపల నేల మీద గడ్డితో అల్లిన చాప! అదే వాళ్ళపాలిట పట్టు పరుపులా వున్నది!

"దొర మీ యిద్దర్కీ ఎదురు బువ్వెట్టమన్నాడు. తింట్రామల్ల? అది గాకపోతే తేని, పల్లు యిమ్మన్నాడు—ఏది గావాలో సెప్పుమీ" అన్నాడు దొర దగ్గరకి వెళ్ళొచ్చిన కోయ.

వెదురుబియ్యంతో వండిన అన్నం గురించి చెపుతున్నాడని అర్థమయ్యింది వాళ్ళకు. ఆకలి విపరీతంగా వున్నమాట నిజమే! కాని వెదురు అన్నం తినటానికి మాత్రం వాళ్ళు సిద్ధంగా లేరు.

"తేనె, పళ్ళు తీసుకురా!" అన్నాడు నవీన్.

ఓ అయిదునిమిషాల్లో యేవేవో రకరకాల మగ్గిన పండ్లు ఓ వెదురుబొంగు నిండా పుట్టతేనె పట్టుకుని యిద్దరు కోయలు వచ్చారు. అవి వాళ్ళకిచ్చి వెళ్ళిపోయారు.

పళ్ళు బాగా ఆరమగ్గి సువాసనలు వెదజల్లుతున్నాయి. ఆకలి, ఆపైన గుమగుమలాడే పండ్లు—వాళ్ళని అవురావురుమని తినేలాగా చేసినయి. పట్టుతేనె తాగనన్నది సౌమ్య.

"కొంచం రుచి చూడు. బావుంటేనే తీసుకోవచ్చును" అన్నాడు నవీన్.

ఆమె అయిష్టంగానే కొంత రుచి చూసింది. చాలా రుచికరంగా వున్నది! తృప్తిగా తాగింది.

ఆమెవంక నవ్వుతూ చూశాడు నవీన్.

ఇద్దరిలోనూ నూతనోత్సాహం పుట్టింది. కడుపు నిండగానే యిద్దరికీ కళ్ళమీదకు నిద్ర ముంచుకు వచ్చింది. అక్కడే కటిక నేలమీద, గడ్డిచాపమీద పడుకుని క్షణాల్లో నిద్రాదేవత ఒడిలో ఒరిగిపోయారు.

* * *

తెల్లవారేవరకు ఒళ్ళెరగకుండా నిద్ర పోయారు సౌమ్య, నవీన్.

ఎవరో తట్టిలేపుతున్నట్టు అనిపించి, చటుక్కున కళ్ళు తెరిచాడు నవీన్.

కోయ దొరతో మధ్యవర్తిత్వం చేస్తున్న కోయ వాడు!

"నీ పేరేమిటి?" అడిగాడు నవీన్.

"సింగడు" అన్నాడు వాడు నవ్వుతూ. వాడి ముఖంలో నవ్వు చూడటం అదే మొదటిసారి. అది ఇది వరకు గుంపుతో నవ్విన వెకిలినవ్వు కాదు, కిచకిచ నవ్వు కాదు! అమాయకమయిన నవ్వు! జీవం వుట్టిపడే నవ్వు! అసలైన కొండజాతి యువకుడి నవ్వు!

"మంచి పేరు!" పొగిడాడు నవీన్. వాడు మళ్ళీ నవ్వాడు అందంగా.

"మీ యిద్దరు జోడా పల్లోముకుంట్రా?" అడిగాడు సింగడు.

నవీన్ గుడిసెబయట పహారాభటుల్లా వున్న కోయ వాళ్ళను చూసి ఉలిక్కిపడ్డాడు.

"ఏమిటి, వాళ్ళందరు అలా కాపలా వున్నట్టు గుడిసె చుట్టూ....?" అడిగాడు నవీన్.

"రేత్తిరంతా మీ ఇద్దర్నీ సూస్కోమని సెప్పిండు మా దొర" అన్నాడు సింగడు.

'చూసుకోవటం' అంటే, తామిద్దరూ ఎటయినా పారిపోతారేమోనని రాత్రంతా కాపలా కాశారన్న మాట! అంటే తమని అంత తేలిగ్గా వాళ్ళు విడిచిపెట్ట రేమో! వాళ్ళ ఆచారాల గురించి, తమనేం చెయ్యాదల్చు కున్నారో ఆ వివరాలు, సింగడిని అడిగితే....?

లేచి కూచోబోయాడు నవీన్. కాని, అతని అవయవాలు సహకరించలేదు. నిన్న ఎలుగుబంటి గాయాలు చేసిన భుజం బాగా నొప్పి చేసింది. అక్కడ నల్లగా కమిలిపోయింది. ఛాతీమీద కూడా బిగపట్టినట్టున్నది చర్మం!

"ఏటయినాది?" అడిగాడు సింగడు.

నవీన్ రెండుక్షణాలు ఆలోచించి, "నిన్న రైలుబండి నుంచి పడిపోయినప్పుడు భుజానికి రాళ్ళు గుచ్చుకుని గాయాలయినాయి" అన్నాడు. ఎలుగ్గొడ్డు విషయం చెపితే ఖచ్చితంగా తాను వేటాడబోయాడనే అనుమానం నిరారణ చేసుకుంటాడు సింగడు! ఇప్పటికే నమ్మటంలేదు.

సింగడు రెండుక్షణాలు నవీన్ ముఖంలోకి చూశాడు. భుజంమ్మీద గాయం చూశాడు. ఆ తర్వాత యేమనుకున్నాడో మౌనంగా బయటికి వెళ్ళిపోయాడు. పది నిమిషాల్లో నే తిరిగొచ్చాడు.

అతని చేతిలో యేవో ఆకు లున్నాయి!

సింగడు ఆకుల పసరు తీశాడు. చేతులమధ్య నలిపి పసరును గాయాలమీద పోశాడు.

చల్లగా తాకింది నవీన్ కి ఆ పసరు! ఎంతో రిలీఫ్ దొరికినట్టనిపించింది. ఓ అయిదునిమిషాల తర్వాత భుజం మీది గాయంవల్ల కలిగిన బాధ ఉపశమించినట్టనిపించింది. అలాగే ఛాతీమీద కూడా పసరు పూశాడు సింగడు!

సౌమ్య అప్పటికే నిద్రలేచి, సింగడి చర్యల్ని ఆసక్తిగా గమనిస్తోంది. సింగడు నవీన్ వంక గర్వంగాను, సౌమ్యవంక నవ్వుతూను చూశాడు!

పళ్ళు తోముకోవటానికి పుల్లలు తెచ్చాడు.

"ఈడకి దరిలోనే కొలనుండాది. తీస్కపోత రాండ్రి" అన్నాడు సింగడు.

సౌమ్య, నవీన్ అతనితో వెళ్ళి పావుగంట తర్వాత గుడిసె దగ్గరికి తిరిగొచ్చారు. రాత్రిలాగానే పళ్ళు, తేనె తెచ్చిచ్చాడు సింగడు.

ఈ అరగంట సాన్నిహిత్యంలోను తమనేం చేయబోతున్నారని అడగటానికి ప్రయత్నించాడు నవీన్. కాని ప్రతిసారి ఆ ప్రస్తావన దాటవేస్తూ వచ్చాడు సింగడు.

పదిగంట లవుతుండగా వాళ్ళని తోడుకునిరమ్మని కబురొచ్చింది కోయదొర దగ్గర్నుంచి.

సౌమ్య, నవీన్ కళ్ళతోనే ఒకరికొకరు ధైర్యం చెప్పుకున్నారు.

కోయదొర ఇంటికి తీసుకెళ్ళారు.

దొర ఇంటి ముంగిట ఎత్తయిన ఆసనం వేశారు. దాని పైన దర్భాసనంమీద హుందాగా, గంభీరంగా కూర్చుని వున్నాడు అరవైయేళ్ళ వ్యక్తి దృఢంగా బలంగా, కనీసం ఆరున్నర అడుగుల పొడవుతో రాక్షసుడిలాగా వున్నాడు.

గూడెంలోని జనమంతా అక్కడే చేరిపోయారప్పటికే. పిల్లలకి అసలు ఒంటిమీద యెలాంటి ఆచ్ఛాదనా లేదు. ఆడవాళ్ళు కూడా నడుమువరకు ఎలాంటి ఆచ్ఛాదనా ధరించలేదు. మోకాలు దిగకుండా ఏవో నారతో నేసిన చీరలు కట్టుకున్నారు. మెళ్ళో పూసల పేర్లు వేసుకున్నారు. కాళ్ళకు లోహపు కడియాలున్నాయి. అమాయకమైన చూపులతో నవీన్ సౌమ్యలవైపే చూస్తున్నారు.

ముసలివాళ్ళు కూడా కోయ యువకులు ధరించినట్లే జింక చర్మాలు కట్టుకున్నారు—కొందరు నారతో నేసిన ఆచ్ఛాదనలు నడుముచుట్టూ కట్టుకున్నారు.

పిల్లలతోబాటు ఎవరూ నోరు మెదపకుండా బొమ్మల్లా నించున్నారు.

నాయకుడు లేచి నించున్నాడు. అతని నోటినుంచి యే మాట వస్తుందోనని అందరూ తదేక దీక్షతో అతని వంకే చూస్తున్నారు.

నాయకుడు నోరు విప్పాడు. "మీ యిద్దరు జోడా మమ్మెవుర్నీ అడుక్కోకండా మా కోనలో అడుగెట్టింద్రు. అస్పాందని బందూకుతో మా సాత్తుల్ని ఏటాడబోయింద్రు. అంచాత మీ యిద్దర్కీ తప్పుగట్టాల. అందికే యీల్లంద్దర్నీ తోల్కొచ్చిన. ఏటయినా సెప్పుకుంట్రా?"

నవీన్, సౌమ్య మొదట్నుంచీ యిలా అవుతుందనే అనుకొంటున్నారు గాబట్టి, అందుకు ఆశ్చర్యపోలేదు.

నవీన్ గొంతు సవరించుకుని సింగడి బృందంతో చెప్పినట్టే అంతా చెప్పుకొచ్చాడు.

కోయదొర తల అడ్డంగా తిప్పాడు.

"మాకు నమ్మిక నేదు. మీ మీన తప్పుగట్టాల. ఏమింటరు గూడెపోల్లు?" అనడిగాడు గూడెం మనుషులవంక చూసి నాయకుడు.

"గట్టాలి, గట్టాలి!" అంటూ సముద్రం ఘోష పెట్టినట్టు గీపెట్టి అరిచారు గూడెం మనుషులందరు ముక్తకంఠంతో.

"ఏయ్ పెట్టా, పుంజా. మీ ఇద్దరు తప్పు సేసింద్రని గూడెపోల్లు గూడా సపుతా వుండినందు సేత మీ ఇద్దర్నీ

గూడెపు కట్టుబడి ప్రకారం మా జెంతువుల సేత సంపిత్తాం. కానియ్యండి” అన్నాడు నాయకుడు జడ్జిమెంటు యిస్తున్నట్టు.

నవీన్, సౌమ్య శిలాప్రతిమల్లా నిల్చుండిపోయారు.

“సింగా, యీల్లను తోల్కపో! సందేల తీరుమానం అమర్జెయ్యాల్సింది నువ్వే ఎరికేనా?” అన్నాడు నాయకుడు సింగడితో హెచ్చరిస్తూన్నట్టు.

“అట్టనే దొరా!” అన్నాడు సింగడు మోకాళ్ళమీద కూచోని, తల వంచి దొరకు ప్రణామం చేస్తూ.

* * *

నవీన్, సౌమ్యలను తిరిగి వాళ్ళ కిచ్చిన గుడిసె దగ్గరికి తీసుకువచ్చారు. తమకి చావు ఖాయమని ఇద్దరూ నిర్ణయించుకున్నారు.

నవీన్ సౌమ్య కళ్ళలోకి చూశాడు. ఆమె కళ్ళలో దీనత్వం లేదు, భయం లేదు, పిరికితనం లేదు, కనీసం ఎలాంటి విచారం కూడా లేదు.

“సౌమ్యా!” మెల్లిగా పిలిచాడు.

అతనివంక చూసింది సౌమ్య.

“మన జీవితాలు కొన్ని గంటల్లో ముగియబోతున్నాయి.”

ఆమె మెల్లిగా తలూపింది.

“ఇలా అర్థాంతరంగా యీ అడవిలో దిక్కుమాలిన చావు మనకు రాసి పెట్టి వుంటుందని కల్లో కూడా ఎన్నడూ అనుకోలేదు.”

“నేను మాత్రం అనుకున్నానా?....కాని చావుకి నేను భయపడటంలేదు; ఎందుకో తెలుసా?”

“ఎందుకు?”

"ప్రాణాలు పోయే ముందే యీ జీవితానికి ఓ అర్థం పరమార్థం లభించాయనే సంతృప్తితో పోతున్నాను కాబట్టి."

"ఏమిటది?"

"నీ ప్రేమ! తలచి తలపించుకున్న జన్మ ధన్యమని యెవరో కవి చెప్పాడుగా! నాది నిస్సారమైన జీవితం కాదు—నా కోసం ప్రాణాన్ని సైతం తృణప్రాయంగా ఎంచిన వ్యక్తి; నావాడు అని చెప్పుకోగలిగిన వ్యక్తి నా చెంతనే నా చివరిక్షణాల్లో వున్నాడు కదా అన్న తృప్తితో చనిపోవటం యెంత మధురం! నా జన్మకీ తృప్తి చాలు!"

"నీకేనా? నాకూ యీ తృప్తి చాలు! పరిపూర్ణమైన, స్వచ్ఛమైన నీ ప్రేమని పొందగలిగినాక యీ తుచ్ఛమైన అశాశ్వతమైన ప్రాణం వున్నా, పోయినా దానికి విలువ లేదు నా దృష్టిలో!" అన్నాడు.

సౌమ్య అతనికి దగ్గరగా జరిగింది. నవీన్ చేతులు చాచాడు. ఆమె అతని చేతుల్లో ఒదిగిపోయింది. ఆమెను గుండెలకి హత్తుకున్నాడు. సౌమ్య రెండు చేతులు అతని భుజాలచుట్టూ వేసి అతని మొహానికి తన మొహం చేర్చింది.

ఇద్దరూ తాదాత్మ్యతలోని ఆనందాన్ని కొద్ది నిమిషాల సేపు అనుభవించారు.

* * *

సింగడు లోనికి వచ్చాడు. "మీకు తినటానికేం కావాలో చెప్పండి!" అన్నాడు తన సహజమైన ధోరణిలో.

నవీన్ సౌమ్య తలలు అడ్డంగా తిప్పారు.

"కొద్ది గంటల సేపట్లో చావబోతున్న వాళ్ళం. మేం తినినా తినకపోయినా ఎలాంటి నష్టమూ లేదు మీ కెవరికీ!" అన్నాడు నవీన్.

"అయినా సరే, ఏదోకటి తినాల్సిందే!" అన్నాడు సింగడు.

నవీన్ సింగడ్ని మాటల్లో పెట్టాడు. కాసేపు పిచ్చాపాటీ కబుర్లేవో చెప్పాడు. చివరిలో "మా శిక్షలు అమలు చేయటానికి యేవో జంతువులు ప్రయోగిస్తారని మీ దొర చెప్పాడు కదా, యేమిటవి? ...." అనడిగాడు.

సింగడు చిన్నగా నవ్వి, "అది రగస్యం. వోరికీ సెప్ప గూడదని మా దేవర ఆన" అన్నాడు.

"ఇక ఎలాగూ కొద్ది గంటల్లో చావబోతున్నాం కదా, మాకు చెప్పటానికేం?"

సింగడు రెండు క్షణాలు డైలామాలో పడ్డాడు.

"మీ యిద్దరి జోడాని దొర యింటి ముంగిట్ల నిలబెడు తరు. ముందుగాల బాగా బలిసిన జాగిలాల్ని వొదిలి పెడ్తరు. అయ్యి మీ జోడాని తరిమిగొడ్తయి. యింగో ఎంపునించి తోడేళ్ళని వొదిలిపెడ్తరు. అయ్యి యింగో ఎంపుంచి తరిమిగొడ్తయి. మరో ఎంపునించి అడవి దున్నల్ని వొదిలిపెడ్తరు. అయ్యి అ ఎంపునించి తరిమిగొడ్తయి. అన్ని ఎంపుల్నించి మీ జోడాని తరిమి తరిమి యేడకి తీస్కపోతయ్యో ఎరికేనా? పులులుండే లోయ దిక్కు. ఒకేపాలి నాలుగో అయిదో పులులు ఒక్కలాగ మీదపడి సంపుకు తింటయి. - అదీ తీరుమానం!" అన్నాడు.

సౌమ్య, నవీన్‌ల గుండెలు గుబేలుమన్నాయి. ఎంత దారుణంగా చంపుతున్నారు? నాయకుడు చెప్పినట్టే

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 6/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. పూర్తి వివరాలకు పత్రిక చూడండి.

అయితే, ఈ స్కీము అపన ఏజంట్లు వున్న ప్రాంతాలకు వర్తించదు. మీరు హోమ్ డెలివరీ సభ్యత్వము పంపేముందు మీ వూరిలో మా ఏజంటు లేడనే విషయం నిర్ధారణ చేసుకోండి.

నేడే మీరూ 'హోమ్ డెలివరీ'లో చేరండి!

వాళ్ళ చేతులతో చంపకుండా, అడవిలోని జంతువుల చేత నే చంపిస్తున్నారన్న మాట! తామిద్దరు కావాలని వేటకోసమే అడవిలోనికి ప్రవేశించినట్టు నమ్మి, యే జంతువులనయితే వేటాడబోయారో, ఆ జంతువుల చేత నే తమను వేటాడటానికి నియోగించిన యీ గూడెంవాళ్ళని అమాయకు లనుకోవాలా? దుర్మార్గు లనుకోవాలా? మూర్ఖు లనుకోవాలా?

తమ గోడు వినేవాళ్ళెవరూ లేరు ఇక్కడ. శిక్ష అమలుజరపక మానరు. దారుణమైన శిక్ష! తాము యే నేరం చేయకపోయినా, చెయ్యలేదని ఎంతగా మొత్తుకున్నా ఆ గూడెంవాళ్ళు వినిపించుకోరు!

సౌమ్య అడిగింది. "పులుల లోయకు వెళ్ళేలోపల మమ్మల్ని వెంటతరిమే జాగిలాలుగాని, తోడేళ్ళుగాని, అడవిగున్నలుగాని చంపి తినేస్తే....?"

సింగడు చిన్న స్వరంతో అన్నాడు: "ఒక్కోపాలి అట్టాగూడా జరుగుద్ది. ఎట్టాగయితే నేంగాక, తీరుమానం అమల్జరగటమేగందా కావాలి!" తర్వాత లేచి నించుని వాళ్ళిద్దరివంకా జాలిగా చూశాడు. ఎందుకో వాడి చూపులు యెక్కువసార్లు సౌమ్యమీద నిలిచాయి.

సింగడు సౌమ్యవంక కన్నార్పకుండా చూస్తున్నాడు. దగ్గరగా వచ్చి ఆమె ముఖంలోకే పరీక్షగా చూస్తున్నాడు. ఆ చూపుకి భాషతో పనిలేదు. పశువుకి కూడా అర్థమయ్యే భాష అది! సౌమ్యకు వంటిమీద తేళ్ళు జెర్రులు పాకినట్టు గగుర్పాటు కలిగింది.

నవీన్‌కి కూడా అతని చేష్టలు చిరాకును, అసహనాన్ని కలిగించాయి — కాని తమాయించుకున్నాడు.

సింగడు వాళ్ళిద్దరివంకా నవ్వుతూ చూశాడు. ఆ

నవ్వు అమాయకంగా లేదు, నిష్కల్మషంగా లేదు, స్వచ్ఛంగా లేదు — కుటిలత్వం కుతంత్రం నిబిడీకృతమైన వక్రమైన నవ్వది!

"మీ యిద్దర్నీ యీడనించి తప్పించాలని మనసు పుట్టినాది నాకు" అన్నాడు చల్లగా సింగడు.

సౌమ్య, నవీన్ ఆశ్చర్యంగా చూశారతనివంక.

"ఏమిటి నువ్వు చెపుతున్నది? మీ నాయకుడు శిక్ష అమలుజరపటం లేదా?" అన్నారు.

"అయ్యన్నీ నే సూసుకుంటాను. మీ యిద్దరు నే జూపించిన జాగాకాడ కూసింతసేపు ఎదురు సూసినారంటే యీ కోన దాటించి పంపిస్తను" అన్నాడు సింగడు సౌమ్యవంక భావయుక్తంగా చూస్తూ.

"మరి సయట కాపలావున్న నీ వాళ్ళ సంగతి?" అన్నాడు నవీన్, బయటకి చూపించి.

"అటు సూడు!" అన్నాడు సింగడు.

సౌమ్య, నవీన్ బయటకి చూసి ఆశ్చర్యపోయారు.

అక్కడ కాపలా వుండిన యువకులు లేరిప్పుడు.

సింగడు నవ్వుతూ చూశాడు. "లెగండి, నే దా. జూపిస్త. ఎంటరావటం యీలుగాదు. దిశ జూపిస్తరి ఓ అరగడియ పోయినంక వొచ్చి కలుస్త" అన్నాడు.

సౌమ్యకు అంతా కలలాగా వుంది.

ఇద్దరు సింగడి వెంట బయటికొచ్చారు. దూరంగా కోలాహలంగా వుంది. సౌమ్య, నవీన్ అటు చూశారు. నాయకుడి యింటి ముంగిట శిక్ష అమలుజరపటానికి రంగం సిద్ధమవుతోంది. అప్పటికే గూడెం జనమంతా అక్కడికి చేరిపోయారు. నాయకుడు యింకా ఆసనం అలంకరించలేనట్టుంది, ఖాళీగా వున్నది!

(సశేషం)

